**Series No. 10.**

**Katyakala Vignana Grandha Mandali.**

# TAJ MAHAL.

— BY —

*M. R. Ry. Nandury Venkata Subba Rao,*
*Pantulu Garu, B. A.,*
*Azzampudi Mukhasadar,*
*Manager, Gutala Taluk, Etc., Estates.*

## PART I.

*Publisher*
**D. Gopalakrishna, [illegible]**

నాట్యకళా విజ్ఞాన గ్రంథమండలి

పదియవ కుసుమము.

# తాజ్ మహాల్.



## 1 వ భాగము.

గూటాలవగ్గెరా యెస్టేట్లు మేనేజరుగారైన

మ॥రా॥శ్రీ నందూరి వెంకటసుబ్బారావు పంతులు, బి. ఏ.

గారిచే రచియింపఁబడి

కాకినాడ నాట్యకళావిజ్ఞాన గ్రంథమండలి వారిచే

ప్రకటింపఁబడియె.

---

సంపాదకుడు :

చాల్లాబాదా గోపాలకృష్ణారావు, బి. ఏ.

---

మొదటికూర్పు 500 ప్రతులు

కాకినాడ

రంగా అండ్ కో., ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.



[వెల రు 1—0—0

# నాట్యకళా విజ్ఞాన గ్రంథమండలి.

## రాజపోషకులు.

1 మ॥రా॥రా॥ యన్. బలరామమూర్తినాయుడుగారు,
బి. ఏ., బి. యల్., చెన్నపట్నం.

2 ,, వారణాసి సీతారామయ్యగారు, బి. ఏ.,
సబ్ మేజస్ట్రీటు, గన్నవరం.

3 ,, శీలంశెట్టి వెంకటరత్నంనాయుడుగారు, డి. పి. డబ్లి
యూ అసిస్టాంటు ఇంజనీరు, పెనమన్ లింగారెడ్డిపాలెం.

4 ,, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు,
చెన్నపట్నం.

5 ,, యన్. వి. సుబ్బారావుగారు, బి. ఏ.,
గూటాలయెస్టేటు మేనేజరు.

## పోషకులు.

6 ,, పైండా శ్రీరామకృష్ణయ్య బ్రదర్సు,
జమీందార్లు, కాకినాడ.

7 ,, వారణాసి బాపయ్యగారు, బి. ఏ., క్యాషియరు,
ది. కో. బ్యాంకి, చెన్నపట్నం.

8 ,, అంగర వెంకటసుబ్బారావుపంతులుగారు,
రామచంద్రపురం.

9 ,, మాజేటి మునెయ్యగారు, బి.ఏ., బి యల్.,
రాజమండ్రి.

10 మ॥రా॥శ్రీ కుత్తా సత్యప్రసన్నం బ్రదర్సు, బ్యాంకర్సు,
కాకినాడ.

11 ,, దేవులపల్లి విశ్వనాథంగారు, ఆకిరిపల్లి.

12 ,, ధూళిపాళ్ల వెంకటరత్నంగారు, గ్రామమునసబు,
పురుషోత్తపట్నము.

13 ,, దర్భా వెంకటశివరామరావ్‌గారు, బి.ఏ., బి.ఎల్.,
కాకినాడ.

14 ,, చెలికాని రామస్వామిబాబుగారు,
అసిస్టెంటు యింజనీరు, సామర్లకోట.

15 ,, అంగర వెంకటకృష్ణారావుపంతులుగారు, ప్లీడరు,
కాకినాడ.

16 ,, కొత్త వెంకటరత్నంగారు, యానాం.

17 ,, దసిగె వెంకటేశ్వరరావుగారు, గుడివాడ.

18 ,, కె. వి. రమణారావుగారు, Representative Confectionery Dept. Parry & Co., Ltd., Madras.

19 ,, జమ్మి వెంకటసుబ్బారావుపంతులుగారు,
Tq. Office, Cocanada.

20 ,, పైండా సూర్యనారాయణమూర్తిగారు,
జమీందారు, బ్యాంకర్సు, కాకినాడ.

21 ,, యం. వి. రాజరత్నంగారు, బి. ఏ., కాకినాడ.

22 ,, జల్లెళ్ల తిరుమల వెంకటలక్ష్మీబాయమ్మగారు,
Guardian, Minor, Zamindar of Vilasa Jalamudi etc., Perur.

23 ,, ధరణిప్రగడ బాపిరాజుగారు, కాకినాడ.

24 ,, Nandagiri V. Ramadas Pantulu grru.

25 మ॥రా॥శ్రీ దామోజిపురపు నరసింహారావుపంతులుగారు,
తాడేపల్లిగూడెం.

26 ,, పోలూరి వెంకటప్పయ్యపంతులుగారు, తాణేదారు,
రేపూడి యెస్టేటు.

27 ,, పులుపుల సత్యనారాయణగారు, నర్సారావుపేట.

28 ,, శ్రీరాజా సురభి మురళీకృష్ణరావు బహద్దర్,
జమీందారుగారు, మెడ్రాసు.

29 ,, శ్రీ వైశ్య శాలమిత్రి గ్రంథాలయం,
నర్సారావుపేట.

30 ,, వెలమూరి కంటుంబరావుగారు, అవనిగడ్డ.

31 ,, లింగం లక్ష్మీజగన్నాధరావుపంతులుగారు, బి ఏ,
డిప్యూటీ తహసీలుదారు, అలమూరు.

32 ,, శ్రీరాజా మల్రాజు వెంకటరామకృష్ణ కొండలరావు
బహద్దర్ జమీందారుగారు, కుమారరాజా,
నర్సారావుపేట.

33 ,, నాగనరవు సుబ్బారాయుడు శ్రేష్టిగారు,
వైస్-చైర్మన్, మ్యునిసిపల్ కౌన్సిలరు,
నర్సారావుపేట.

34 ,, చింతపల్లి గోపాలకృష్ణయ్యగారు,
తాలూకాగుమస్తా, నర్సారావుపేట.

35 ,, దిడుగు మల్లిఖార్జునరావుగారు, డిప్యూటీకలెక్టరు
కచ్చేరీగుమస్తా, నర్సారావుపేట.

10 మ॥రా॥శ్రీ ముత్తా సత్యప్రసన్నం బ్రిడర్సు, బ్యాంకర్సు, కాకినాడ.

11 ,, దేవులపల్లి విశ్వనాథంగారు, ఆకిరిపల్లి.

12 ,, ధూళిపాళ్ల వెంకటరత్నంగారు, గ్రామమునసబు, పురుషోత్తపట్నము.

13 ,, దర్భా వెంకటశివరామరావ్‌గారు, బి.ఏ., బి.ఎల్., కాకినాడ.

14 ,, చెలికాని రామస్వామిబాబుగారు, అసిస్టెంటు యింజనీరు, సామర్లకోట.

15 ,, అంగర వెంకటకృష్ణారావుపంతులుగారు, ప్లీడరు, కాకినాడ.

16 ,, కొత్త వెంకటరత్నంగారు, యానాం.

17 ,, దసిగె వెంకటేశ్వరరావుగారు, గుడివాడ.

18 ,, కె. వి. రమణారావుగారు, Representative Confectionery Dept. Parry & Co., Ltd., Madras.

19 ,, జమ్మి వెంకటసుబ్బారావుపంతులుగారు, Tq. Office, Cocanada.

20 ,, పైండా సూర్యనారాయణమూర్తిగారు, జమీందారు, బ్యాంకర్సు, కాకినాడ.

21 ,, యం. వి. రాజరత్నంగారు, బి. ఏ., కాకినాడ.

22 ,, జల్లేళ్ల తిరుమల వెంకటలక్ష్మిబాయమ్మగారు, Guardian, Minor, Zamindar of Vilasa Jalamudi etc , Perur.

23 ,, ధరణిప్రగడ బాపిరాజుగారు, కాకినాడ.

24 ,, Nandagiri V. Ramadas Pantulu grru.

25 మ॥రా॥శ్రీ దామోజిపురపు నరసింహారావుపంతులుగారు, తాడేపల్లిగూడెం.

26 ,, పోలూరి వెంకటప్పయ్యపంతులుగారు, ఠాణేదారు, రేపూడి మొస్తేటు.

27 ,, పులుపుల సత్యనారాయణగారు, నర్సారావుపేట.

28 ,, శ్రీరాజా సురభి మురళీకృష్ణరావు బహద్దర్, జమీందారుగారు, మెడ్రాసు.

29 ,, శ్రీ వైశ్య శాలమిత్రగ్రంధాలయం, నర్సారావుపేట.

30 ,, వెలమూరి కుటుంబరావుగారు, అవనిగడ్డ.

31 ,, లింగం లక్ష్మీజగన్నాధరావుపంతులుగారు, బి ఏ, డిప్యూటీ తహస్సీలుదారు, అలమూరు.

32 ,, శ్రీరాజా మల్రాజు వెంకటరామకృష్ణ కొండలరావు బహద్దర్ జమీందారుగారు, కుమారరాజా, నర్సారావుపేట.

33 ,, నాగసరపు సుబ్బారాయుడు శ్రేష్టిగారు, వైస్-ఛైర్‌మన్, మ్యునిసిపల్ కౌన్సిలరు, నర్సారావుపేట.

34 ,, చింతపల్లి గోపాలకృష్ణయ్యగారు, తాలూకాగుమస్తా, నర్సారావుపేట.

35 ,, డిడుగు మల్లిఖార్జునరావుగారు, డిప్యూటీకలెక్టరు కచ్చేరీగుమస్తా, నర్సారావుపేట.



# ఉపోద్ఘాతము.

భూమండలి ప్రచురించుటకు నవలలు కావలయునని ప్రసంగవశమున రంగా అండ్ కో., ముద్రాలయమునకు ప్రొప్రైటరు గారగు మ॥ రా॥ శ్రీ పట్టమట్ట రంగారావుపంతులుగారితో నేనొకనాఁడంటిని. వారు తమయొద్ద గూటాలవగైరా ఎస్టేట్ల మేనేజరు గారైన మ॥రా॥శ్రీ నండూరి వెంకటసుబ్బారావుపంతులు, బి. ఏ., గారిచే రచింపఁబడిన తాజ్ మహల్ అను చరిత్రాత్మకనవల కలదనియుఁ జక్కని మృదుశైలిని వ్రాయఁబడినదనియుఁ జెప్పి వ్రాతప్రతియొకటి నాకొసంగిరి. నే దీనిని బహుశ్రద్ధతోఁ జదివిచూచితిని. అందలిశైలి మృదుమధురమనుట నిస్సందేహము. పదలాలిత్య మనుపమేయము. వర్ణనాంశ మతిసుందరము. కథ చరిత్రాత్మకమై మొగలాయీసామ్రాజ్యవైభవమును హైందవస్త్రీల పట్టుదలయు దేశాభిమానమును బ్రకటించుచున్నది. జులేఖా సాహసకార్యములు బెహారీచరాను మాయోపాయములు, జహంగీరు రాజకీయపరతంత్రత, నూర్జహాను బుద్ధికుశలత, ఖురుంరాకుమారుని మనోనిర్మలత, లూలియా పవిత్రప్రేమ సులభశైలి నందఱకు విశదమగురీతి వర్ణింపఁబడినవి. ఫత్తేపూరుసిక్రీయందుఁ బ్రదర్శింపబడిన యద్భుతచర్యలకెవరి మానస మాశ్చర్యభయముల కాస్పదంబు గాకుండును! నూర్జహాను వంటి చండశాసనురాలి కనుబ్రామి తప్పించుకొని ఖురుంరాకొమరునకుఁ దనకూతునిచ్చి వివాహమొనరించి జహంగీరంతవాని మెప్పించి రక్తపాతమన్నమాటలేకనే తనకార్యము సాధించిన జులేఖాయొక్క కుశాగ్రబుద్ధికి సంతసింపనివా రెవరు? ఈగ్రంథకర్త గ్రామ్యము ను

పయోగింపక నందఱకుఁదెలియునట్లు మృదుపదములతో గొప్పవిష యములవర్ణించిన పదలాలిత్యము ప్రశంశనీయము. కథాబాహుళ్య ముచే నీనవల రెండుభాగములుగాఁ బ్రచురింపఁబడుచున్నది. ఈనవ లను మామండలికి నుచితముగానొసంగిన గ్రంథకర్తగారి యౌదా ర్యమునకు మండలీ వారనేకవందనము లర్పించుచున్నారు. ఈమనో హరమైన నవల ప్రచురింపఁబడుటకు ముఖ్యకారకులు శ్రీ పి. వి. రంగారావుపంతులుగారే. వారికి మండలీవారు సదావిధేయులు. ఇట్టి రసవంతములైన నవలలఁ బ్రచురించుటకు మామండలి కుతూ హలపడుచున్నది. ఆంధ్రులందరు దీనినిజదివి యానందింతురుగాక.

ఇట్లు విధేయుడు,

కాకినాడ,
7-9-1934.

దాల్తాబాదా గోపాలకృష్ణారావు, బి. ఏ.,
సంపాదకుఁడు.

# తాజ్ మహల్.

## ౧వ ప్రకరణము.



మన యార్యావర్తము కొంతకాలము మహమ్మదీయులవల్లఁ బాలింపఁబడియుండెను. అందులో నొక తెగవారైన మొగలాయీలు క్రీ॥శ॥ 1526 సం॥ నుండి హిందూదేశము పరిపాలించుచుండిరి. మొగలాయీచక్రవర్తులలో నక్బరుపాదుషా చాలప్రసిద్ధికెక్కి హిందువులను మహమ్మదీయుల నొకేరీతిగాఁ జూచుచుండెను. ఈయనకాలమందు మొగలాయీసామ్రాజ్య మార్యావర్తము యావత్తును వ్యాపించెను. వీనికి ముఖ్యసహాయులు రసపుత్రులు. ఈచక్రవర్తి కుమారుఁడగు జహాంగీరే మన కథానాయకుఁడు. జహాంగీరుకాలమందు మొగలాయీసామ్రాజ్యమెక్కువ ఖ్యాతివహించియుండెను. మన మూహించతగ్గ యన్నివిధముల సౌఖ్యములకు నప్పటి మొగలాయీదర్బారాస్పదముగానుండెను. ఎక్కడఁజూచినను విషయసంబంధములైన సౌఖ్యములే. త్రాగుడు వ్యభిచారములకు నంతులేదని యే చెప్పవచ్చును. వీనికొఱకు లక్షలకొలఁది కోట్లకొలఁది ధనము వ్యయమగుచుండెను బేగముమహల్‌లో ననగా చక్రవర్తిజనానలో నిటలీ, పరిషియా, బెంగాలు మొదలగు వివిధదేశముల సుందరీమణులు నివసించుచుండిరి ఆమహల్‌యొక్క యందము దేవేంద్రుని నందనవనమునకుఁ దుల్యమగుచుండెను. వేయేల యదిభూలోకస్వర్గమనియే చెప్పవచ్చును. ఢిల్లీనగరమందలి ప్రతిగృహము యేదోయొక

యద్భుతమునకుగాని, రహస్యమునకుగాని, విలాసమునకుగాని, యాస్పదముగానుండెను. సిరిసంపదలయందును, సౌఖ్యమునందును, మర్యాదలయందును, ఢిల్లీచక్రవర్తుల దర్బారునకు సమమగునది ప్రపంచమంతటను మఱియొకటి లేనియుండదు.

ఇట్టికాలమందు నొకప్పుడు ఢిల్లీ యాగ్రానగరములయందు నివసించు ప్రజలలో నొక యాందోళనము బయలుదేరెను. రాజమందిరమునందును, కుటీరమునందు, వీటిలోను, బజారున, బహిరంగస్థలములందును, జనానాయందు నెక్కడఁజూచిన నొకటే ప్రసంగము. ఒకటేమాట. ప్రతిమనుష్యుఁడును భావగర్భితమై భయముతోఁ గూడియుండి యొకేసమాచారము చెప్పుకొనుచుండెను. ఆసమయమందుఁ బట్టణమార్గమందెవ్వరైన నొకక్రొత్తబాటసారి పోవుచుండినయెడల నెండసాధారణమైనదియు, భయోత్పాతముగలదియు నగు నొకానొక కార్యమప్పుడు జరిగియుండెనని భావింపకపోడు. అప్పటి జనులమనస్సుల వేధించు సంఘటనలు మూఁడు.

మొదటిది—యుద్ధము జరుగనున్నదనుభీతి—ఇందుకుఁ గారణము చక్రవర్తి రెండవకుమారుఁడగు ఖుసుము రహస్యముగా రాజభవనమునుండి పాఱిపోవుటయే. తండ్రికొడుకులకుఁగాని, యన్నదమ్ములకుఁగాని యుద్ధము జరుగుననియు, యుద్ధమువలననేక గ్రామములు పల్లెలు నాశనమగుననియు, సాస్తికి, జనులకుఁ జాలనష్టములు సంభవించుననియు, బహురక్తపాతమగుననియుఁ, దుట్టచివరకెవరు సింహాసన మాక్రమించెదరో తెలియదనియు జనులుగుంపులుగూడి తమలోఁదాము తహతహపడుచుండిరి.

రెండవది—ఆశ్చర్యమైన ఖూనీపరంపరలు—రాజకుమారుఁడు రాజభవనమునుండి పాఱిపోయినదిమొదలు ప్రతివారము ఢిల్లీ

నగరద్వారముదగ్గఱ నొకచంపఁబడిన మనుష్యునియొక్క శవము కనఁబడుటయు, నాశవమెవరిదైనది గుర్తించుటకు వీలులేనట్లుగా దుస్తులుగాని, యాభరణములుగాని లేక, స్వాభావిక దిగంబరరూపముతో నుంచఁబడుటయుఁ గనఁబడుచుండెను. జాగ్రత్తగా పోల్చిచూచిన నవి గొప్పకుటుంబములలోనుండు మహమ్మదీయయువకుల శవములవలెఁ గాన్పించుచుండెను. ఆకళేబరములయందు గాయములుగాని, వధకుసంబంధించిన మఱి యితరగుర్తులుగాని లేక వస్త్రహీనముగా నుండుటవల్ల జనుల యాందోళనకు మఱింత యెక్కువకారణము గలిగెను.

మూఁడవది—అస్వాభావికమైన భూతపిశాచ సంబంధమైన యున్నవి.

మొదటిది యాగ్రానగరమునందును, రెండవది ఢిల్లీనగరము నందును, మూఁడవది పత్తేపూరుసిక్రి యను గ్రామమునందును జరుగుచుండెను. ఈమూఁడింటికి నొకదానితో నొకటి సంబంధముగల దని జనులు చెప్పుకొనుచుండిరి. కాని యెవరును వానియొక్క యుత్పత్తి తెలిసికొనలేకపోయిరి. గనుక జనులు భయోత్పాతముతోఁ దమలోఁదామీసంగతులు రహస్యముగా చెప్పుకొనుచు, నేసమయమందుఁ దమకేయాపద సంభవించునోయని భయకంపితగాత్రులై యుండిరి.

పత్తేపూరుసిక్రియందు జరుగు పిశాచచేష్టలవిషయమై మనము మొదట విచారించెదము. పత్తేపూరుసిక్రి యనునది యాగ్రానగరమునకు 30 మైళ్లదూరములో నొకకొండమీఁద యక్బరుపాదుషావల్ల కట్టఁబడి రాజధానిగా వాడఁబడుచుండెను. కాని యక్కడ సరియైన మంచినీళ్లవసతి లేనిహేతువుచే నక్బరదివిడిచి యాగ్రానగ

రమును దన రాజధానిగాఁ జేసికొనెను. ఫత్తేపూరుసిక్రి యక్బరు కట్టుటకుఁ దగిన కారణముగలదు. అక్బరుచక్రవర్తికి సలీమను నొక తురకఫకీరునందుఁ జాల నమ్మకముండెడిది. ఆఫకీ రీకొండప్రదేశములోఁ గాపురముండెడివాఁడు. అక్బరుచక్రవర్తికి చాలకాలమువరకు సంతతిలేక యీఫకీ రాశీర్వాదమువల్ల నొకకుమారుఁడు గలిగెను. ఫకీరునందు గౌరవముచూపుటకై యక్బరాస్థలమందు మక్కాఁమసీదుతోఁ దుల్యమగు నొకమసీదును గట్టుటయేగాక తనకుమారునకు సలీమని నామకరణముచేసి యక్కడనే తనరాజధాని నేర్పాటుచేసికొనుటకు నగరముకట్ట ప్రారంభించెను. అనేకదేశములనుండి శిల్పనిపుణులగు పనివారిని పిలిపించి భవనములు కట్టించెను. గాని యవి పూర్తిగాకపూర్వమే వానినివిడిచి యాగ్రాచేరెను. ఫకీరు స్వర్గస్థుఁడైనపిమ్మట నతనిగోరీ యొకటి యాప్రదేశమందుఁ గట్టఁబడెను. గోరీ మసీదుల కావలానిమిత్తమొక మౌలవీ (మహమ్మదీయపండితుఁడు) యక్కడ కావలా యుంచఁబడెను. జహంగీరుకాలమందు నలాబత్ ఖానను నొక ముసలిమహమ్మదీయ యుమ్రావు (దర్బారులో నొక గొప్పయధికారి) చక్రవర్తియాజ్ఞతీసికొని శిధిలమై పాడుబడిన రాజభవనముల తాలూకు యొక యింటిలోఁ గాపురముండుచుండెను. అతఁడు వృద్ధుఁడగుటచే నక్కడ భగవధ్యానముతోఁ గాలము గడుపుచుండెను. వానికి దేహయాత్రకు సరిపోవునట్లు కొద్దిపాటి యుపకారవేతనము (పింఛను) చక్రవర్తి యిచ్చుచుండెను. ఈయన గృహకృత్యములు నెరవేర్చుటకై హమీదాయను నొకపరిచారికయుండెను. వీరిద్దఱుగాక 15 సంవత్సరముల ప్రాయముగలిగినట్టి సర్వాంగసుందరియగు లూలియా యను బాలిక పూవుతోటయందందముగాఁ బరిమళించు పుష్పమువలె నాశిధిలసౌధప్రాంత

భూమియందుఁ బ్రకాశించుచుఁ దన తాతగారైన సలాబత్తునకు బహిఃప్రాణమై యుండెను.

## ౨ వ ప్రకరణము.

సాయంసమయము. సూర్యభగవానులు పశ్చిమసముద్రము నందుఁ గ్రుంకుచుఁ దన సహస్రకిరణములచేఁ బత్తేపూరుసికిఁ చుట్టునుండునట్టి పర్వతములకు బంగారుపూత పెట్టుచుండెను. సంధ్యారాగము దిఙ్మండల మంతయు వ్యాపించియుండెను. అనేకజాతి పక్షులు వృక్షశాఖలయందుఁ గూర్చుండి మృదువుగను గరిసముగను గూఁతలు కూయుచుండెను. చీఁకటిపడినకొలఁది యాపక్షులు రాజ భవనముయొక్క పాడుబడినట్టియు, నిర్జనమైనట్టియు, గదులయందుఁ జొరఁబడి విశ్రమింపఁజొచ్చెను. కొద్దిదూరములోనున్న మసీదునం దుండెడి పూజారియొక్క ప్రార్థనలధ్వని వినవచ్చుచుండెను. ఆసమయమందు లూలియా తన యందమైనతలమీఁద నీటికడవ నుంచుకొని నీటినిమిత్తము రాజభవనమునకుఁ బడమటిదిశగానుండు నూతి యొద్దకు వెళ్లుచుండెను. ఆమె నూతియొద్ద నెత్తుగానున్న యరుగు మీఁదఁ గడవనుంచి పశ్చిమాబ్ధిలో మునుఁగుచున్న సూర్యబింబము యొక్క యందమును బరిశీలించుచుండెను. ఆసంధ్యారాగమందామె యొక్క సౌందర్యము వర్ణనాతీతముగానుండెను. సంధ్యాభామిని సౌందర్యరాశియగు నీపడుచును తన యొడియందుంచుకొని ముద్దాడునట్లాసమయమందుఁ గనఁబడెను. అట్టి మృదుశరీరముగల యాబాల, మృణాళములవంటి తనచేతులతో నూతినుండి నీరు తోడుట

యా ? ఇంతకష్టమైనపని యట్టి మృదుగాత్రిమునకుఁ దగునా? కాని యీపని యాలూలియా లెక్క చేయలేదు. సామాన్యసంసారియొక్క పిల్లవలె లూలియా గృహకృత్యసంబంధమైన ప్రతిపనియుఁ జే యుచుండెను. ఎన్నఁడైన హామీాడా కష్టపుపనిచెయ్యవలదని తన్నా జ్ఞాపించిన నాబాలిక యందుకంగీకరించక నట్టిపని చేయుటయందే సంతోషముపొందుచుండెను. హామీాడా తనయొక్క యాజ్ఞ నుల్లం ఘింపఁబడుట తెలిసికొనిఁ "బిడ్డా ! నీయిష్టమువచ్చినట్లు చేయుము. నీవు నేను చెప్పునది విను దానవు కావు" అని యూరకుండును. లూ లియా నడుముబిగించుకొని గృహకృత్యములన్నియు నిర్వర్తించు చుండును.

ఆప్రకారము లూలియా సూర్యాస్తమయ సమయముయొ క్క మనోహరదృశ్యము తదేకదృష్టితోఁ గొంతసేపుచూచి యెట్ట కేలకు స్మృతి దెచ్చుకొనెను. అప్పుడామెకు వెనుకవైపున మనుష్యుఁ డు నడిచినట్లు కాళ్లచప్పుడు వినుపించెను. తానాలస్యముచేసినందు కుఁ గారణముకనిపెట్టుటకై హామీాడా వచ్చుచున్నదేమోయని వె నుకకుఁజూడగా నెవరును గనుపించలేదు. అప్పుడు తాను నూతినుండి నీరుతోడుటకుఁ బ్రయత్నించఁగా వెనుకనుండి యొకవ్యక్తి మృదు మధురస్వరముతో నెమ్మదిగా నీవిధారమనెను. "అమ్మాయీ! అది నాకిమ్ము. నీకొఱకు నేను నీరుచేదెదను. నీమృదువగు హస్తము నొచ్చును !" ఆశ్చర్యముతో లూలియా వెనుకకుఁ దిరిగిచూచెను. ఈపాడుపడిన గ్రామములో నేను నా తాతగారైన సలాబత్తు పురా తనపు నౌకరులైన మహమ్మదుజాన్ హామీాడాలుతప్ప నింకొక వ్యక్తిలేదు. సలీమ్ము దర్గాతాలూకు మొల్లా యీవైపునకెన్నఁడును రాఁడు. ఈమనోహరమగు మృదువైన స్వరమెవ్వరిదో! అని యాలో

చించుచు లూలియా వెనుకకుఁజూడఁగా నొక సర్వాంగసుందరి యగు నువతీలలామ కనుపించెను. 'ఈస్త్రీరత్న మీపాడుపడిన గ్రామమున కెట్లువచ్చెనో' యని లూలియా యాశ్చర్యపడసాగెను. ఆమెయొక్క వయస్సు 25 సంవత్సరములు. అనఁగాఁ దనకంటె సుమారు 8, 10 సంవత్సరములెక్కువగా నుండెనని యామె యూహించెను. ఈక్రొత్తవ్యక్తి యొక ముతకబట్ట కట్టుకొనియుండెను. స్వాభావికముగా నందమైన యామెశరీరమందాభరణము లేవియును లేవు. ఆమె యొక బీదవానికుమార్తెవలెఁ గనఁబించెను. కాని యట్టి యందకత్తె బీదవానిగృహమందు నివసించునాయని యాశ్చర్యముతో నావ్యక్తివంక లూలియా తదేకదృష్టితోఁ జూచుచుండెను.

లూలియా పట్టణముల జనసమ్మర్దమందుగాక నొంటరిగా నుండు కుగ్రామములలోఁ బెంపఁబడెను. తలిదండ్రులతోఁగాని యితరబంధువులతోఁగాని కలిసిమెలసియుండు భాగ్యమామె నోచియుండలేదు. ఆమెతాత సలాబత్తు ఢిల్లీనగరమునకు సమీపములోనుండినను జనసామాన్యముతోఁగలిసి తిరుగుటకు లూలియా కవకాశమెన్నఁడు నిచ్చియుండలేదు. ఆమె యమాయకత్వమునకుఁ బుట్టినిల్లై యుండెను. తన యెదుటనున్న క్రొత్తవ్యక్తియొక్క శరీరమందుండెడి రహస్యములు చిత్రములు లూలియా కనిపెట్టఁజాలకపోయెను. తన యమాయకపుహృదయమందు నెట్టి యనుమానమును జనించియుండలేదు. ఆమె, స్నేహితుఁడెవఁడో, శత్రువెవఁడో, యమృతమేదియో, విషమేదియో గ్రహించ శక్తిలేనిదై యుండెను.

నూతనవ్యక్తి తిరిగి మృదుమధుర స్వరముతో నిట్లనెను. 'అందమైన నీమృదుహస్తముతో నూతినుండినన్ను నీరుతోడనిచ్చెడి

మనుజుఁ డీప్రపంచమందతిక్రూరుఁడై యుండవలెను. దయచేసినాకు త్రాగుటకు నిమ్ము. నేను నూతినుండి నీకొఱకు నీరుచేదెదను.' "ప్రతిదినము నేనిట్లు నీరు చేదెదను. ఇది నాకలవాటే. నిన్నిదివరలో నెన్నఁడును జూచియుండలేదు. దయచేసి నీవెవరవో చెప్పుము.' అని లూలియా యనెను. ముఖమందుఁ జిఱునవ్వంకురింపఁగా నానూతనవ్యక్తి యీప్రకారము జబాబుచెప్పెను. 'నేనొక మిక్కిలి బీదవానికుమార్తెను. నీశరణునిమిత్తమై యిక్కడకు వచ్చితిని.' లూలియా యామెవంక చూచెనుగాని యామెహృదయము కొట్టుకొనసాగెను. ఉచ్ఛ్వాసనిశ్వాసము లధికమయ్యెను. నూతనవ్యక్తిని దేరిపారఁ జూడలేకపోయెను. చూచుటకొకమాదిరి భయముజనించెను. రెండుసారులామెను జూడవలెనని ప్రయత్నించెనుగాని యప్పుడేయాకన్నులప్రయత్నముగాఁ గ్రిందకుఁ జూడసాగెను. ఆమెశరీరమంతయు నొక విద్యుచ్ఛక్తి ప్రవాహముతోనిండి నట్లామెకుఁదోఁచెను. 'ఇదివరలో నాహమీదానుతప్ప మఱియొక యందమైనస్త్రీని చూచియుండలేదు. ఈయందమైన స్త్రీ యెవరు ? ఎక్కడనుంచి వచ్చినది ? యెక్కడనివసించుచున్నది ? ఇంత సౌందర్యరాశి యీపాడుపడిన నగరమునకు నొంటరిగా నెందునిమిత్తము వచ్చినది ? ఈమెకు బంధువులెవరునులేరా ? ఉన్నయెడల నీప్రకార మొంటరిగా నిక్కడికామె వచ్చుటకు వారెట్లియ్యకొనిరి ?' ఈప్రకారమనేక ప్రశ్నలు లూలియా హృదయమునుండి బయలుదేరసాగెను. కాని యొక్కప్రశ్నయైన నామె నూతనవ్యక్తినడుగ సాహసించలేదు. అప్పుడాక్రొత్త స్త్రీ తన యందమైనట్టియు బలమైనట్టియుఁ జేతులతోనీరుతోడి బిందెనింపి చిఱునవ్వునవ్వుచు లూలియాతో నిట్లనెను. 'చూచితివా నా బాహువు లెంతబలముకలవియో. నిన్ను నీళ్లకుఁబంపుటకు

హామీడా యెంతక్రూరాత్ముఁరాలో!' హామీడాయొక్క పేరు నూతన వ్యక్తి నోటనుండివచ్చుట కాశ్చర్యపడి లూలియా యామెతో నిట్లనెను. 'హామీడానన్నెన్నఁడును నీళ్లకుఁబంపదు. ఆమెయాజ్ఞలకు వ్యతిరిక్తముగా నేనే యీపనులు స్వయముగాఁజేయవలెనను కుతూహలముతోఁ జేయుచున్నాను. మేము భాగ్యవంతులము కాము. మాయింటిపనులు మేము స్వయముగాఁ జేసికొనకపోయిన నితరు లెవరుచేయుదురు?' అప్పుడా నూతనస్త్రీ గంభీరమైనస్వరముతో 'ప్రపంచమందు నీవంటిబాలికలు కొంతమందియుండిన దాని కష్ట పరంపరలు తొలఁగియుండును' అని యనెను. ఈభావగర్భితమైన వాక్కుయొక్క యర్థము లూలియా గ్రహింపలేకపోయెను. హామీడాను నీవెట్లెఱుఁగుదువని యామె యడిగెను. ఆమె నవ్వుచు 'నేను మిమ్మందఱ నెఱుఁగుదును. నీవునన్నెఱుఁగవు' అని బదులు చెప్పెను. 'దయయుంచి మీరెవరో చెప్పవలసినది' అని లూలియా ప్రార్థించెను. 'నేనిం కేమిచెప్పఁగలను. నేను బహుబీదరాలను. ఒక బీదవానికిమూర్తెను. మాయిల్లు విరోధులుకొల్లపెట్టుటవలన నింటింటికిఁదిరిగి తిరిపెమెత్తుకొనుచున్నాను' అని నూతనస్త్రీ ప్రత్యుత్తర మిచ్చెను. 'అయ్యో! పాపము! నీవు చాలబాధపడుచున్నావే!' అని లూలియా జాలిపొందెను. 'నాకష్టములభాగ్యతచూచి జాలిపడువారు నీవుతప్ప యీప్రపంచములో నింకొకరు కనుపించుటలేదు' అని యాస్త్రీ బదులుచెప్పెను. ఆస్త్రీమాటాడు భావగర్భితములైన పలుకులభావము లూలియా గ్రహించలేదు. ఆమె మనస్సునందొక విధమైన యనుమానమంకురించెను. అది యెట్టిదో యామెగ్రహించలేకపోయెను. ప్రపంచమంతయుఁ జీకట్లు క్రమ్ముకొనఁజొచ్చె లూలియా యక్కడ నొంటరిగాఁ దానిదివరలోఁ బరిచ

నూతనవ్యక్తి యెదుట నిలిచియుండుటకు భయపడెను. కాని యామె యొక్క యడుగైనను బెట్టఁజాలకపోయెను. కాళ్లేదో యద్భుతమైన బంధనకు లోనైనట్లు కనుపించెను. ఈ తెలియని నూతనవ్యక్తితోఁ దానెందుకు మాటాడుచుండెనో యామె తెలిసికొనలేకపోయెను. అప్పుడు నూతనస్త్రీ నూతిప్రక్కనున్న యరుగుమీఁదఁ గూర్చుండి నేను యీనీటికడవ నీయింటియొద్దకు మోసికొనివచ్చి యియ్యవలెననియున్నది. కాని కొన్నికారణములవల్ల నట్టిభాగ్యమును నేను వదులుకొనవలసివచ్చినది. కాని యయ్యో ! ఏదోయొకదినమున కిరీటము ధరించఁదగ్గ నీయందమైనతల యీనీటికుండ మొయ్యవలసి వచ్చినదిగదా ! కాని—అని యేమేమో చెప్పఁబోయి యాపుకొని లూలియావంకఁ గొంతసేపు తదేకదృష్టితోఁజూచి విచారముతో నెమ్మదిగా నీప్రకారమనెను. ‘చాలకాలమితరులతో మాటాడదగ్గ భాగ్యము నాకులేదు. దయచేసి నాప్రక్కను గూర్చుండుము. మన యొక్క మనస్సులు విప్పిమాటాడుకొనెదము’ లూలియా కదలలేదు. నూతనస్త్రీ యామె చేయిపట్టుకొని తనప్రక్కను గూర్చుండపెట్టికొనెను. లూలియా నిరాకరించుటకు శక్తిలేకపోయెను. ఆమె యాపాదమస్తకము వణఁకనారంభించెను. గద్గదకంఠయై యొక్కవాక్యమైనను మాటాడలేకపోయెను. ఆసమయమందు హమీడా దూరమునుండి ‘లూలీ ! లూలీ !’ అని బిగ్గరగాఁ గేకవేయుచు వచ్చుచుండెను. అప్పుడు తత్క్షణము నూతనస్త్రీ లూలియాచెవిలో రహస్యముగా ‘దయయుంచి నాసంగతి యెవరికిని జెప్పవద్దు. చెప్పినయెడల నాకాపదలురాఁగలవు’ అని పలికెను. కనురెప్పపాటులో నా స్త్రీ లూలియాయొక్క సుందరమైన ముఖమునుబట్టుకొని యామె చెక్కుటద్దములయందు ప్రేమపూరితమైన ముద్దులిడి యొకముహూ

ర్తమాత్రము తనపెదవిని యామెపెదవితోఁగలిపి యామెను బిగియారఁ గాఁగలించుకొని చుంబనస్పర్శసుఖములనుబొంది మెరుపు తీగవలె చీఁకటిలో నంతర్థానమయ్యెను. లూలియా దీనియొక్క భావము తెలిసికొనలేకపోయెను. ఆమె కొంతసేపు మైమరచి రాతివిగ్రహమువలె నిలుచుండి నూతనస్త్రీ వెళ్లినదిక్కునకుఁ జూచుచుండెను. ఆమెయొక్క ముఖమెఱ్ఱబారెను. శరీరమందు చైతన్యప్రవాహము ప్రవహింపఁజొచ్చెను.

---

## ౩వ ప్రకరణము.



హమీడా కోపముతో, ' లూలియా, లూలియా అని ' కేకలువేయుచు నూతియొద్దకువచ్చెను. లూలియా తెలివితెచ్చుకొని భయభ్రాంతమగు మనస్సుతో నామెయెదుట నిలుచుండెను. లూలియాకు తన యునికియొక్క స్పృహలేదు. తాను కలగనినట్లనుకొనెను. గంటసేపటినుంచి జరిగినచర్యయావత్తు కలలో జరిగినట్లామెకుఁదోచెను. నూతనస్త్రీయొక్క మృదుమధురమైన ప్రేమాలింగనములు జ్ఞప్తికివచ్చెను. చుంబనచిహ్నములింకను దనపెదవులయందుఁ గనుపించుచుండెను. అప్పుడు తనయొక్క జీవితము వివరింపలేనటువంటి యొక యనురాగతత్వమునకు లోఁబడియుండెనని యామెకుఁదోచెను. వృద్ధురాలైన హమీడా లూలియానుచూచి యిట్లనెను. ' నేననేకపిల్లలను జూచియున్నాను. గాని నీవంటిదాని నెన్నడును జూచియుండలేదు. నీకు ప్రపంచజ్ఞానములేదా ? రాత్రి యింతపొద్దుపోయినను నూతియొద్ద నెందుకుకూర్చుంటివి? నీవు బుద్ధిహీనురాలవా?

తనజీవితములో మొదటిసారి లూయియూయికవుబాలిక నిజము కప్పి పుచ్చవలసివచ్చెను. తనను ప్రేమించు హామీడాతో మొదటిసారి యబద్ధమాడుటకు సాహసించెను. గాని యాప్రకారమెందుకుచేయుచున్నదో యామెకే తెలియదు. ఒక ముహూర్తమాత్రములోఁ దనమనస్సు కుదుటపరచుకొని ధైర్యముగా నిట్లనియెను. 'అమ్మా నీవు నన్ను వెతుకుదువోలేదోయని నీప్రేమపరీక్షించుట కిట్లాలస్యముచేసితిని.' హామీడా కోపముతో 'చాలు-చాలు. నీదురుసుతనము కట్టిపెట్టుము. నీతో నేను విసికిపోవుచున్నాను నీవిప్పుడు యౌవనవంతురాలవు. రాత్రియైనది. నిర్జనస్థలములో నీసమయమున నీవు యొంటరిగానుండిన జనులు నీవిషయమై చెడువార్తలు చెప్పుకొందురు. ఈసంగతి నీకుఁదెలియదా?' అనెను. ఆమాటలు లూలియా కర్థముకాలేదు. అర్థమడిగినను హామీడా వినుపించుకొననట్లు నటించి 'నీతాతగారు నీకొఱ కెదురుచూచుచున్నారు. అతిథులు చాలమంది వచ్చియున్నారు వారికిఁదగునేర్పాట్లు చేయవలసియున్నది' అనెను. లూలియా యాశ్చర్యముతో 'ఏమి! మనకతిథులా? వారెవరు?' అని యడిగెను. లూలియాకు జ్ఞానముకలిగినతరువాత నెన్నఁడు నాశిథిలమైన రాజభవనమున కతిథులు వచ్చియుండలేదు. ఇదిగాక హారితాలూకు బంధువులుగాని, స్నేహితులుగాని, యెవరును యెక్కడనులేరని యామెనమ్మకము. గనుక నతిథులువచ్చినట్లు చెప్పినప్పుడు లూలియా యాశ్చర్యముపొంది యట్లు ప్రశ్నించెను. హామీడా జబాబుచెప్పక తనలోఁ దానేమో గొణుగుకొనుచుండెను. లూలియా 'వచ్చిన క్రొత్తవారెవరు?' అని తిరిగియడిగెను. అందుకు హామీడా "ఎవరో నరకమునకుఁ దోవ తెలియనిమనుష్యులు" అని బదులుచెప్పెను. అంతటితోఁదృప్తినొందక లూలియా

తిరిగి యతిథు లెవరని ప్రశ్నించెను. హమీడా కోపముతో నిట్లు చెప్పఁదొడంగెను. "చక్రవర్తినుండి చారుఁడు. ఒక రసపుత్ర వీరుఁడు. పది పండ్రెండుగురు సిపాయీలతో వచ్చినాఁడు. చక్రవర్తియొక్క సరళస్వభావము చూడుము! ఆయనమనకిచ్చు కొద్దిపాటి వేతనము మన నాలుగుపొట్టలకే నగిగా సరిపోనప్పుడీమనుష్యుల నెట్లు సత్కరించెదము? చక్రవర్తియొక్క గుణమీవిధముగానున్నది. మంచితనము, నిష్ఠలీదినములలో నెక్కడను గనుపించవు." అందుపైన లూలియా 'ఆరసపుత్రుఁడెవరు?' అని యడిగెను. "ఆయన జయపూరు రాజకుమారుఁడు" అని హమీడా బదులుచెప్పెను. ఆయన యెందుకిక్కడకువచ్చెను? అని లూలియా యడిగెను. 'ఆసంగతి భగవంతునికిమాత్రమే తెలియును. మనవంటి బీదవాండ్రను బాధించుటకంటె వేఱేకారణము కనపడదు.' అని హమీడా చెప్పెను. ఎవరును నెన్నఁడును దనయింటికి రానిసందర్భములో నీ రసపుత్రవీరుఁడు వచ్చుటకుఁగారణమేదియో తెలిసికొన కుతూహలపడుచు లూలియా తొందరగాతనయింటికిఁ బరుగెత్తెను. హమీడా యేదో గొణుగుకొనుచు నామెవెనుక వెళ్లెను.

లూలియా యంతతొందరగా నింటికిఁబరుగెత్తుటకు మఱియొక కారణముండెను. తనకును నూతనస్త్రీకిని జరిగినసంభాషణ హమీడాగాని యితరులుగాని తెలిసికొనకుండఁజేయుటయే. తానక్కడ చాలసేపు నిలచియుండిన హమీడా తనసంగతి తెలిసికొనఁ బ్రయత్నించునేమోయని త్వరగా నామెయింటికిఁ బరుగెత్తెను. ఆనూతనస్త్రీయొక్క నడవడిగాని కుటుంబవిషయముగాని లూలియా కేమియును దెలియదు. కాని కంటికిఁగనుపించనట్టి యొక యద్భుతమైనశక్తికిఁ దానొక నిర్జీవమైన ప్రతిమవలె లొంగిపోయి నట్లామె

యనుకొనెను. ఆశక్తియొక్క స్వభావము గ్రహించలేకపోయెను. ఆస్త్రీ
యొక్క నిరుపమాన సౌందర్యమైనరూపము తన మానసదర్పణము
నందుఁ బ్రతిఫలించుచుండెను. ఇంతేగాక, నారూపము మనస్సులో
నాటుకొనియుండెను. ఆమోహనాంగి కళ్లు, యాపెదవులు, తన
కన్నులయెదుటఁ గట్టినట్లుండెను. ఇటువంటి మనోవ్యాకులత యా
మె యిదివరలో నెన్నఁడును బొందియుండలేదు. ప్రేమసముద్రము
న మునిఁగి మైమరచియుండెను. హమీదాకుఁ గనబడకుండ తన
ముఖము కప్పిపుచ్చుకొని యింటికామెపరుగెత్తెను. హమీదా రాజ
పుత్రకుమారుని రాకకారణముయొక్క యాందోళనలో లూలియా
యొక్క ముఖస్థితి కనిపెట్టలేను.

వృద్ధుఁడైన సలాబత్తుఖానొక గుండ్రనితలగడమీఁదఁ జె
య్యియానుకొని కూర్చుండి 'గొరోస్థాను' అను గ్రంథము చదు
వుచుండెను. మహమ్మదుజాన తనిని సమీపించి 'అయ్యా! ఒక రస
పుత్రవీరుఁడు మీతో మాట్లాడుటకు వచ్చియున్నాఁడు' అని మ
నవిచేసెను. ముసలివాఁడు తొందరగాలేచి 'రసపుత్రవీరుఁడా! ఎం
దుకు?' అని ప్రశ్నించెను. 'నాకుఁ దెలియదు. వానిదుస్తులు, చ
హరాచూడఁగా గొప్పయుద్యోగస్తునివలెఁగనఁబడుచున్నాఁడు. అత
నితో 10, 15 గురు సిపాయిలున్నారు' అని మహమ్మదుజాను బదు
లుచెప్పెను. సలాబత్తు గంభీరభావమువహించి రసపుత్రవీరుని లోని
కిఁదీసికొని రావలసినదిగాఁ జెప్పెను. సలాబత్తు పుస్తకముమూసి
ప్రక్కన బెట్టుకొని, సులోచనములుతీసి శుభ్రపరచుకొని తిరిగి
కన్నులకుఁ దగిలించుకొనెను. తనయెదుట గోడమీఁద తల్వారు
(కత్తి) వ్రేలాడుచుండెను. అతఁడు దానివంకచూచెను. "ఈమహ
మ్మదీయరాజ్యములో నెవరును సురక్షితులని చెప్పుటకు వీలులేదు.

ఎవరితల యేసమయమునందూడునో తెలియదు. నేను బహుబీదవాఁడను. నామీఁద నింతకసియెందులకు ? నేను ప్రపంచసుఖములనువిడిచి యీపాడుపడిన గ్రామములో నున్నాను. మనశ్శాంతి లేదే! బహుశః యీదాడి నాబహిఃప్రాణమైన లూలియావిషయమై యుండును. ఆమె నెట్లు రక్షించఁగలను! ఇంతకాల మామెను సురక్షితముగాఁ బెంచి యిపుడు కోలుపోవలసివచ్చును గాఁబోలును. అట్టిపనియే జరిగేయెడల నేను తప్పక ప్రాణములు విడువవలసినదే! అని యేమేమో తలపోయుచుండఁగా రసపుత్రవీరుఁడు లోనఁ బ్రవేశించెను. సలాబత్తు లేచి రసపుత్రునకు సాదరముగా నాతిథ్యమిచ్చి వాని యాజ్ఞకు నెదురుచూచుచుండెను. ఈరసపుత్రవీరునియొక్క వయస్సు 25 సంవత్సరములు. చాలబలిష్ఠుఁడు. పొడవరి. అంగసౌష్ఠవముతోఁ గూడిన యందగాఁడని చెప్పవచ్చును. ' పాదుషా ' యను పేరుతోఁ జెక్కఁబడి యందముగాఁ బ్రకాశించుచు వజ్రపుపొడితోఁ గూర్చఁబడిన యొకపతక మాయనయురమందు వ్రేలాడుచుండెను. దానిని బట్టి యతఁ డాగ్రాలో మొగలుదర్బారునందలి యొక మాన్‌సబ్‌దారని సలాబత్తు గ్రహించెను. అపుడు రాజపుత్రుఁడు నమ్రతతో నిట్లు చెప్పెను. " నేను మీయొక్క యుదారగుణములు తఱుచు విని యుంటిని. గాని దర్శనభాగ్య మిదివరలో లభించియుండలేదు. ఈ నవుకరు జయపూరు రాజకుమారుఁడైన " అజిత్ సింగు "

' మీసంగతి యిదివరలోఁ జాలవినియున్నాను. దయచేసి కూర్చుండుఁడు. ఏమియాజ్ఞ ?' అని సలాబత్తడిగెను.

ఆయజానవీరుఁడు కూర్చుని పాదుషాయొద్దనుండి మీకొక యుత్తరము తెచ్చితినని చెప్పెను. ఆయుత్తరము ముసలివాడందుకొనెను. తన లూలియాను బేగమ్‌మహాల్‌కుఁ బంపుమనెడు హుకు

మేమోయని భయముతో నతనిచేతులు వణకఁజొచ్చెను. నెమ్మది గా నుత్తరము విప్పిచూచునరికి నందులో నీప్రకారముండెను.

‘ ప్రియమైన యుమ్రావు సలాబత్తుఖాన్ గారి సముఖమునకు. మీ స్నేహితుఁడు వీరుఁడునగు అజిత్ సింగు రాజకుమారుఁడు కొన్ని రాజకీయవ్యవహారములమీఁద కొద్దిదినములు ఫత్తేపూరుసిక్రిలో నుండవలసివచ్చినది. ఆయనకు మీరు తగినసహాయము చేసెదరని నమ్ముచున్నాము ’

ఇట్లువిధేయుఁడు,
సలీముజహాంగీరుషా.

ఉత్తరము చూచినమీఁదట ముసలివానికిఁ గొంతధైర్యము కలిగెను. తన లూలియావిషయమై యేమియు నందులేదు ‘ రాజకీయ వ్యవహారములు నాతో నేమిగలవు ? శిథిలమై పాడుపడిన యీభవనములోనివసించు మాతో నేమి రాజకీయవ్యవహారము. నేను నానవుకరు హామీడా, లూలియా, మసీదుపురోహితుఁడుతప్ప మతెవరు నిందులేరే ’ అని తనలోఁదాను దలపోసి రసపుత్రవీరుని తో నిట్లనెను. ‘ రాజకుమారా ! మేము బీదవారము. మాస్థితినిబట్టి నీవంటిసంపన్నులకుఁ దగినట్టి యాతిథ్యమియ్య నసమర్థులమైనను శక్తికొలఁదినిచ్చు మాయాతిథ్యము స్వీకరింపుఁడు ! ఇందుకు రాజపుత్రుఁడు ‘అనేక రణరంగములలోఁ బేరుపొందినమీరిట్లు మాటాడఁ దగదు. రణరంగములలో నలవాటుపడినవీరుల కన్నిస్థలములుసమానములే. అసంగతి మీబోంట్లకుఁ దెలియదా ? మీయుదారప్రేమకు చాలసంతోషించితిని ’ అనెను. ‘ ఈగ్రామమునందు భవనములన్నియు శిథిలమైనవియేగాని సరియైనవిలేవు. మీరు రాత్రి విశ్రమించు

టకుఁ దగినస్థలమేది ?' అని ముసలివాఁడాలోచించుచుండగా రాజపుత్రుఁడు 'మేరియమ్ బేగమ్‌యొక్క మహల్ పనికివచ్చును' అని సలహాపూర్వకముగాఁ జెప్పెను. ఆమాట విననితోడనే సలాబత్తాక సమునుండి మీఁదఁ బిడుగుపడినవానివలె నిశ్చేష్టుఁడై భయకంపితగాత్రుఁడై మాటలేక శిలావిగ్రహమువలెఁ జైతన్యహీనుఁడై కూర్చుండెను.

---

# ౪ వ ప్రకరణము.

---

రాజపుత్రవీరుఁడు తాను మాటాడుచున్న గదిలో సరియైన వెల్తురులేనందున ముసలివానియొక్క వివర్ణత కనిపెట్టలేకపోయెను. కాని క్షణకాలములో ముసలివాఁడు తెలివితెచ్చుకొని నమ్రతతో నిట్లుపలికెను. 'ఓ యసమానవీరుఁడా ! నీవు పత్తేపూరుగ్రామము యొక్కస్థితి యెటింగియేయున్నావు. విడిచిపెట్టఁబడి శిథిలమైన మేరియమ్‌బేగమ్‌మహల్ నివసించుటకుఁ దగినదికాదని వేఱే చెప్పవలయునా ?'

'చక్రవర్తిగారి యుత్తర్వుప్రకారము నేను గొంతకాలమందులో నుండవసియున్నది' అని అజీత్‌సింగు చెప్పెను. సలాబత్తేదో యడ్డుమాట చెప్పబోయెనుగాని నోటనుండిమాటరాలేదు. కొంతసేపటికి ధైర్యముతో 'చక్రవర్తిగారియాజ్ఞ శిరసావహించెదను. మీకుఁ గొంచెము కష్టముగలుగునని యట్లంటిని' అనెను. 'ఏదైనను దప్పదు' అని అజీత్‌సింగుచెప్పెను. 'దయచేసి కొంచెముకాలము విశ్రమింపుఁడు. నేనువెళ్లి నామనుష్యులచేత నామహల్ బాగుచేయించి మీరుండుటకు వీలగునట్లుచేసెదను.' అని సలాబత్త

నెను. ‘ మీరు కష్టపడవలదు. నాయొద్ద మనుష్యులున్నారు. వారిచేతనే నేను బాగుచేయించెదను. అవసరమైనయెడల మీసహాయముకోరెదను.” అని అజీత్ సింగు జబాబుచెప్పెను. ముసలివాని ముఖమెఱ్ఱబడెను. కాని యది క్షణమాత్రములో రంగుమారెను. అజీత్ సింగు ముసలివానిముఖమును బరీక్షించుచుండెను. ‘ ఈరసపుత్రునిరాక శుభసూచకముగాఁ గనపడదు. ఏయుద్దేశముతోఁ నితఁడు వచ్చియుండును ? పాడుపడి శిథిలమైన యీభవనమందు నివసించమని చక్రవర్తి యాజ్ఞయిచ్చుటకేమికారణము ? ’ అని ముసలివాఁడు తనలోఁదాను దలపోయుచుండెను. మేరియమ్‌మహాల్‌లో నుండుటకు ముసలివాని కిష్టములేనట్లుగా నజీత్ గ్రహించెను. ‘ ఇందుకుఁ గారణమేమి ? చక్రవర్తి యక్కడనుండుమని యుత్తర్వులిచ్చుటకుఁ గారణమేమి ? ఇందులో నేదో రహస్యముండితీరును ’ అని యజీత్ యూహించి ముసలివాని ముఖవర్చస్సునుబట్టి యా రహస్యము కనిపెట్ట ప్రయత్నించెను. కాని యాతనిముఖముయొక్క గంభీరత, ప్రసన్నతనుజూడఁగా నతనిమనస్సునందలి యూహాలు గ్రహింప వీలులేకయుండెను. ఆముఖవర్చస్సు ప్రథమములో కొద్దిగామారిన నామార్పు క్షణకాలముమాత్రమే యుండెను. ఉత్తర క్షణమందే మామూలుస్థితికివచ్చెను. వానిమాటలనుబట్టికూడ రసపుత్రవీరుఁడేమియు గ్రహింపఁజాలకపోయెను. ఎంతచెప్పినను ముసలివాఁడు మాటాడనందున విసికి ‘ నేనుచెప్పిన యేర్పాటున కాక్షేపణ యేదైననున్నదా ? ’ అని అజీత్ సింగనెను.

‘ ఏ యేర్పాటు ? ’ అని సలాబత్తడిగెను.

‘ మేరియమ్ బేగమ్‌మహాల్‌లో బసచేయుటవిషయములో ’ అని యువకుఁడు చెప్పెను.

‘ ఎంతమాత్రమును లేదు. మీ యేర్పాటునకు నా యాక్షేప ణమేమియును లేదు. మీకు నిబ్బందిగలుగునని యిట్లంటిని ’ అనిము సలివాఁడనెను.

‘ ఉమ్రావుసాహేబుగారు! మనకష్టములను మనము లెక్క చేయుదుమా ? చక్రవర్తిగారి యాజ్ఞప్రకారము నడుచుకొనవలసి నదేకదా! ’ అని యువకుఁడు జవాబుచెప్పెను. ముసలివాఁడు నవ్వు చు నిట్లనెను. ‘ నిరుపమానమైన మొగలాయిదర్బారు నందున్నను మీకు మనశ్శాంతియున్నట్లు కనుపించదే ? ’

‘ ఇతరులవిషయమై నేను జెప్పలేను కాని నాకు సంబంధించి నంతవఱకు నేనుజెప్పెదను. పదివేలసిపాయిల కధికారియు మాన్ సబ్ దారునైన నేనొకనౌకరుతో సమానమని యభిప్రాయము.’ అని అజీత్ సింగనెను. ముసలివాఁడు పరిహాసముగా ‘ అయితే నీవు రాజద్రోహివి ’ అనెను. అందుకు యువకుఁడు గంభీరమైన ముఖముతో నిట్లనెను. ‘ రసపుత్రుఁడెన్నఁడును తిన్నయింటివాసములు లెక్కపెట్టఁడు. కృతజ్ఞతతోఁ జక్రవర్తి యుత్తర్వులు నెరవేర్చుట, లేక యావనిలోఁ బ్రాణములువిడచుట—ఈ రెండు మాత్రమే రస పుత్రధర్మములు.’

ఈమాటలకు సలాబత్ఖానిని మెచ్చుకొని యిట్లనెను. ‘ రసపుత్రులయొక్క పౌరుషము ధైర్యము హిందూదేశమంతయు మ్రోగుచున్నది. ఈ మొగలాయీ సామ్రాజ్యము రసపుత్రుల పౌరుషము, బలమను గట్టికొండపైఁ గట్టబడినది ’

‘ ఇదియంతయు మీదయయే ’ అనుచు యువకుఁడులేచి మే రియమ్ బేగమ్ మహల్ యొక్క తాళపుచెవి యీయుమనికోరెను. ‘ నేనిప్పుడే యిచ్చెదను. అది లోపలనున్నది.’ అని చెప్పుచు ముసలి

వాఁడు లోనికిపోఁబోయెను. కాని రసపుత్రియువకుఁ డాయనకడ్డ మువచ్చి పోనీయక 'ఆకష్టము మీాకెందులకు ? మీానౌకరును పిలి పింపుఁడు.' అనెను. సలాబత్తు తదేకదృష్టితో యువకునిజూచి 'నే నిప్పుడు మీాఖయిదీనా ?' అనెను.

యువకుఁడు జబాబీయకపూర్వమే సలాబత్తు 'ఓదేవుఁడా ! ఈముసలివయస్సున నాకింక నెన్నికష్టములు తెచ్చిపెట్టదవోగదా' అని విచారించి విహ్వలచిత్తముతో నిరుత్సాహుఁడై నేలమీాఁదఁ గూలఁబడెను. రసపుత్రుఁడు ముసలివాఁడు చనిపోవునని భయపడి 'ఎవరక్కడ ? కొంచెము నీరుతెండు !' అని కేకవేసెను. ముసలి వాఁడు నేలమీాఁద కొయ్యవలెఁబడియుండెను. చేతులు కాళ్లు రాయి వలె బిగిసిపోయెను. కండ్లు గుంటలుపట్టెను. ఊపిరి వచ్చుటలేదు. అజీత్ సింగు చాల భయపడి తనలోఁదానిట్లని తలపోసెను. 'ఆహా! నేను ఈముసలివానివిషయమై యనవసరముగా ననుమానపడినాను. నాతో వృథామాటలుచెప్పి కాలముపుచ్చుటచూచి నేను మేరియ మ్మహల్లో నుండుటకిష్టములేక నందుండఁగూడని వస్తువులు బ యటకుఁదీసివేయఁ బ్రయత్నించుచున్నాఁడని యనుకొంటిని. నే నెంత పొరపడితిని. తనను ఖయిదీచేసితినను భయముచే నెంతయావ దకు లోనైనాఁడు. ఈయనచావునకు నేను గారణముగదా!' ఇట్లు తలపోయుచుఁ గేకలువేయుసాగెను. ఎన్నికేకలువేసిన నెవరునుబలు కలేదు. తనతోవచ్చిన సిపాయిలు గేటునొద్ద విశ్రమించియున్నారు. వారిని సహాయముపిలచుట యాతనికిష్టములేదు. ఇంకెవరును గను పించరు. సలాబత్తుయొక్క సంబంధీకులు మేరియమ్మహల్లో నుం డియుందురని వానికనుమానము కలిగెను. కాని యేమిచేయుటకును దోఁచలేదు. ముసలివానిని యాస్థితిలోవిడిచి వెళ్లుటకుఁ గాళ్లు

రాలేదు. తిరిగి యిల్లుప్రతిధ్వనియిచ్చునట్లు బిగ్గరగాఁగేక వేసెనుగాని యెవరును బలుకలేదు. ముసలివాఁడు దిక్కులేకుండ నాప్రకారము చనిపోవునని యువకునకు చాల యాందోళనము కలిగెను. దగ్గఱలో నెవరో యొకరుండవలెనని యనుకొని యజీత్ సింగు నెదుటనున్న యింటివైపు పరుగెత్తెను. ముసలివాఁడు కొంచెము కండ్లుతెఱచి వానివంకఁజూచి తిరిగి యథాప్రకారము పడియుండెను. ఒక యింటికిఁ గొంతమందిజనులుబరుగెత్తుచున్నట్టుచూచి రసపుత్రుఁడావైపునకుఁ బరుగెత్తెను. కాని యందెవరునుగనుపించలేదు. బిగ్గరగాఁబలుసార్లు కేకలువేసెను. ప్రతిధ్వనితప్ప జబాబులేదు. అజీత్ సింగాగి తనముఖముపైనున్న స్వేదకణములు తుడుచుకొని ‘ అయ్యో ! ముసలివానిచావునకు నేను గారణమగుచున్నానే ! హా! దైవమా ! ఇతనిని బ్రతికించుట కేమియుపాయము? ’ అని యాలోచించుకొనుచుండఁగా దూరమున మిణుగుమిణుకుమను దీపము కనుపించెను. అజీత్ సింగక్కడకుఁ బరుగెత్తెను. కాని యక్కడనెవరును గనిపించలేదు. గదులలో కొన్నిసామానులుండెను. కాని వానియందు దీపములులేవు. దీపమువైపునకురాగా నదియొక చిన్నగదివలెనుండెడి వంటయింటిలోనుండెను. పొయ్యిమండుచుండెను. పొయ్యిమీద యేదో యుడుకుచుండెను. ఒకమహమ్మదీయస్త్రీ యాపొయ్యియొద్ద కూర్చుండియుండెను. ఆమెనుచూచి రసపుత్రుఁడు ‘ నేను నోరు బ్రద్దలగునట్లు కేకలువేయుచున్నాను. నిన్నుఁగానట్టుగా నుపేక్షతోఁ గూర్చుండియుంటివా ? ’ అనెను. హమీడా యువకునివంక చూచెను. ఆమె యొకనిముషమునకింద టనే యెక్కడనుండియో వచ్చెను. త్వరగా పరుగెత్తివచ్చుటవల్ల రొజుచుండెను. కాని యీసంగతి యజీత్ కనిపెట్టలేకపోయెను. సలాబత్తును రక్షించుటయను తలంపే

వాని మనస్సునందుండియుండెను. ఆయాదుర్దాలో హమీదా ముఖవర్చస్సు కనిపెట్టలేకపోయెను. ‘ రా ! రా ! త్వరగా రా ! నీళ్లుతీసికొని త్వరగా రా ! ఉమ్రావుసాహేబుగారు స్మృతితప్పి పడియున్నారు ’ అని యజీత్ సింగనెను—

‘ నాకు చెముడు. సరిగాఁజెప్పుము.’ అని హమీదాయనెను. ఆమెచెవిలో నోరుపెట్టి యజీత్ బిగ్గరగా ‘ నీళ్లు త్వరగాఁ దీసికొని రమ్ము ’ అని చెప్పెను.

‘ మీరాదుర్దా పడనవసరములేదు. ముసలివానికిఁ బ్రతిదినము నీప్రకారము వచ్చుచుండును.’ అని హమీదా జబాబుచెప్పుచు నొకలోటాతో నీళ్లు పట్టుకొని నెమ్మదిగా వచ్చుచుండెను. అజీత్ సింగునకుఁ గోపమువచ్చి విసుకుతో నామెచేతినుండి లోటాలాగికొని ముసలివానిపై పునకుఁ బరుగెత్తెను.

---

# ౫వ ప్రకరణము.



అజీత్ సింగు కొంతదూరము పరుగెత్తి తనతప్పు తెలిసికొనెను. ఆచీకటిలో నతఁడు త్రోవ తెలిసికొనలేకపోయెను. అనేకగదులు హాలులు దాటినను సలాబత్తుతోఁ దాను మాటాడినసావిడి కనుగొనలేకపోయెను. చివరకతఁడు తనచేతితో లాంతరుపట్టుకొని తనకెదురు వచ్చుచుండెను. అజీత్ సింగతనినిజూచి కోపముతో నిట్లనెను ‘ మీయందఱికి చెముడా ? గొంతుక బ్రద్దలగునట్లరచ్చిన నొకరును బలుకరు ? ఇంతలో నాపురుషుఁడు దగ్గఱకు రాఁగా నతనిని సలాబత్తుగా

గుర్తించి యాశ్చర్యముతో ‘ఏమి! మీరేనా! కుశలములముగా నున్నారా!’ అని యడిగెను.

‘ నాకప్పుడప్పుడు మూర్ఛవచ్చుచుండును. నన్నిదివరలో మీరెఱుగని కారణమువల్ల నంతభయపడినారు.’ అని సలాబత్తనెను. ‘ భయపడుటయా? మీరు చనిపోయినారనియే యనుకొంటిని’ అని యువకుఁడనెను. సలాబత్తు నవ్వుచు నిట్లనెను ‘ నావంటి పాపాత్ములకుఁ జావంత త్వరగారాదు. ఇంక నెన్నియాపదలు నేననుభవించవలసియున్నదో యెవరికెరుక ?’

‘ అట్లయితే మీకప్పుడప్పుడీజబ్బు వచ్చుచుండునా ?’

‘ అవును. అప్పుడప్పు డిటువంటిమూర్ఛలు వచ్చుచుండును’

‘ మీరిందు కౌషధమెందుకు పుచ్చుకొనరు ?’

‘ రాజకుమారా! ఆవిషయమై చర్చయెందులకు ? ఈదౌర్భాగ్యునియొక్క కష్టములాపదలు విచారించిన లాభములేదు. అనవసరముగా మీకు బాధకలుగఁజేసినాను. క్షమింపుఁడు.’

‘ మఱేమియు బాధలేదు. చాలగదులుగల యీవిశాలభవనములో మీరొంటరిగా నివసించుచున్నారా?’

‘ అవును. నాకు నమ్మకమైన యాడనౌకరు, మగనౌకరు తప్ప మిగిలిన స్నేహితులు, బంధువులు యావన్మంది నన్నుఁ బరిత్యజించిరి. ఈప్రపంచమందు నాకీయిద్దఱునౌకర్లుతప్ప నితరసంబధీకులెవరును లేరు. ఈయదృష్టహీనునియొక్క బాధలు, కష్టములు వినిపించి మీవిలువగలకాలము వృధాపుచ్చుట నాకిష్టములేదు. ఇది వఱకే మిమ్ములను జాలకష్టపెట్టినాను. నాతోరండు. నానౌకరు మహమ్మదుజాన్ మేరియమ్‌మహల్ తాళపుచెవితో వాకిట సిద్ధము

గానున్నాఁడు. అతఁడు మీకాభవనమును జూపించి మీయాజ్ఞప్ర కారము పనులు చేయఁగలఁడు.'

ఆప్రకారమిద్దఱికి సంభాషణ జరిగినపిమ్మట యువకుఁడు మఱేమియు బదులుచెప్పక ముసలివానివెంట వెళ్లెను. ముసలివాని విషయమై తనకిదివరలోఁగలిగిన యనుమానము తిరిగిపొడచూపెను. అతఁడు తనలోఁదానిట్లని వితర్కింపసాగెను. 'ఈముసలివానికథ యావత్తు నిజమా యబద్ధమా? జబ్బునిజమా కృత్రిమమా? కృత్రిమమైన నాప్రకారము నటించుటకుఁ గారణమేమైయుండును? కాదు. కాదు-కాదు. ఈముసలివానివిషయమై నేనన్యథా భావించుచున్నాను. ఇతఁడు ప్రపంచసౌఖ్యములన్నియుఁ ద్యజించి భగవ ధ్యానతత్పరుఁడై యీశిథిలమైనగ్రామములో నివసించుచున్నాఁడు. నన్ను మోసగించిన నితని కేమిలాభము?'

ముసలివాఁడుకూడ రసపుత్రునివిషయమై యనుమానము కలిగియుండెను. అతఁడు తనలోఁ దానిట్లనుకొనెను. 'రాజపుత్రుఁడు నామనుమరాలగు లూలియానిమిత్తమై వచ్చెనుకాఁబోలు! లేని యెడల నింతయకస్మాత్తుగా నీపాడుపడిన గ్రామమునకు వచ్చుటకుఁ గారణమేమి? కీర్తిగలిగినట్టియు, మన్సబ్దారు హోదాగలిగి నట్టియు నీరసపుత్రవీరుని నిర్జనమైన యీపాడుగ్రామమునకుఁ జక్రవర్తి యెందుకుపంపెను? ఈయువకుఁడు తనరాకయొక్క యుద్దేశ మెందుకు బైలుపెట్టలేదు? ఈగ్రామమందిన్ని భవనములుండఁగా మేరియమ్మహాల్‌లోనే బసయేర్పాటుచేసికొనుటకుఁ గారణమేమి?'

యువకుఁడు ముసలివానినుండి రహస్యమేమియును గ్రహింపఁజాలనని నిశ్చయపఱచుకొని వానివెంట వెళ్లెను. ద్వారమునొద్ద మహమ్మదుజాన్ కనపడి వారికి సలాముచేసెను. అప్పుడు ముసలి

వాఁడు తననౌకరుతో నిట్లుచెప్పెను. ‘ ఈరసపుత్రవీరుని మేరియమ్ మహాల్కుఁ దీసికొనివెళ్లి' యాయన చెప్పినప్రకారముపనిచేయుచుండుము.’ తరువాత నజీత్ సింగువైపుజూచి ‘ తమరు మరల రేపు దర్శనమిప్పించకోరుదును’ అనెను. ఆసమయమందెక్కడినుండియో ‘ ఈ రాత్రియే మీరు కలిసికొనెదరు ’ అని యొకధ్వని వినఁబడెను. రాజకుమారుఁడులికిపడెను. ఆధ్వని యొక స్త్రీదిగా గ్రహించెను. కాని తనయెదుట సలాబత్ మహమ్మదుజాన్ తప్ప యింకెవరును గనుపించలేదు. ఇందువిషయమై విచారణచేసిన లాభములేదనియుఁ దాను జేయవలసినకార్యమున కాతంకముగలుగుననియు నూహించి మాఱాడక నవుకరువెంట వెళ్లెను. అతని నొకప్రశ్నయైన నడుగలేదు. సలాబత్తు వారు కనపడునంతవఱకు గేటునొద్ద నిలచియుండి తరువాత నొక్కనిట్టూర్పువిడిచి యింటిలోనికివెళ్లి తలుపువేసికొనెను. ఇంటిలో హమీదానుచూచి ‘ ఆప్రకారమనుట మంచిదికాదు ’ అనెను. ఆమె యతనిముఖమువంక కొంతసేపుచూచి హాస్యముగా నిట్లనెను ‘ నీముసలితనమువల్ల నీబుద్ధిజ్ఞానము నశించినది ’ ముసలివాఁడు ఆమాటవిని చిఱునవ్వునవ్వి యూరకుండెను.

## ౬ వ ప్రకరణము.

అజీత్ సింగు సలాబత్తుయొక్క ముసలినౌకరుతో మేరియమ్ బేగమ్మహాల్కు వెళ్లెను. ఈకథలో తఱుచుగా బేగమ్మహాల్ యొక్కచరిత్ర చెప్పఁబడుచుండును. ఆచరిత్ర మహమ్మదీయ చక్రవర్తుల ముఖ్యపట్టణములైన యాగ్రా, ఢిల్లీ, పత్తేపూరుసిక్రీలకు సం

బంధించియుండును. కాబట్టి చదువరులయుపయోగార్థమై యాపట్టణములవర్ణన క్లుప్తముగాఁ జెప్పవలసియున్నది. మనచరిత్ర సమయమందు ఫత్తేపూరుసిక్రి యొక్క పాడుపడిన పురాతనస్థలము. అక్కడ పూర్వ మక్బరుమహాశయుఁడు తనరాజధాని నేర్పర్చుకొనెను. ఆగ్రా యాదినములలో మొగల్ సామ్రాజ్యమునకు రాజధానియై యుండెను. ఢిల్లీ హిందూ రాజులకాలమునుండి ప్రసిద్ధికెక్కిన పురాతనపట్టణము. ఇవియన్నియు మహమ్మదీయపట్టణములు. 'బేగమ్ మహల్' లేక 'చక్రవర్తులజనానా' యని ప్రసిద్ధికెక్కిన మహలీమాదుపట్టణములకును సంబంధించినదై యున్నది. అక్బరుచక్రవర్తియొక్క క్రిష్టియనుభార్యపేరు మేరియమ్ బేగమ్. ఆమెకొఱకై తెల్లరాతితోను, మామూలు రాతితో నొక చాలయందమైన రాజభవనము ఫత్తేపూరుసిక్రిలోఁ గట్టింపఁబడెను. శతాబ్దములుగడచిన నీదినమునకుకూడ యాభవనముయొక్క కొంతభాగము కనుపించుచున్నది. కాలముయొక్కమార్పుకూడ యాభవనముయొక్క సౌందర్యమును బూర్తిగా నశింపఁజేయలేకపోయెను. ఆమేరియమ్ బేగమ్మహల్ ఫత్తేపూరుసిక్రికి మధ్యభాగమందున్నది. దీనియెదుట నెత్తైనగోడలతో నొక మహాలుండెను. అది యక్బరు తన హిందూభార్యయైన జాద్ బాయి నిమిత్తము కట్టఁబడినది. దానికిదూరములో 'బిర్బానే' గృహము కలదు. దానివెనుక చలువరాతితోఁ బ్రసిద్ధికెక్కినశిల్పులచేఁ గట్టఁబడిన ఫకీరుసలీముతాలూకు గోరీయున్నది. దానియెదుట మక్కామశీదుతో సమానమగు నొకమశీదు కట్టఁబడియుండెను. ఆమశీదా కాలమందలి శిల్పకళానిపుణత్వమును వేనోళ్లఁజాటుచుండెను. ఆపట్టణమందింకొకభాగమున నక్బరుపాదుషాతాలూకు 'దివానీ ఆమ్' అనఁగా పబ్లికుహాలుండెను. దానిప్రక్క 'దివానిఖాన్' అనఁగా

రహస్యాలోచనమందిరముండెను. అందు చక్రవర్తి తనమంత్రులతో నాలోచనచేయుచుండును. ఇంకఁ జుట్టుపట్ల ననేకవిధములగునందమైన భవనములుండెను. పట్టణముచుట్టు నెత్తైనగోడలును గోడలక్రింద నీఁడ్లునుండెను. కాని మన చరిత్రసమయమందీ పట్టణమం దెక్కడను జనులు కనుపించరు. పట్టణమంతయు రోడ్లవరుసలచేఁ గప్పఁబడెను.

మహమ్మదుజాన్ రసపుత్రకుమారుని గొన్నివీథులగుండా మేరియమ్ బేగమ్‌మహల్ నకుఁ దీసికొనివెళ్లెను. అప్పు డజీత్ మహమ్మదుజానతోఁ దనకు తాళపుచెవినీయుమనియుఁ దననౌకర్లు తన కవసరమైనపని చేసెదరనియుఁ జెప్పెను. నౌకరు రసపుత్రునకుఁ దాళముచెవినిచ్చి 'నేను మీకవసరమైన—' అని యేదో చెప్పఁ బోగా నజీత్‌సింగు మధ్యయడ్డమువచ్చి 'ఇక్కడ యవసరమైనపని చేయుటకు నానౌకర్లున్నారని యింతకుపూర్వమే నీతోఁ జెప్పియున్నాను. నేను నిన్ను కష్టపెట్టనిష్టములేదు. నానౌకర్లు వీధిగుమ్మము నొద్దనున్నారు. నీవువెళ్లి వారిని యిక్కడకుపంపినఁ జాలసంతోషించెదను' అనెను.

మహమ్మదుజా నేమియు బదులుచెప్పక నాలుగడుగులు వెనుకకువేసి యదృశ్యమయ్యెను. రసపుత్రుఁడు మహల్ గేటునొద్దకు వచ్చి తాళముతీసి లోపలఁబ్రవేశించెను. అప్పుడు బాగుగచీకటిపడినది. నౌకర్లింక లాంతర్లుతీసికొని రాలేదు. అజీ తాచీఁకటిలోనే యాభవనమును జుట్టునున్నస్థలమును బరీక్షించుచుండెను. ఇంతలో నిరువదిమందియాశ్వికులు చేతులలోఁ గాగడాలుతీసికొనివచ్చిరి. వాని వెలుఁగున రాజపుత్రుఁడు భవనము తప్పీలుగాఁ బరీక్షించెను. చాల యందముగా శిల్పచాతుర్యముతోఁ గట్టఁబడిన యాభవనముచుట్టు పంచపాళీలుకలవు. పైయంతస్తుమీఁద సుందరమై నివసించుటకన్ని

సదుపాయములతోఁ గూర్పఁబడిన గదియొకటియున్నది. క్రిందిహాలు చుట్టు ననేకములగుగదులున్నవి. వీనినిచూచి యజీత్‌సింగు తనలోఁ దానిట్లనుకొనెను. ‘అందమైన పైగది రాణీ నివసించుటకేర్పడియుండవచ్చును. క్రిందిహాలామె చెలికత్తెలకొఱకై యుండవచ్చును. చుట్టునున్నగదులు నవుకర్లకై యేర్పడియుండును. నేనీరాత్రి మేరియమ్‌బేగమ్‌కొఱ కేర్పడిన పైగదిలో గడిపెదను. నానవుకర్లు క్రిందిగదులలో నుండెదరు.’ అని యనుకొని తన సర్దారగు రఘువీరునిపిలిచి వానితో ‘నీవీరాత్రి క్రిందహాలులోఁ బరుండుము. నేను మేడపైనగదిలోఁ బరుండెదను. నౌకర్లు చుట్టుగదులలో నుండునట్లు చెప్పుము.’ అని యుత్తర్వుచేసెను.

ఇంతలో మహమ్మదుజానక్కడకువచ్చి యీప్రకారమనెను ‘రాజకుమారా! మేడపైనగది పరుండుటకు సరియైనస్థితిలో లేదు. అంతయు దుమ్ముతోనిండియున్నది. తమయాజ్ఞయైన నేను ముందు వెళ్లి మీరు పరుండుటకువీలుగా శుభ్రపరచివచ్చెదను.’ అజీత్‌సింగు, మహమ్మదుజాన్ అకాత్తుగాఁ గనపడుటకాశ్చర్యపడి కోపముతో ‘నీవు వెళ్లిపొమ్ము. నీసహాయము మాకనవసరము. నాకు నౌకర్లున్నారు. నీయజమానుఁడు నీవులేకున్న చాలయిబ్బందిపడును. తత్క్షణము వెళ్లుము’ అనెను. ఆమాటలువిని యింక నక్కడనుండినఁ బ్రయోజనములేదని మహమ్మదుజాన్ అజీత్‌నకు సలాముచేసి వెళ్లెను. తరువాత నజీత్ రఘువీరునితో నిట్లనెను. ‘చూచితివా! రఘువీరుఁడా! ముసలిసలాబత్తునకు మనమీమహాల్‌లోనుండుట కిష్టములేదు. ఈనౌకరు, మనకనవసరమని యెన్నిమారులు చెప్పినను మనలను విడిచిపెట్టుటకిష్టములేక నిక్కడనే తిరుగుచున్నాఁడు. ఇందులో నేదో యనుమానకారణము కలదని నానమ్మకము.’

ఇంతలో నౌకర్లు వారివారిగదులయందు రాత్రి గడుపుటకే ర్పాట్లుచేసికొనుచుండిరి. అజీత్ సింగు రఘువీరుఁడొంటరిగా నుండిరి. వారిలో వారికీదిగువసంభాషణ జరిగెను.

ర—సలాబత్తు, యతని యిద్దఱునౌకర్లుతప్ప నిక్కడ నెవరు నులేరు. ఇదిగాక మనమొంటరివాండ్రము కాము. కోటయొక్క స్థితినిబట్టి చక్రవర్తి తనసైన్యముతో దాడివచ్చినను మనము జయిం చఁగలమని నాకుఁ దోచుచున్నది.

అ—రసపుత్రవీరులమైన మనము భయపడుదుమని నాయు ద్దేశముకాదు. సలాబత్తువగైరాలకు మన మిక్కడికివచ్చుటయు, నీ మహాలునందు బసచేయుటయు నిష్టమున్నట్లు కనబడదు.

ర—వారికిష్టములేకపోవుటకుఁ గారణము కనుపించదు. మన మిక్కడ నుండఁదలఁచుకొన్న దినములకుఁ గావలసిన సదుపాయము లు మనమే చేసికొనియున్నాము. వారిసహాయము మనకేమియు నవసరములేదు. మనకు వారితో నేమిసంబంధమున్నది ?

అ—ఈసంగతులు సలాబత్తునకుఁ దెలియును. అయిన నతఁడు—

ర—రాజకుమారా ! ఇందుకుఁగారణమేమని నీయూహ ?

అ—నేను బాగుగఁజెప్పలేను. కాని నాకనుమానముమాత్ర మున్నది.

ర—అది యెట్టిది ?

అ—అది యిట్టిదని చెప్పలేను. అయినను మనము గదుల న్నియుఁ దప్సీలుగాఁ బరీక్షించవలయును.

ఇట్లని యజీత్ సింగు తలుపు తెఱచెను. వానివెంట లాంతరు తీసికొని రఘువీరుఁడు నడచెను. గదిచూచి యజీత్ రఘువీరునితో

, చూచితివా! ఈగది బసచేయుటకు వీలుగానుండదని సలాబత్తుచెప్పియున్నాఁడు. ఎంతసౌఖ్యముగా శుభ్రముగా నున్నదో చూడు. మరమ్మతులేనందున పైభాగము కొంత శిధిలమైయున్నదిగాని లోపల రాణి నివసించుటకుఁ దగినసౌఖ్యములతోఁ బ్రకాశించుచున్నది.

ర—రాజకుమారుఁడా! ముసలివానిమాటలన్నియు శుద్ధ యబద్ధములు. ఇందులో జనులు నివసించుచున్నట్టుగాఁ గనుపించుచున్నది.

అ—ఆసంగతి నీకెట్లు తెలియును?

ర—ఎవరు నీగదియందు నివసించియుండనియెడల నింత శుభ్రముగా జాగ్రత్తగానుండదు.

అ—మనము మేడపైకివెళ్లి యక్కడ నేమియున్నదో చూచెదము.

ఈప్రకారముసంభాషించి వారిద్దఱు మేడపైకివెళ్లిరి. ఆగది కూడ చాలమనోహరముగా నుండెను. అందలి ప్రతివస్తువు సరియైన స్థలములోనుంచఁబడి కాంతులతోఁ బ్రకాశించుచుండెను. అప్పుడు రఘువీరుఁడు కలవరమైన మనస్సుతో నిట్లనెను. 'చూచితివా! రాజకుమారా! నేను చెప్పినదంతయు నిజమైనది. ఇక్కడఁ దప్పక నెవరో నివసించుచున్నారు.'

ఆగదిలో నొకవైపున బహుసుందరమైనట్టియు నమూల్యమైనట్టియు నొకమంచముండెను. దానిమీఁద విలువగలముఖమల్‌తోఁ దయారుచేయఁబడిన హంసతూలికాతల్పమమర్పఁబడియుండెను. ఒకమూల నతివిచిత్రమగు నగిషీపనిచేయఁబడిన దంతపుమేజాబల్లయును, దానిపైన రుచిగల ద్రాక్షారసముతో సగమునింపఁబడిన బంగారపుపాత్రయు నుండెను.

అప్పుడు రఘువీరుఁడిట్లనెను, 'రాజకుమారా! ముసలివాఁడీ మహల్ యెవరో నివసించుటకిచ్చియుండును. ఆసంగతి మనకుఁ దెలుపుటకిష్టపడుటలేదు.'

అజీత్ సింగంగీకారసూచకముగాఁ దలయూచి యిట్లనెను. 'అతఁడెవఁడో గొప్పసామంతుఁడై యుండవలెను. ఎందు కనఁగా సామాన్యులు బంగారుగిన్నెలో సారా త్రాగఁజాలరు.'

ఇంతలో రఘువీరుఁ డెక్కడనుండియో గొప్ప కుటుంబపు స్త్రీలు పెట్టుకొను నొడ్డాణమొకటితీసి 'రాజకుమారా! చూచితివా! ఇక్కడ తప్పక నొకబేగ మనఁగా మహమ్మదీయరాణి నివసించుచున్నది' అనెను.

'ఆబేగమెవరు? ఇక్కడ దాగియుండుటకుఁ గారణమేమి?' అని యజీత్ సింగడిగెను.

'ఈసంగతి మననుండిదాచుట యతని బుద్ధిహీనత. ముసలివాఁడైనను తానింకను బ్రేమలంపటుఁడై యున్నాఁడుకాఁబోలును. తానొక బేగము నిక్కడరహస్యముగాదాచి యామెతో సుఖించుచునాసంగతి మనకుఁ దెలిసిపోవునని మనమిక్కడ బసచేయకుండ నుండుట కనేకప్రయత్నములు చేసియున్నాఁడు. మీతో మాటలాడునప్పుడు మాట తడబడుటయు మూర్ఛవచ్చుటయు మనవెంట తన నౌకరును బంపుటయు నివియన్నియు నీకారణమువల్లనే జరిగియుండును.' అని రఘువీరుఁడు బదులుచెప్పెను.

అజీత్ సింగునకీమాటయందు నమ్మకము కలుగలేదు. కాని యాలోచించి యీప్రకారమనెను. 'ఒకవేళ నీవనుకొన్నప్రకారము నిజమైనను మనమా బేగమును యిక్కడనుండి తరిమివేయుట మంచిదికాదు.'

'ఇందుకు మీరు త్తరవాదులుకారు. మీకుఁ దెలియకుండ నీపని జరిగినది గనుక చక్రవర్తిగారి యాజ్ఞప్రకారము జరుపవలసి నదే' అని రఘువీరుఁడనెను.

అందు కజీత్ సింగిట్లనెను. 'రఘువీరుఁడా ! నాకిది యొకసమ స్యగాఁ గనుపించుచున్నది. ఇక్కడ నిన్నియుండ్లుండఁగా నీమేరి యమ్ బేగమ్‌మహల్‌లోవలనే మనలను బసచేయవలసినదిగాఁ జక్ర వర్తియాజ్ఞాపించుటకుఁ గారణము నాకుఁ దెలియకున్నది.'

'మనముండుటకిదియే సరియైనస్థలమని చక్రవర్తినమ్మి యి ట్లాజ్ఞయిచ్చియుండును.' అని రఘువీరుఁడనెను.

'అది సరియేకాని మనము జాగ్రత్తతో నుండుటవల్ల నష్ట మేమియులేదు. పరిస్థితులెప్పుడును మనమనుకొన్నప్రకారముండవు. మనకుఁ గనుపించువిధముగాక నింకొకవిధముగాఁ దలుచు మారు చుండును. నీవు నాముఖ్యస్నేహితుఁడవు. నాక్షేమముకోరువాఁడవు గనుక నీనుండి నే నేసంగతియుదాచకూడదు. నిజమేమనఁగా— నామనస్సునందొక యనుమానము బాధించుచున్నది. ఎందువల్లనో చెప్పలేను. ముసలివాఁడతని యిద్దఱునౌకర్లుగాక యీపాడుపడి నగ్రామములో నింకకొంతమందిజనులున్నట్లు నాకుఁ బూర్తిగా నను మానముకలదు' అని యజీత్ సింగనెను.

'మన కట్టిజాడేమియును గనుపించుటలేదు' అని రఘువీరుఁ డు బదులుచెప్పెను.

'పోనిమ్ము. ఏదియెట్లున్నను మనము జాగ్రత్తలోనుండుట మంచిది' అని యజీత్ సింగు గంభీరముగాఁ బలికెను.

---

# ౭ వ ప్రకరణము.



మేడపైనం గ్రిందనున్న గదులు పూర్తిగాఁబరీక్షించి యజీత్ సింగు రఘువీరుఁడును బైటికివచ్చి కాగడాలసహాయముతో భవనముచుట్టు పరీక్షించిరి. ఎవరును గనుపించలేదు. ఆప్రదేశమందుఁ బూర్వమొక యందమైన పూలతోటయుండెడిది. కాని యిప్పుడాభాగమంతయు ముండ్లచెట్లతో నడవితోను నిండియుండెను. పూర్వమాతోటలోనుండెడి పెద్ద శిలావిగ్రహమిప్పుడు శిథిలమై విరిగిపోయెను. పూర్వము చక్రవర్తి యతనిభార్యలయొక్క శిరస్సులమీద తుంపరలుగాఁ జిలుకరించెడు పన్నీరుగొట్టములిప్పుడు నామావశిష్టముగానుండెను. అటువంటితోటయొక్కస్థితి రాజపుత్రులిద్దఱును జూచిరి. అజీత్ రఘువీరునితో నిట్లనెను. 'సలాబత్ఖాక బేగము నీమహల్‌లో నుంచియున్నయెడల నీతోట యీస్థితిగానుండునా? ముండ్లచెట్లుకూడ బాగుచేయఁబడియుండలేదు.'

'బాగుచేయుటకు మనుష్యులెక్కడ? ఇది నిర్జనస్థలము. ముసలివాఁడిక్కడ నొక బేగమునుంచి యీసంగతియితరులకుఁ దెలియకుండ నుండవలెనని నపుకర్లనుకూడ పెట్టుకొనియుండలేదు. ఐన నీకర్చులనిమిత్తము కావలసినపైక మతనికెక్కడిది? చక్రవర్తియిచ్చు కొద్దిపాటి యుపకారవేతనమువల్ల నతఁడిక్కడ నివసించుచున్నాఁడు' అని రఘువీరుఁడు పలికెను.

అజీత్ తనసర్దారుఁడు చెప్పినమాటలకుఁ దృప్తిపడలేదు. అతనిమనస్సునందుఁగల యనుమానము పోలేదు. మరల నింటిచుట్టు తిరిగి పరీక్షచేసి సిపాయిలున్న గదులన్నియుఁ బరీక్షించి వారితో

'మీరు బహుజాగ్రత్తగానుండి పిలిచినతోడనే వచ్చుటకు సిద్ధముగానుండవలయును' అని యాజ్ఞయిచ్చెను. వారాప్రకారము సిద్ధముగానుండెదమని చెప్పిరి. తరువాత నజీబ్ రఘువీరునితో 'నీవీ దిగువగదిలోఁ బరుండుము. నేను మేడపైనగదిలో సుఖముగా నిద్రించెదను' అని చెప్పెను. రనపుత్రుఁడు మేడమీఁదకెక్కి దుస్తులు తీసి కత్తి గోడకుఁదగిలించి మంచముమీఁదఁగూర్చుండి యీప్రకారము తనలోఁదానాలోచించసాగెను. 'నాకు రఘువీరుఁడుచెప్పు మాటలయందు నమ్మకములేదు. అతఁడు తప్పుతోవలోనున్నాడు. అతఁడు చెప్పినప్రకారము సలాబత్ యిక్కడ నొకబేగము నుంచియున్న యెడల నీయిల్లుబైట తాళమెందుకు వేయఁబడియుండును? నౌకరు తెలివిగలవాఁడు గనుక నాబేగము నింకొకచోటికిఁజేర్చి యనుమానము కలుగకుండునటులు తాళము వేసియుండునని రఘువీరుఁడు చెప్పవచ్చును. ఏదియెట్లున్న నీరాత్రియేవో కష్టములు సంభవించునని భయముగానున్నది.'

ఈప్రకార మాలోచించుచుండఁగా నౌకరాహారము తెచ్చెను. ఆహారముభుజించి నౌకరుతో 'ఈరాత్రి మేడపైనఁ గ్రింద తెల్లవారువఱకు దీపములుంచి జాగ్రత్తగానుండవలయును' అని చెప్పెను. వాఁడాప్రకారముచేసి సెలవుపుచ్చుకొని వెళ్లిపోయెను. రనపుత్రవీరుఁడు పడకపైఁగూర్చుండి యీప్రకారము తిరిగి యాలోచించసాగెను. 'బేగ మీపరుపుమీఁద నెప్పుడును పరుండినట్లు నేను నమ్మను. ఇది యింకొకరి కేర్పాటుచేసియుండవచ్చును. అతఁడెవఁడైయుండును?' ఇట్లు కొంచెముసేపు వితర్కించి యేమియుఁ దోఁచక 'ఈప్రకారము కాలమెందుకు వృథాపుచ్చవలెను. చాల బడలియున్నాను' అని పరుండెను. కాని యరగంటవఱకు నిద్రరా

నందున తిరిగి పడకనుండిలేచి ' నిద్రరాకయున్నదే! ఆలోచనల తోనున్నవానిస్థితి యింతేకదా! రఘువీరునికిలేని యనుమానము నాకెందుకుఁ గలుగవలెను ?' అని యాలోచించి గోడకుఁదగిలించిన కత్తితీసి తన తలయొద్దనుంచుకొని ' బేగమ్‌మహాల్‌లో ననేక రహస్యద్వారములు, తలుపులు, గదులుండునని విందును. ఈహాలులో కూడ నటువంటియేర్పాట్లున్నవేమో తప్పీలుగా జాగ్రత్తగాఁ బరీక్షించెదను' అని యాలోచించుకొని యారసపుత్రవీరుఁడు ప్రతి తలుపు, గోడ, మూల, పరీక్షించి, కఱ్ఱతోఁగొట్టిచూచి యేమియు లేనని నిశ్చయపరచుకొని మేడదిగి హాలువద్దకు వచ్చిచూచునప్పటికి రఘువీరుఁడు గుఱ్ఱుపెట్టి నిద్రించుచుండెను. అంతయు నిశ్శబ్దముగా నుండెను. చీకటిరాత్రియగుటవల్ల నంధకారబంధురముగా నుండెను. కిటికీవద్ద చెవిపెట్టివినఁగా నందఱు గాఢనిద్రలోనున్నట్లు తెలియవచ్చెను. అట్టి చీకటిరాత్రియందుఁ దిరుగుటవల్ల లాభమేమియులేదని యూహించి తిరిగి తన పడకయొద్దకువచ్చెను. పరుండి మరల నీప్రకారమాలోచించసాగెను. ' చక్రవర్తి నన్నీయింటికేఁబంపెను ? ఎట్టి రహస్యాలోచనతో నీప్రకారముచేసెనో! ఇక్కడనాకుఁ బనియేమియుఁ గనుపించుటలేదు. ఇక్కడ పదునేనుదినములుండవలెనని చక్రవర్తి యాజ్ఞాపించెనుగదా! ఎన్నికష్టములు వచ్చినను వారియాజ్ఞ నెరవేర్పవలసినదే. మేరియమ్‌మహాల్‌లో నుండవలెనని యాజ్ఞయిచ్చియున్నారు. ఎందువల్లనని యడుగసాహసించనైతిని. ఆహా! మనమెంత నీచస్థితికివచ్చినాము. పదునేనుదినములలోఁ దిరిగి యుత్తరువులు పంపెదరఁట! అని యీప్రకార మాలోచించుచు గాఢనిద్రపోయెను.

మధురమైన సంగీతపుధ్వనివల్ల నజీత్ తిరిగి మేలుకొనెను. ప్రథమములోఁ దనకొక కలవచ్చినట్లుతోఁచెను. కాని మనస్సు కు

దురుపఱచుకొని చూడఁగా దూరమునుండి మృదుమధురమైన సంగీతము తనచెవులను నింపుచుండెను. పాటతో నాటకూడ జరుగుచున్నట్లు తోఁచెను. అజీత్ యొక్క యాశ్చర్యమునకు మితిలేకపోయెను. ఆసంగీతము గైలూరుమీఁద పాడఁబడుచుండెను. అతఁడు తనలోఁదానిట్లనుకొనెను. 'నాకుఁ దెలిసినంతవఱకు, నేను విన్నంతవఱకు సలాబత్తుకుటుంబముతప్ప యీపాడుపడిన గ్రామములో నితరజనమెవరును లేరు. ఈదృశ్యమేమని యూహించెదను. ఆటయొక్కయు మనోహరమైన పాటయొక్కయు ధ్వని యెక్కడనుండి నా చెవులను నింపుచున్నది? ధ్వని దగ్గఱగనేవినఁబడుచున్నది. ఈచుట్టుపట్ల దగ్గఱలో నింకొకయిల్లు లేదే? ఈమేరియమ్మహల్ తప్సీలు గాఁబ్రతిమూలలను శోధించియున్నానే! ఈయద్భుతమైనదృశ్యమింకొకయింటినుండి కనుపించుటకు వీలులేదు.' ఇట్లు తలపోసి యజీత్ తన పడకనుండిలేవఁ బ్రయత్నించెను. కాని యేమియాశ్చర్యము! తాను దన పరుండినపడకకు గట్టిగాఁద్రాటితోఁ గట్టివేయఁబడియుండెను. ఇంతపని యెట్లు జరిగినది? ఎవరెప్పుడతనిని యటులఁగట్టిరి? అతఁడు నిద్రించి కొద్దికాలమేయైనది. ఈసమయములోఁ గలలోనైన నూహింపని యింతపని జరిగినదే!

ఆశ్చర్యమును భయమునుబొంది కొంతకాలమునవఱకుఁ గదలకఁ దెలివిలేకఁ బడియుండెను. నోటినుండి మాటరాలేదు. ఇట్టిస్థితి యితనిజీవితములో నెన్నఁడును జరిగియుండలేదు. తన్నుఁగట్టినప్పుడు కొంచమైనఁ దనకుఁదెలియలేదు. చాలయాశ్చర్యము! అంతయు రెప్పపాటులో జరిగినట్లుగానుండెను. గదియొక్క తలుపులు, కిటికీలు, లోపల గడియవేయఁబడియుండెను. ఎవరును బైటనుండి లోపలకు వచ్చుటకెంతమాత్రము వీలుకనుపించదు. ఇట్టిస్థితిలో నీపనిజరుగుట

వల్ల నతనికాశ్చర్యమును భయమును మిక్కిలి యధికమయ్యెను. తన్నుఁగట్టఁబడినత్రాడు త్రెంచుకొనవలెనని ప్రయత్నించెను. కాని వానిప్రయత్నములన్నియు నిష్ఫలములయ్యెను. పాపము! ఆరాజకుమారుఁడు పదివందలయొక యుద్ధములలో జయించినవీరుఁడు. రజపుత్రవీరులకు మేటితిలకము. ఆహా! నేడు త్రాటితోఁగట్టఁబడి యొక యడుగైననుగదలక మాటాడలేకయుండెనుగదా! తన నిరుపమానమైన పౌరుషమువల్లఁ దనశత్రులకు గర్భనిర్భేదకముగా నుండె డా రాజకుమారుఁడు నేడు స్వాతంత్ర్యతను గోలుపోయి ఖైదీగానుండె నుగదా! రఘువీరుని పిలువవలెనని ప్రయత్నించెనుగాని నోరురాలేదు. మఱియుఁ దనయెదుట జరిగెడ్దృశ్యముచూచి మాటాడలేకపోయెను. కదలక మాటాడలేక శవాకారమువలె స్మృతితప్పి కండ్లు తెరచుకొని జరుగుచున్నది చూచుచుండెను.

అతఁడు కలువరించుచున్నాఁడా? లేక దేవతాలోకమునకుఁ దీసికొనిపోఁబడెనా? అట్టి దృశ్యము తనజీవితములో నెన్నఁడును జూచియుండలేదు. తనయొక్క వ్యక్తిత్వము మరచిపోయి స్వర్గసుఖములో దొర్లుచున్నట్లనేక మోహనాకారులగు సుందరీమణుల మధ్యనుండెను. తనయెదుట తెల్లరాతితోఁ బరుపఁబడిన యొక పెద్దహాలుండెను. హాలుమధ్య ననేకరంగులుగల దీపములతోఁ బ్రకాశించుచుండిన గొప్ప దీపస్తంభ మొకటి వ్రేలాడుచుండెను. అందులో వెలుఁగుచున్న కొవ్వువత్తులతోలూకు చమురుయొక్క సువాసనయా గదియంతయుఁగ్రమ్మి యాగది యొక దేవతాభవనమాయని యూహించుట కవకాశముకలిగినట్లుండెను. అనేకరంగులుగలిగి మంచి సువాసనలు వెదజల్లు పువ్వులయొక్కదండలచేత నాదీపస్తంభమలంకరింపఁబడినందున యాసువాసన రాజపుత్రునియొక్క ఘ్రాణరంధ్రము

లకు విందుగొల్పుచుండెను. చుట్టు బంగారునీరుతీయఁబడిన యనేక మైన నిలువుటద్దములయందు దీపములకాంతి నిరుపమానముగాఁ బ్రకాశించుచుండెను. ఒకవైపున ఛత్రచామరములతో రాజసింహాసనముండెను. అది యమూల్యమైన మణులచేతను రవ్వలచేతను ముత్యములచేతనుఁ జెక్కఁబడియుండెను. దానియందు ముఖమల్ మొదలగు విలువగలవస్తులచేఁ దయారుచేయఁబడి చుట్టు బంగారురేకులతో నమర్చఁబడిన యనేకములగు తలగడదిండ్లు కనుపించెను. ఆసింహాసనముమీాద నిరుమానలావణ్యముగల యొకసుందరి కూర్చుండియుండెను. ఆయందమైనముఖమునుండి బయలుదేరిన స్వర్గీయమైన ప్రకాశము గదికి నూఱురెట్లెక్కువ శోభనిచ్చుచుండెను. ఆమెయొక్క శరీర మాపాదమస్తకము మణులతోను, వజ్రములతోను, కెంపులతోను బంగారముతో నలంకరింపఁబడియుండెను. ఆమెయొక దిండుమీాఁదఁ జెయియానుకొని పరుండినట్లుండెను. ఇద్దఱు సుందరులైన చెలికత్తెలు బంగారువీవనలతో విసరుచుండిరి. ఆమృదువైన గాలిచేత నామె కట్టినపట్టుకోకయొక్క మునుగప్పడప్పుడు కొంచె మెగురుచుండెను. ఆమెకండ్లు చాలప్రకాశమానములై బుద్ధిసూక్ష్మతను దెలుపుచు, ప్రేమపూరితములై యుండెను. ఆమె తనచూపులు రాజకుమారునిమీాఁద నొకసారి ప్రసరింపఁజేసెను. రాజకుమారుఁడు మంత్రింపఁబడినపామువలె తనచూపామెయందే నిలిపెను. అటువంటి నిరుమానసౌందర్యముగల యువతిని యతఁడు తనజీవితములోఁ జూచియుండలేదు. అత్తరులు మొదలగు సుగంధద్రవ్యములనుండి వచ్చెడిసువాసన రాజకుమారునియొక్క హృదయము నందొకవిధమైన కలవరము గలుగఁజేసెను. ఆస్త్రీ కూర్చుండియున్న సింహాసనమునకెదుట నొకగొట్టము మంచిసువాసనగల పన్నీరుయొక్కతుం

పరలను వెదఁజల్లుచుండెను. రాజపుత్రునిదృష్టి యాస్త్రీయొక్క ముఖమునందే లయమైయుండెను. స్త్రీలు పాడుచుండినసంగీత మతిమనోహరముగా వినవచ్చుచుండెను. అజీత్ తనను దానుమఱచెను. తానప్సరసలమధ్య దేవతాలోకములో నున్నట్లూహించెను. అతఁడు చక్రవర్తితాలూకు బేగమ్‌మహల్‌యొక్క యద్భుతములు వినియున్నాఁడు. కాని యెన్నఁడు నందలి సుందరీమణులను జూచియుండలేదు. ప్రస్తుతము తానామహలునకుఁ దీసికొనిపోఁబడెనా? ఆప్రకారము వెళ్లుటకు స్వాతంత్ర్యము చక్రవర్తికిని యతనిభార్యకునుతప్ప నితరులకులేదు.

అజీత్‌సింగునకుఁ బగలుజరిగిన సంగతులన్నియు జ్ఞప్తికివచ్చెను. తానాగ్రయందుఁగాని, ఢిల్లీయందుఁగాని లేదు. పాడుపడిన పత్తేపూరుసిక్రిలో మేరియమ్‌బేగమ్‌మహాలులో నిద్రించియుండెను. కాఁబట్టి చక్రవర్తితాలూకు బేగముమహాలునకు వెళ్లుట యసంభవము. అయితే యతఁడప్పుడెక్కడనుండెను. ఏమియుఁ దోఁచక నజీత్ తనలోఁదా నీప్రకారమాలోచించసాగెను.

‘ముసలి యమ్రూపుసాహేబీమహాలులో నొక బేగమునుంచినయెడల నాబేగమీమెయేనా? అట్లైన సలాబత్తుకూడ నక్కడనుండవలెను. కాని యతఁడులేఁడు. అటులకాదు. చక్రవర్తిహృదయమునుకూడ మెత్తపరచఁగలిగిన యాస్త్రీ ముసలిమహమ్మదీయునితోఁ దృప్తిపడునా?

ఈప్రకారమాలోచించుచుఁ దనమంచముమీఁదఁ గదలక నోటమాటలేక నజీత్‌సింగు పరుండియుండెను. అయితే యతఁడు కలువరించుచుండెనా? ఎన్నటికిని కాదు. అతఁడు బాగుగ మెలకువతోనుండెను. అతనివిషయములన్నియుఁ బనిచేయుచుండెను. యోచ

నాశక్తియుఁ గలిగియుండెను. తిరిగి రఘువీరుని కేక వేయవలెనని ప్రయత్నించెనుగాని నోటినుండిమాట పైకిరాలేదు. ఉక్కిరిబిక్కిరియగునట్లుగా నతనికిఁదోచెను.

---

## ౭ వ ప్రకరణము.

ఆగదియందందఱు స్త్రీలేయని యజీత్ సింగు ప్రథమములో నూహించెను. కాని తరువాతఁ దనపొరపాటును దెలిసికొనెను. ఆ సౌందర్యరాసియగు స్త్రీప్రక్కన మూల్యమైన ముఖమల్ గుడ్డతో నమర్పఁబడిన యాసనముమీఁద నొక రసపుత్రవీరుఁడు కూర్చుండెను. అజీత్ కదలలేనందున యారాజకుమారునియొక్క ముఖము స్పష్టముగా గనుపించలేదు. కాని యతఁడొక గొప్పకుటుంబమువాఁడనియూహించెను. అతని తలపాగామీఁద వజ్రము లమర్చఁబడియుండెను. ఆస్త్రీచేతులు రాజకుమారుని చేతులలో నుండెను. రాజకుమారుఁ డామెయందు మోహపరవశుఁడై యుండెను.

తరువాత నాయావనస్త్రీ తనచేతితో నొక బంగారుగిన్నె యెత్తి రాజకుమారుని నోటియొద్దపెట్టఁగా దానిలోనున్న ద్రావకమతఁడు పూర్తిగాఁ ద్రాగివేసెను. ఉత్తరక్షణము రాజకుమారుఁడు లేచినిలుచుండఁ బ్రయత్నించెను. కాని నిలుచుటకు శక్తిలేక వణఁకుచు బాధతో నేలపైఁబడెను. ఆయువకుఁడాప్రకారము స్పృహతప్పి చావసిద్ధముగా నున్నసమయమందిద్దఱు దాసీలువచ్చి వానిమీఁది దుస్తులు తీసివేయసాగిరి.

తన కన్నులయెదుట జరిగిన భయంకరమైన ఖూనీజూచి యజీత్ భయకంపితగాత్రుఁడయ్యెను. ఈక్రూరాత్ములైన పిశాచిని యెంతమాత్రము సంకోచములేక యిట్టి నరహత్యచేసెను. ఇంతకంటె ఘోరమైనకార్య మేదైనఁగలదా ? కాని యీయువకుఁడెవరు ? అజీత్ కేకవేయ నుద్యుక్తుఁడయ్యెను. కాని నోటివెంట మాటలేదు, ఆరాక్షసియొక్క నాకర్లగు నిద్దఱు దాసీలాయువకుని లేవనెత్తి గోడకానించిరి. ఆశవాకారముజూచి యజీత్ సింగు చాలభయపడెను. ప్రతిమంగళవారము ఢిల్లీభవనద్వారమునొద్ద జరుగుచుండిన భయంకరదృశ్యము తనకన్నులకుఁ గట్టినట్లెదుటఁ గనుపించుచుండెను. అందువల్ల నతనికి మఱింతయాందోళన కలిగెను. అదిచూచి శరీరమందు గగురుపాటుచెందెను. ఈదృశ్యమునకు ఢిల్లీదృశ్యమునకు భేదమొకటియే. అక్కడిశవము ఢిల్లీగేటున కానించఁబడియుండెను. ఇక్కడ గోడకానించఁబడియుండెను.

ఈపశుప్రాయులగుస్త్రీల కందమైన వాల్చూపులుగలిగినను సుందరమైన ముఖములుగలిగినను, హృదయములు నరకకూపములతోఁ బోల్పఁదగినవిగానుండెను. వారారాకుమారుని లాలనజేసి, భ్రమింపఁజేసి ప్రేమించినట్లు నటించి ఖూనీచేసిరిగదా ! ఎంతచతురతతో శవములను ఢిల్లీగేటునొద్దకుఁ దీసికొనివెళ్లుచుండిరో మనుష్యమాత్రునకుఁ దెలియ నశక్యముగానున్నది. ఎంత దుర్మార్గము ! వారిహృదయములు శిలలుగాని వేఱుకాదు.

కాని యీస్త్రీలు విషముపెట్టిచంపిన యీరాజకుమారుఁడెవరైయుండును ? గోడకు శవమానించుటవల్ల దానిముఖ మజీత్నకుఁ గనఁబడెను. అజీత్ సింగాముఖముచూచి నిర్ఘాంతపోయి కెవ్వ

నఁ గేకవేసెను. కాని యా కేకయొక్కధ్వని పైకివినఁబడలేదు. తన లోఁదానిట్లనుకొనెను. ' ఓ దేవుఁడా! ఉదయపురము మహారాణా పెద్దకుమారుఁడగు నుదయసింగీవిధముగా ఖూనీచేయఁబడెనుగదా! మహారాణా యీదుఃఖమెట్లు భరింపఁగలఁడు! ఈవార్తవినిన యతనిగుండెలు వ్రియ్యలగుటకు సందియములేదు.'

అప్పుడా మాయలమారియగు నాసుందరస్త్రీ తన సింహాసనమునుండి యీప్రకారమనెను. ' ఓ రాజపుత్రవీరుఁడా! రేపు నీకు నిదేగతిగలుగును. మేమెంతచమత్కారముగా నీశవమును ఢిల్లీనగర ద్వారమును జేర్చుచుంటిమో చూచితివా?' అజీత్ సింగు మిక్కుటమైనకోపముతోఁ బ్రాణములన్నియు బిగఁబట్టి బిగ్గరగా ' ఓనీచమైన పాపాత్మురాలా!' అని యనెను. కాని నోటినుండిమాట సరిగా రాలేదు.

ఇంతలోనంతయుఁ జీకటిమయమయ్యెను. క్షణమాత్రములో దృశ్యమంతయు మారిపోయెను. అజీత్ సింగు తిరిగి తనపూర్వపుగదిలోనే యుండెను. దీపమెక్కడ వెలిగింపఁబడియుండెనో యక్కడనే వెలుఁగుచుండెను. అతఁడు తనపరుపుమీఁదనే పరుండియుండెను. తనకన్నులను దాను నమ్మలేకయుండెను. ఇట్టి యస్వాభావికమైన దృశ్యములు, మార్పులుచూచి యెవరాశ్చర్యమునుబొందరు! అజీత్ శరీరమందుఁ గట్టఁబడినత్రాడు క్రమముగా విడిపోయెను. ఇది కల గాదు. ఎవ్వరో నన్నుఁ ద్రాడుబెట్టికట్టియున్నారని యతఁడనుకొనెను. తత్క్షణము మంచమునుండి క్రిందికిదుమికి ప్రక్కనున్నకత్తితీసి మంచముక్రింద నెవరైన దాగియుండిరేమోయని చూచెను. కాని యెవరును లేరు. మనుష్యులెవరాగదిలోనికి వచ్చినజాడయును లేదు. మఱేం

త యాశ్చర్యముఁబొంది శిలావిగ్రహమువలె మాటాడక నిలు చుండెను.

అకాత్తుగా హృదయభేద్యమగు నొకయేడుపు వినుపించెను. ఆయేడుపు క్రమక్రమముగా హెచ్చుకాఁజొచ్చెను. నిశ్శబ్దమైన యారాత్రిసమయమం దాయేడుపు మనుష్యులకేకాక పక్షులకు మృగములకుఁగూడ జాలికలుగఁజేయుచుండెను. అజీత్ సింగు కరు ణారసపూరితుఁడై కత్తితీసికొని మేడక్రిందకుఁ బరుగెత్తెను. కాని యతనికి నేమియుఁ గనుపించలేదు. ఏడుపుఘుమాత్రము వినవచ్చు చుండెను. అమావాశ్యరాత్రివలె నుండాకటికచీఁకటిలో నెవరోయొక మనిషి యాయింటినుండి బైటకుఁ బరుగెత్తుచున్నట్లతనికిఁ జూచా యగాఁ దోఁచెను. రాత్రియంతయుఁ బైగదిలోను గ్రిందిగదిలోను దీపములు వెలుఁగునట్లజీత్ యేర్పరచియుండెను. కాని క్రిందిగదిలో దీపములేదు. ఎవరట్లాదీపము నార్పిరిరో తెలియలేదు.

రఘువీరుఁడెక్కడ ? తానుజూచిన మనుజునీడ రఘువీరుని దా ? అతఁడాప్రకారము భయపడి పిల్లవానివలె నేడ్చుటకుఁ గార ణమేమి ? అజీత్ సింగు నాలుగువైపులు పరీక్షించిచూచెను. ఏమి యును గనుపించలేదు. ఆయింటనెవరో యొకరుండియుండవలెనను ననుమానముమాత్రమతనికి బలమయ్యెను. ఎవరునతనికిఁ గనుపించ కపోయిన నెవరో పైకి పొంగిపొరలివచ్చుదుఃఖ మాపుకొని బాధ పొందుచున్నట్లతనికిఁదోఁచెను. అతఁడు స్వభావముగా ధైర్యస్థుఁడైన నిప్పుడు భయమునకులోనై యాపాదమస్తకము వణఁకఁజొచ్చెను. శరీరమంతయు గగురుపాటుజెందెను. తత్క్షణమే మహలునుండి పరు గిడ మొదలిడెను. మేడగేటుదాఁటి బైటకువచ్చుసరికి రఘువీరుని

యేడ్పులువిని సిపాయిలందరు నేద్వఁజొచ్చిరి. గుఱ్ఱములుసకిలించెను. అంతయు గందరగోళముగానుండెను. రసపుత్రులు తాము తమశత్రువులవలన ముట్టడింపఁబడితిమని భ్రమించి కత్తు లిటూనటుఁ ద్రిప్పఁ బ్రారంభించిరి. క్షణమాత్రములోఁ బత్తేపూరుసిక్రిగ్రామ మొక యుద్ధరంగముక్రింద మారెను. అజీత్ సింగు బిగ్గరగా 'ఏమిటిది' అని యరచెను. కాని యాయుల్లకల్లోలములో నతనిమాట యెవరికిని వినుపించలేదు. ఒక సిపాయిమాత్రము తనయజమానుని మాటగుర్తించి రెండుచేతులతోఁ గాగడాలు తీసికొనివచ్చెను. ఆవెలుతురులో సిపాయిలొకరినొకరు గుర్తుతెలిసికొని కత్తులు త్రిప్పుట మానివేసిరి. రాజకుమారుఁడు 'ఇదియంతయు నేమిటి?' అని తిరిగి వారిని యడిగెను. అప్పుడు సిపాయిలిట్లు చెప్పఁదొడగిరి.

'మేము గాఢనిద్రలోనుండఁగాఁ గేకలు వినుపించినవి. శత్రువులు మాపైఁబడిరని మేమూహించితిమి.'

'ఈమేడయొక్క సింహద్వారము లోపలతాళము వేయఁబడినది. ఈప్రహారీగోడ యెత్తుగానున్నది. మనుష్యులు లోనికివచ్చుటకు వీలుకనుపించదు' అనియజీత్ సింగనెను.

'అవును. ఎవరైన లోనికివచ్చినయెడలఁ దప్పక వారిని కనుగొనవచ్చును' అని యొకసిపాయి బదులుచెప్పెను.

'రఘువీరుఁడెక్కడ!' అని యజీ త్తడిగెను.

'ఇక్కడ కనుపించరు. లోపలనున్నారేమో' అని సిపాయి బదులుచెప్పెను.

'దీపముయొక్కసహాయమువల్ల లోనంతయు వెదుకుదము రండు' అని యింకొకసిపాయి యనెను.

అప్పుడు సిపాయిలందఱు కాగడాలు వెలిఁగించుకొని యా మహాలుఁ బ్రిహారీలోపల ప్రతిమూల, సందు, గొందు వెతకిరి. ఒక మూల రఘువీరుఁడు సగముచచ్చినవానివలెఁ బడియుండుట వారు చూచిరి. రాజకుమారునికి భయము, విచారమధికమయ్యెను. త్వరగా నీరుతెమ్మని యతఁడు కేకలువేసెను. ఒకనౌకరు నీరుకొఱకువెళ్లెను. అజీత్ రఘువీరుని లేవనెత్తి వానితల తనతొడమీఁదఁబెట్టుకొని వానికుపచారముచేయుచుఁ దనలోఁదానిట్లనుకొనెను. 'ఆహా! అనేకయుద్ధములలో మెప్పువడసిన యీశూరాగ్రేసరుఁడు భయమువల్ల నిప్పుడెట్లు పడియున్నాఁడో! స్పృహతప్పియున్నను ప్రాణమున్నది. నాడి కొట్టుకొనుచున్నది. ఉచ్ఛ్వాసనిశ్వాసములు గలిగియున్నవి. నోటనుండి నురుగువచ్చుచున్నది.'

ఇంతలో నౌకరు నీరుతెచ్చెను. రఘువీరునిముఖముమీఁద రాజకుమారుఁడు పలుమారు నీరు చిలకరించెను. కాని దానివల్లను ప్రయోగములేకపోయెను. తెలివిరాలేదు. రాజకుమారుఁడు చాల యాదుర్దాపడెను. ఒకగంటవఱకుఁ బరిచర్యచేసిన పిమ్మట రఘువీరుఁడొక పెద్దనిట్టూర్పువిడచి నెమ్మదిగాఁ గనులుతెరచి హీనస్వరముతో 'నేనెక్కడనున్నాను?' అని యడిగెను. అజీత్ తనయొక్కయుద్రేకమునాపుకొని 'సర్దారుఁడా! నీకు భయములేదు. సమాచారమేమి?' అని యడిగెను.

రఘువీరుఁడు వణఁకుచు భయముతోఁగూడిన స్వరముతోఁ 'దయచేసి నన్ను సాధ్యమైనంతత్వరలో నీచోటినుండి యింకొకచోటునకుఁ దీసికొనిపొండు' అని ప్రార్థించెను.



# ౯వ ప్రకరణము.



రఘువీరుఁడు పాలుత్రాగుపిల్లవాఁడుకాఁడు. అబలుఁడును గాఁడు. ధైర్యములేని పిరికిపందకాఁడు. అనేకయుద్ధములలోఁ గత్తి చేతఁదీసికొని యొంటరిగాఁ బౌరుషముతోఁ బోరాడినజట్టి. అనేక సార్లనేకయుద్ధములయందతని పౌరుషము ధైర్యము కొనియాడఁబడి నది. అట్టివానికిట్టిస్థితి కలుగుటకుఁ గారణమేమి? అస్వాభావికమగు భూతలీలవల్ల నిట్టిపని జరిగియుండెనా? ఈమేడలో దయ్యములు భూతములు నివసించుచుండెనా? లేనియెడల నట్టి ధైర్యశాలియగు రఘువీరునికిట్టిప్రమాదము గలిగియుండదు. రాజపుత్రులకు భూతములయందు నమ్మకమున్నది. కాని యజీత్‌సింగట్టి చాపల్యమునకు లోనగువాఁడుకాఁడు. ఐనను రాత్రి తనకుఁగలిగినస్థితియంతయు నతనికి జ్ఞప్తికివచ్చెను. తాను త్రాళ్లవలనఁగట్టఁబడెను. మేడంతయు వివరముగా శోధింపఁబడెను. రహస్యద్వారము లెక్కడను గనుపించ లేదు. తనకుఁ గనుపడినదృశ్యమునకుఁ గారణమేమి? బహుశః యాదృశ్యములు పిశాచములవల్ల నిర్మింపఁబడి కన్నులకునిజమువలెఁ గనుపడియుండవచ్చును. ఇప్పుడజీత్‌సింగునకు పిశాచములయునికి యందు నమ్మకమున్నట్లు తోచెను. తనకు జరిగినపరిభవమేగాక రఘువీరుఁడుకూడ భయభ్రాంతి పొందఁబడియుండెను. దీనికి సరియైనకారణమరయనేరక యజీత్‌సింగు మానసాందోళనకులోనై విచారించుచుండెను.

రఘువీరునకింకను దెలివిరాలేదు. అతఁడప్పుడు సంధియెత్తిన వానివలె, నన్నుఁ దీసికొని వెళ్లుఁడు. దూరస్థలమునకుఁదీసికొని వెళ్లుఁ

డు' అని యస్పష్టమైన వాక్కులతో నరచుచుండెను. అజీత్తతనికి
ధైర్యముచెప్పుచుండెను. ఇంతలో సిపాయిలక్కడకువచ్చి తమసేనా
నికిఁ దటస్థించినస్థితిచూచి విస్మయపడుచుండఁగా నజీత్ సింగు వారి
తో 'మీసర్దారు కొంచెము జబ్బుస్థితిలోనున్నాఁడు. ఉపచారము
లవల్లనెమ్మదికాఁగలదు. మీలోఁగొందఱు నాకుసహాయముచేయుఁ
డు. మిగిలినవారాయుధపాణులై మహల్లోనికివెళ్లి స్పష్టముగావె
దకి మనుష్యుఁడెవఁడైనఁ గనుపించినయెడల నాయొద్దకుఁ దీసికొనిరం
డు' అని యాజ్ఞయిచ్చెను. అప్పుడు 10, 12 గురు సిపాయిలు కా
గడాలుతీసికొని మహాలువెదకుటకు వెళ్లిరి. మిగిలినవారజీతుకడనుం
డిరి. 'ఇప్పుడెంతప్రొద్దుపోయినది?' అని యజీత్ సిపాయిలనడిగె
ను. ఒక ముసలివాఁడాకసమువంకఁజూచి తెల్లవారవచ్చినదని చెప్పె
ను. అజీత్ సింగు తనకు రాత్రిజరిగిన పరిభవము సిపాయిలతోఁజెప్పి
న వారు నిరుత్సాహపడుదురని చెప్పలేను. కాని రఘువీరునికిఁగలి
గిన ప్రమాదమెట్టిదో తెలిసికొనుటకై యతనితో నొంటరిగా మా
టలాడఁగోరి సిపాయిలనందఱిని మహాలుకావలాయుండుఁడని నియో
గించి తాను రఘువీరునిచేయి పట్టుకొని లేవఁదీసెను. కాని యతనికి
లేచుటకు శక్తిలేక కాళ్లుతడఁబడెను. అప్పుడజీత్ సింగు రఘువీరుని
తన కౌఁగిటఁజేర్చి లేవనెత్తి నెమ్మదిగా మహాలుబైటకు నడిపించెను.
బైటయంధకారబంధురము. కాని యాకసమందు నక్షత్రములు
వానికాంతిని మిణుకుమిణుకుమని ప్రసరింపఁజేయుచుండెను. పుష్ప
ములనుండివచ్చు సుగంధముతోఁగూడిన శీతలమందమారుతము
వీచుచుండెను. సిపాయిల పహరాధ్వనులుతప్ప యట్టినిశ్శబ్దమైనవేళ
నితరధ్వని వినుపించుటలేదు. అజీత్ తనలోఁదానిట్లు తలపోయసాగె
ను. 'ఈపాడుపడిన గ్రామమునందు సలాబత్తుకుటుంబముతప్ప నిం

కెవరును లేరా ? ఉన్న యెడల నీసిపాయిలుచేయు గందరగోళము విని యదియేదియో కనుగొనవలెని యిక్కడికిరారా ? సలాబత్తు నివసించునిల్లుకూడ సమీపమునందేయున్నదే ! ఈధ్వని వారికి వినుపించకుండునా ? వినియు వారికి సంబంధములేనట్లు నిద్రించు చుండిరా ? '

ఈప్రకారము తలపోయుచుండఁగా సుందరబంధురమను సమీరస్పర్శవలన రఘువీరునిబ్రమ కొంతతగ్గి తెలివివచ్చినట్లు కనుపడెను. అప్పుడజీత్ సింగు రఘువీరుని నొకయెత్తైన రాతిబండపైఁగూర్చుండుమని తానుకూడ యతనిప్రక్కను గూర్చుండెను. క్షణకాలములో రఘువీరుఁడొక పెద్దనిట్టూర్పువిడిచి ‘ భయంకరము. అతిభయంకరము ’ అని యరచెను.

‘ సర్దారుఁడా, నీమనస్సింత కలవరపెట్టిన విషయమేదియో తెలియఁజెప్పుము. నాకదివినవలెనని కోరికయున్నది ’ అని యజీత్ డిగెను. ‘ నామనస్సింకను కుదుటపడలేదు. నన్నింత భయపెట్టినదృశ్యము నాకుఁ బ్రస్తుతము జ్ఞప్తికివచ్చుటలేదు ’ అని రఘువీరుఁడు జవాబుచెప్పెను. ‘ తొందరలేదు. నీవువిశ్రాంతితీసికొని మనస్సు నిర్మలముగానున్నప్పుడే చెప్పవచ్చును ’ అని యజీత్ చెప్పెను.

తిరిగి యొకగంటవఱకు నెవరును మాటాడలేదు. రఘువీరుఁడు తా నేమియాలోచించుకొనుచుండెనో యెవరికిని దెలియదు.

అజీత్ సింగు పదుచువాఁడు. రాజపుతానాకొండప్రదేశమందుపుట్టి, ధైర్యసాహసములుగలిగి, యుద్ధములయందారితేరినవాఁడై సామాన్యమనుజునివలె జీవితముగడుపుచుండెడివాఁడు. మొగలాయి దర్బారునం దాఱుమాసములనుండియే కొలువులోనుండియున్నవాఁ

డు. గనుక నాదర్బారుయొక్క కుతంత్రములు, రహస్యాలోచనలు మొదలగునవి యతనికిఁ దెలియవు. కాఁబట్టి యతఁడు తనలోఁ దానిట్ల నుకొనసాగెను.

'చక్రవర్తి నన్నీ పాడుగ్రామమున కేకారణమువల్లఁ బంపి యుండును? ఈమేరియమ్‌మహాలులోనే బసచేయుమనియాజ్ఞాపించు టకుఁ గారణమేమి? నేనిక్కడ ప్రవేశించుటకు సలాబత్తున కెందు కిష్టములేదు? ఈరాత్రికనుపించిన దృశ్యములసంగతి చక్రవర్తికిఁ దె లిసియుండునా? తెలిసియుండిన దయ్యములకు నివాసమైన నీగృ హామునకు నన్నెందులకుఁ బంపియుండును?'

ఈప్రకార మాలోచించుకొనుచుండఁగా రఘువీరునికి బాగు గ తెలివివచ్చి యొక పెద్దనిట్టూర్పువిడిచెను.

సర్దారా! ఇప్పుడు నీవు క్షేమముగానున్నావా?' అని య జీత్ సింగు రఘువీరుని యడిగెను.

'స్వామీ! బాగుగనయమే. నాస్థితికి నేనే సిగ్గుపడుచున్నా ను' అని రఘువీరుఁడు బదులుచెప్పెను.

సిగ్గెందులకు? నీమనస్సింత కలవరపడుట కేదోయొక య స్వాభావికకారణ ముండవలయును? ఆసంగతియేదియో చెప్పుము' అని యజీత్తడిగెను.

'నాకు జ్ఞాపకమున్నంతవఱకుఁ జెప్పెదను. కాని యాసంగతి విని వన్నుండఱు పరిహాసముచేసెదరేమోయని నాకుభయమగుచు న్నది' అని రఘువీరుఁడుచెప్పెను.

'బుద్ధిహీనులు నవ్వెదరుగాని బుద్ధిగలవారెన్నఁడును పరి హాసముచేయరు' అని యజీత్ బదులుచెప్పెను.

‘ ఏదెట్లున్నను రేపు మన మింకొకచోటికివెళ్లిన బాగుండు ను’ అని రఘువీరుఁడు చెప్పెను.

అజీత్ సింగుకూడ దయ్యములకొంపలో నింకొకరాత్రి నిద్రించుటకిష్టములేక ‘ ఈపాడుబడినగ్రామములో నిండ్లు చాలయున్నవి. రేపు తప్పక యింకొకయింట బసచేయుదము ’ అని యజీత్ సింగు జబాబుచెప్పెను. రఘువీరుఁడు కొంతసేపటివఱకు నేమియు మాటాడకయూరకుండెను. అతఁడు తనకథ యప్పుడుచెప్పుటకు సందేహించుచున్నట్లజీ త్తూహించి ‘పోనీ నీకథ రేపుచెప్పవచ్చును’ అనెను.

‘ రాజకుమారా ! అట్లుకాదు. నాకథయావత్తు నిప్పుడే చెప్పెదను. ఆలోచనాశక్తి కోలుపోవుటచే నేమియు నిశ్చయించుట కసమర్థుఁడనై యుంటిని.’ అని రఘువీరుఁడు చెప్పెను.

‘ అయితే కథయేమియు విడిచిపెట్టక మొదటినుండి చివరవఱకంతయుఁ జెప్పుము ’ అని యజీత్ సింగడిగెను.

రఘువీరుఁడందుల కొప్పుకొని తనకు జ్ఞాపకశక్తి గలిగినంతవఱకేమియు విడిచిపెట్టక తన రాత్రికథ యీప్రకారము చెప్పఁదొడఁగెను.

---

## ౧౦ వ ప్రకరణము.

రోజంతయుఁ బ్రయాణముచేయుటచే చాల బడలికఁజెందినవాఁడనై భోజనానంతరమువరుండి గాఢనిద్ర పొందితిని. కాని వరుండుటకుఁబూర్వమే గది తలుపులు కిటికీలు మున్నగునవి మూసియుంటిని. నౌకరు దీపముకూడ వెలిగించివెళ్లెను. నేను యెంతవఱ

కు నిద్రించితినో నాకు జ్ఞప్తిలేదు. కాని నేనకాత్తుగా లేచునరికి నొ డలంతయుఁ జెమటపట్టెను. ఆ చెమటవల్ల పక్కబట్టలుకూడ తడిసి యుండెను. రాజకుమారా! నాయొక్క యప్పటిస్థితి నేను చెప్పఁ జాలను. ఏదోయొక భయము నామనస్సును బాధించుచుండెను. ఆ పాదమస్తకము వణఁకుపుట్టినది. నానరములు మొద్దుబారెను. ఒడ లంతయు గగురుపాటుఁజెందెను. ఏదో యొకదయ్యా మావహించిన వానివలె భయపడుచుంటిని. ఎవరో గొంతుక పిసుకుచున్నట్లూపిరి యాడక నోటమాటరాకయుండెను. ఎన్నఁడు నిట్టిబాధ యనుభవిం చియుండలేదు. కన్నులుతెరచిచూఁడగా నంతయుఁ జీకటిమయము గానుండెను. దీపములేదు. దీపమెట్లారిపోయినది తెలియలేదు. ద్వా రములు కిటికీలు బాగుగ బంధింపఁబడియుండుటవల్ల లోపలికి గాలి రావీలులేదు. నేను మిమ్ముల్లఁబిలువవలెనని ప్రయత్నించితినిగాని నానోటివెంట మాటరాలేదు. అస్వాభావికమైనపని జరిగినట్లు తెలిసి కొంటిని. అనేకయుద్ధములలో ధైర్యసాహసములతో నొంటరిగాఁబో రిన నాకు భయమావహించెను. నేనెన్నఁడు నట్టిభయంకరదృశ్యము ను జూచియుండలేదు. ఆకటికిచీఁకటిలో భయంకరమైన పిశాచరూప మొకటి నన్నుఁజంపుటకు నావైపునకు వచ్చుచుండెను. సంరక్షించు కొన శక్తిలేక చైతన్యహీనుఁడనై కొయ్యవలె మొద్దుబారియుంటిని. నేనప్పుడుపొందిన మనోవ్యాకులత చెప్పశక్యముకాదు. నాజీవితము లో నెన్నఁడు నదిమరువను. క్రమముగ నేను చచ్చిపోవుచున్నట్లు నాకుఁదోచెను.

ఈప్రకారము తనకథ రఘువీరుఁడుచెప్పి గుండె దడఁదడఁ గొట్టుకొనఁగా నిటూర్పువిడుచుచు నీప్రకారము తిరిగి చెప్పఁ దొడఁగెను.

‹ ఓరాజా ! ఘోరము ! అతిఘోరము ! నేనట్టిదృశ్యము సరిగా నిరూపించినయెడల మీరు భయముచే నిశ్చేష్టులుకాఁగలరు. అకస్మాత్తుగా నాచీకఁటిలో గదిమూల మిణుకుమిణుకుమని యొక నీలపుదీపము కనుపించెను. బలవంతముగా నేనావెలుతురు చూడవలసివచ్చెను. ఆవెలుతురు రెండాఁగువచ్చుని గుండ్రనిదీపములక్రింద మారి యొకదానితోనొకటి యాడుకొనుచున్నట్లుగా నాకనులయెదుట నాట్యముచేయసాగెను. కొంతసేపటికవి యాటమాని నాయెదుట నిలుచుండెను. పరీక్షించిచూడఁగా నేమియాశ్చర్యము ! ఆరెండు దీపములొక మనుష్యునియొక్క రెండుకనులుగా మారెను. అవి చాలభయంకరమై ప్రకాశమానముగా నుండెను.

ఈప్రకారము చెప్పుచు రఘువీరుఁడు భయమువల్ల వణఁకసాగెను. కొంతసేపటివఱకు మాటాడలేకపోయెను. మనస్సు కుదురుపరచుకొని యీప్రకారముతిరిగి చెప్పసాగెను.

ఆప్రకార మాకన్ను లెంతకాలము నావంక దృష్టినిలిపినది చెప్పలేను. ఆచీఁకటిలోఁబ్రకాశించు నాకను లెవరివైనది గుర్తించలేదు. కాని యాచీఁకటిలో నాదృశ్యము నెవరుచూచిన నట్టివాని నెత్తురు భయమువల్ల గడ్డగట్టుకొనుననిమాత్రము నేను జెప్పఁగలను. తరువాత కొంతసేపటికాకనులప్రక్క నొక తెల్లవెలుతురు కాన్పించెను. ఆవెలుతురు సహాయమువల్ల మాంసహీనమై యస్థిపంజరముతోనున్న యొక పొడుగుపాటిమనుష్యుఁ డెదుటనిలిచియున్నట్లు కనిపించెను. ఆమనుష్యుఁడాపాదమస్తకము దిగంబరుఁడై రెండువరుసల పెద్దపెద్దపండ్లుగలిగి భయంకరమైనధ్వనితో నవ్వసాగెను. గుడ్లు తదేకదృష్టితో నన్నుఁజూచుచు నేయుండెను. తరువాత నాయెముకల బొమ్మ తనచేతినిజూపి వ్రేళ్లతో నన్నుఁజూపి యేదో యనెనుగాని

యామాటలు నాకుఁ దెలియలేదు. తిరిగిపిడికిలిబిగించి పండ్లు పటపటఁ గొరికి శరీరమంతయువణకఁ గోపముతో నేదో బిగ్గరగా నట్టహాసము చేసెను. ఓరాజకుమారా ! ఆదృశ్యము నాహృదయమును భేదించెను. నానరములు బిగిసిపోయెను. నేను భయముతో నాశ్చర్యముతోను గొయ్యబారిపోతిని.

ఈమాటలువిని యజీత్‌సింగుయొక్క గుండెదడఁదడఁ గొట్టుకొనసాగెను. కాని కొంతవడికి మనస్సుకుదురుపరచుకొని రఘువీరుఁడు చెప్పుకథ వినసాగెను.

'ఆయెముకలబొమ్మ తనయొక్క యెఱ్ఱనినాలుకను బొడవుగాఁ జేసి దేనినో నాకుచున్నట్లెటునటుఁ గదపుచుండెను. చేతులు రెండును బాగుగజాపి నన్నుఁ గౌఁగిలించుచున్నట్లు కనుపించెను. కోపమువల్ల నెఱ్ఱబడినకనులనుండి వెలుతురు కిరణములు బయలుదేరి నాహృదయమును గుచ్చుచుండెను. భయవిహ్వలచిత్తుఁడనైన నాశక్తికొలఁది కెవ్వన కేకవేసి బైటకువచ్చి యిక్కడ స్మృతితప్పి పడిపోతిని. తిరిగి తెలివిరాఁగానే మీరు నాప్రక్కనిలిచియుండిరి. నేనెంతకాలము స్మృహతప్పి పడియుంటినో చెప్పలేను. ఓరాజకుమారా ! నాపిరికితనమువల్ల నేనిట్లు భయమునకులోనైతిని. క్షమించఁగోరెదను. అట్టి యస్వాభావికమైన దృశ్యమునకందఱు తమయొక్క గర్వము విడిచి దోసిలి యొగ్గవలసినదే !



# ౧౧వ ప్రకరణము.



రఘువీరునికథ యావత్తువిని యజీత్ సింగునకు మనస్సునందు చాల యాందోళనముకలిగెను. అతనికిఁగనుపించిన భయంకరదృశ్యము తలంచుకొనిన నొడలు వణఁకి చెమ్మ్చెను. అతఁడు మాటాడలేకపోయెను. ఎట్టకేలకు భయముతోఁగూడిన స్వరముతో "ఆహా! భయంకరము! అతిభయంకరము! అతిభయంకరము!" అనెను.

"రాజకుమారా! నేను పిరికిపందనుకాను. కాని రాత్రి చూచినదృశ్యమువల్ల నామనస్సుకలవరపడినదని తెలుపుటకు చాల సిగ్గగుచున్నది" అని రఘువీరుఁడు చెప్పెను.

అజీత్ సింగుతండ్రి జయపురముమహారాజు. అతఁడు తనకుమారుని మొగలుదర్బారునకుఁ బంపునప్పుడతనివెంట పరాక్రమశాలియగు రఘువీరునిపంపెను. అజీత్ కుఱ్ఱవాఁడగుటవల్ల మొగలుదర్బారులోజరుగు రహస్యాలోచనలు, కుట్రలు తెలియవు. గనుకనతనిసహాయార్థమై యతనితండ్రి రఘువీరునిపంపెను. రఘువీరుఁడు రాజకుమారునకుఁ దోఁడునీడవలెనుండి కష్టమువచ్చినప్పు డవసరమైనప్పుడతనికి సహాయముచేయుచు, సలహాకావలసివచ్చినప్పు డాలోచనజెప్పుచుండెను. అజీత్ తనమనస్సులోనున్న ప్రతిసంగతిని రఘువీరునితోఁ జెప్పుచుండెను. కాని యారాత్రి తానుజూచినదృశ్యము సంగతిమాత్ర మేకారణముచేతనో యతఁడు రఘువీరునికిఁజెప్పలేదు.

అప్పుడజీత్ సింగునకును రఘువీరునకును దిగువ సంభాషణ జరిగెను.

‘ శూరుఁడైన సర్దారుఁడా ! రాత్రిదృశ్యము లెట్లు కలిగియుం డును ? అవి దయ్యములచేష్టలా ? ’

‘ రాజకుమారా ! నాకదే సందేహముగనున్నది.’

‘ కానియెడల మనుష్యులవల్ల నిట్టిపనులు జరుగఁగలవా? ’

‘ ఎన్నటికిని జరుగనేరవు.’

‘ అయితే యింకొకరాత్రి యిక్కడనుండి యేమిజరుగునో చూతెము.’

‘ వలదు; వలదు. నాప్రియమైనరాజకుమారుఁడా ! నీక్షేమ మునకొఱకు నాక్షేమమునకొఱకు మనమిక్కడినుండి యింకొకచోటికి వెళ్లవలసినదే. ప్రాణముతో మనకుఁ జెలగాటలెందుకు ? మరల నట్టిదృశ్యము నాకుఁ గనుపించినఁ బిచ్చియెత్తుటయో లేక ప్రాణము పోవుటయో తటస్థించు.’

‘ నీయిష్టప్రకారము కానిమ్ము. కాని యిప్పుడు తెల్లవారినది గనుక మనమీమహలుతిరిగి యొకసారి వివరముగాఁ బరీక్షించవలెను’

రఘువీరుఁడులేచెను. అతఁడు చాల నీరసముగానుండుటవల్ల తిరుగలేక రాజకుమారునితో నిట్లనెను. “ నేను చాల బడలియున్నా ను. విశ్రాంతితీసికొనెదను. ఈలోగామీరు మహలుపరీక్షచేయుఁడు.”

తరువాత నజీత్ మేరియమ్‌బేగముమహలు లోపల వెలుపల పరీక్షించెను. లోపలికి మనుష్యులువచ్చుట కెట్టిరహస్యద్వారములు కనుపించలేదు. బయటనుండిచూడఁగా మేడపైభాగము త్రిభుజాకా రముగానుండెను. (Pyramid). అందొక రహస్యపుగది యుండునని సందేహముగలిగెను. కాని యట్టిగదియుండుటకుఁ దగిన యాధార మేమియులేదని యూహించి బయటనున్నతోట పరీక్షించెను. రహ

స్వనిరూపణకాధారమగు సాధనములెక్కడను గనుపించలేదు. చివర కేమియునుదోఁచక నాపనులు దయ్యములవలననే జరిగియుండునని నిశ్చయించుకొని యీపని కారము తనలోఁదాననుకొనెను.

‘ఇవి పిశాచములచేష్టలు కానియెడల మేము కలవరించితి మా? అది కలయెట్లుకాఁగలదు? త్రాళ్లుపెట్టి కట్టఁబడుట నాకు స్వానుభవముకదా! తిరిగి, కట్టినత్రాళ్లు విడిపోయినవి. మాయిద్దఱకు నొకసారిగ నట్టిదృశ్యములెందులకుఁ గనుపించవలెను? దయ్యములు నన్నెందులకు ఖూసీతోభయపెట్టవలెను? “ రేపు నీయొక్కవంతు ” అనికూడ యాపిశాచినియగు రాజకుమార్తె చెప్పినదే! ఆమాట లింకను జెవులలో వినఁబడుచున్నవి. అది కలయెప్పుడునుకాదు. గా రడీయునుగానేరదు. అదినిజమే.’

ఈపని కారమాలోచించుకొనుచు నజీత్ బయటకువచ్చెను. రఘువీరుఁడు గోడప్రక్కగూర్చుండియుండెను. అతనియెదుట మహా మ్మదుజానువచ్చి నిలిచియుండెను. అతఁడజీత్ నుచూచి యిట్లనెను. ‘మాయజమాని మీక్షేమము విచారించి మీయాజ్ఞప్రకారము నడుచుకొనుటకు నన్నుబంపినారు.’

‘మాకు క్షేమమే. మేమిప్పుడే సలాబత్తుసాహేబుగారి దర్శ నమునకు వచ్చెదము’ అని యజీత్ సింగుచెప్పెను. నౌకరు సలాము చేసి వెళ్లిపోయెను.

‘రాత్రిదృశ్యములు పిశాచములవల్లగాక మనుష్యులవల్లనే జరిగినయెడల నాసంగతి సలాబత్తునకును, నౌకరునకును దెలియక మానదు. ఇంకొకరాత్రి యిక్కడనేయుండి కనిపెట్టిన బాగుండును. కాని రాత్రిసంగతినిబట్టిచూడఁగా మన మేమరుపాటుగానున్నసమ యమందు విషముపెట్టి చంపుదురేమోయని భయమగుచున్నది.’

అని యజీత్తూహించి తనసర్దారుఁడగు రఘువీరుని కోరికప్రకారము బసమార్చుకొనుటకు నిశ్చయపరచుకొనెను.

తరువాతనతఁడు సలాబత్తునొద్దకు వెళ్లెను. సలాబత్తిదివఱకు వలెనె టిండుకానుకొని నిర్మలమైన ముఖవర్చస్సుతోఁ గూర్చుండియుండెను. అజీత్ నుజూచి యతనిని మర్యాదతోఁ గూర్చుండమని చెప్పెను. అతఁడుకూర్చుండి ముసలివాఁడుచేసిన సత్కారములకు మెచ్చుకొని యీప్రకారమనెను. ' నాసిపాయిలకు మేరియమ్‌బేగమ్‌మహాలులో నుండుటకుఁ గొంచెమిబ్బందిగానున్నది. ఇంకొకబస చూచుకొనెదను.'

' వేఱుబస నేనేర్పాటుచేసెదను ' అని సలాబత్తుచెప్పెను.

' మిమ్ములను గష్టపెట్టుట నాకిష్టములేదు. నేనే చూచుకొనెదను ' అని యజీత్ సింగు బదులుపలికెను.

ఆమాటవిని వాని ముఖవర్చస్సుమారెను. ఒడలు చెమటలు గ్రమ్మెను. కాని క్షణకాలములోఁ దిరిగి పూర్వపునిర్మలమైనట్టియు గంభీరమైనట్టియు వర్చస్సుఁదాల్చెను. అజీత్ సింగు ముసలివాని యొద్ద సెలవుతీసికొని తత్క్షణమే వెళ్లిపోయెను.

---

## ౧౨వ ప్రకరణము.

**అజీత్** తనకు మేరియమ్‌బేగముమహాలులో జరిగిన యనుభవము సలాబత్తునకుఁజెప్పక క్రొత్తబస చూచుకొనుటకు నిశ్చయించుకొనెను. ఆముసలివాని మాటలయందతనికి నమ్మకములేదు. జరి

గినసంఘటనల కేదోయొకకుట్ర మూలకారణమనియూహించి దా నిని తెలిసికొనవలెనని యజీత్ సింగు చాలప్రయత్నము చేసెను. కాని యావిషయమై సఫలమనోరథుఁడు కాలేకపోయెను. అది తెలిసికొ నునంతవఱకా గ్రామములోనేయుండుటకు స్థిరపరచుకొనెను. అక్బ రుచక్రవర్తియొక్క పురాతనరాజధానియైన యీగ్రామముచూచు ట కజీత్ నకిదియే మొదటిసారి కాఁబట్టి యదిస్పష్టముగాఁ బరీక్షించ సాగెను.

ఊరికి నుత్తరముగా చాలయందమైన యనేకభవనములవరు సగలదు. అందులో దివానీఆమ్, దివానీఖాస్ అను ముఖ్యభవనము లున్నవి. అక్బరుపాదుషా పగలంతయు నీభవనములలోఁ దన రాజ కార్యములు మున్నగునవి తీర్చుకొని పొద్దుగ్రుంకినతరువాత నాన మయమునకు తన మనస్సేరాణిమీఁదనుండునో యామహాలునకు సవారిమీఁదనెక్కి వెళ్లుచుండెడువాఁడు. అజీత్ సింగీ భవనములన్ని యుఁ బరీక్షించిచూచెను. చాలసంవత్సరములనుండి వాడుకలేక నిర్మా నుష్యముగానుండుటవల్ల మట్టితోనిండియుండెను. ఆపాడుపడినగ్రామ మందలి నిశ్శబ్దతపక్షులయొక్క కలకలమువల్లమాత్ర మప్పుడప్పుడు భూరుచుండెను. ఆగ్రామములో మనుష్యులెవరును లేకపోయినను మేరియమ్మహాలు మాత్రమెవరోయొకరు తగుజాగ్రత్తతో శుభ్ర ముగా నుంచుచున్నట్లు కనపడెను. అజీతొక్క క్రొత్తబసయేర్పర్చుకొని తన నౌకర్లను, సామాగ్రి యక్కడకుఁ దీసుకొనివెళ్లవలసినదిగా నాజ్ఞయిచ్చి, తాను గ్రామము పరీక్షించుటకువెళ్లెను. ఒక పాడు బడిన మేడ పైభాగమునకెక్కి గ్రామమంతయుఁ జూచెను. చుట్టు నడవులు, తోటఁలు కనుపించెను. దూరమున నొక చిన్నపల్లె కను పించెను. కాని యెక్కడను మనుష్యసంచారములేదు. తిరిగి బసకు

వచ్చుచుండఁగాఁ ద్రోవలో మసీదుమొల్లా కనపడెను. అజీత్ నకును మొల్లాకు నీదిగువసంభాషణ జరిగెను.

‘మీారీగ్రామము దయచేసినారనివిని చాలసంతోషించినాను’

‘ఈసంగతి మీాకెవరుచెప్పినారు ?’

‘ఉమ్రావుసాహేబుగారు చక్రవర్తిగారియొద్దనుండి వచ్చిన యుత్తరమాయన నౌకరుచేతికిచ్చి నాయొద్దకుఁ బంపినారు.’

‘మీారిక్కడ నొంటరిగానుండుటకు చాలకష్టముగాలేదా?’

‘దైవాజ్ఞమీారుట కెవరికిశక్యము.’

‘మీారు, నుమ్రావుసాహేబుగారుతప్ప నింకొకరీగ్రామములో లేరనితలఁచెదను’

‘లేరు. మేముగాక సలాబత్తునవుకరులైన మహమ్మదుజాను హమీాదాలుమాత్రమున్నారు.’

‘మీాముసలితనములో మీాకుపచారము చేయువారెవరు?’

‘రాజకుమారా! నేను ఫకీరును. నాకు నౌకరుతో నేమి యవసరము ?’

‘అయితే మీాకు వంటచేయువారెవరు ?’

‘నేనే చేసికొనెదను. నాకుశ్శక్తియున్నది. అప్పుడప్పుడు మహమ్మదుజాను జుట్టుపట్ల గ్రామములకువెళ్లి కావలసినసామగ్రిని తెచ్చి యిచ్చుచుండును. ఇదిగాక యాగ్రామనుండి చక్రవర్తిగారు నాకుఁ గావలసినసామగ్రి నెలకొకసారి పంపుచుందురు. నాకేమియు గొఱఁతలేక సుఖముగనున్నాను.’

‘నేను మిమ్ములనొకప్రశ్న యడుగవచ్చునా ?’

‘ రాజకుమారా ! అడుగవచ్చును. నీయాజ్ఞ శిరసావహించెదను.’

‘ పవిత్రమైన పురోహితుఁడా ! చాలకాలమునుండి మీరీ పాడుపడిన గ్రామములో నివసించుచున్నారుగదా ? పిశాచచర్యల యనుభవములుగాని, వానివిషయమైన సంగతులుగాని విని యున్నారా ? ’

‘ దయ్యములా ! ఎన్నఁడును వినియుండలేదు. మీరేమైన చూచితిరా? ’

‘ గడచినరాత్రి మేము మేరియమ్మహాలులో బసచేసినాము. అక్కడ బసచేయవలసినదిగా చక్రవర్తియాజ్ఞ.’

‘ అట్టియాజ్ఞ యెందులకు ? ’

‘ నాకుఁదెలియదు. చక్రవర్తిగారియిష్టము.’

‘ చక్రవర్తిగారు తమ నీపాడువడినగ్రామమున కెందుకంపినారు ? నేను, నుమాౖవుసాహేబుగారు ముసలివాండ్రము గనుకను, గోరికలేమియును లేవుగనుకను, నవసానకాలమునకెదురుచూచుచుండువారము గనుక నిక్కడనుండుట సహజము.’

‘ ఈవిషయమై నాకేమియును దెలియదు.’

‘ అయితే, దయ్యములవిషయమై మీయనుభవమేమి? ’

‘ అతిపౌరుషశాలియగు నాసర్దారునకు, రాత్రి పిశాచానుభవముగలిగినదని విన్నాను. బహుశః పిశాచములవిషయమై కలగని యుండును.’

‘ తప్పక నదికలయే. నేనిరువదిసంవత్సరములనుండి యిక్కడ నివసించుచున్నాను. కాని యెన్నఁడును దయ్యపుసంగతులు కని

వినియుండలేదు. ఈభయము నాధారముచేసికొని మీరిక్కడినుండి వెళ్లవలదు.'

'నేనింక నీవిషయములో నేమియు నిశ్చయించుకొనలేదు.'

ఈప్రకారముద్దలును మాటాడినతరువాత ఫకీరు తనకుఁ బ్రొద్దుపోవుచున్నదనియుఁ దిరిగి కలిసికొనెదననియుఁ జెప్పి రసపుత్రుని యొద్ద సెలవుతీసికొని వెళ్లిపోయెను. అతఁడు సలీముదర్గాయొద్దనున్న యతనియింటికివెళ్లుట రాజపుత్రుఁడు చూచెను. 'ఈఫకీరు చాలయమాయకుఁడు. మసలిసలాబత్తుయొక్కరహస్యాలోచనలేమియు నితనికిఁదెలియవు.' అని రాజపుత్రుఁడు తనలోఁదాననుకొనుచు మసీదుచూచుటకు వెళ్లెను.

ఆమసీదు కోట్లకొలఁదిధనము కర్చుపెట్టి కట్టఁబడెను. కాని యిప్పుడొక్కరుతప్ప నెవరు నామసీదులోనికి వచ్చుటలేదు. దాని ద్వారము సింహద్వారమని పిలువఁబడును. రాతితో చాలయెత్తుగాఁ గట్టఁబడెను. దానిపై నెక్కిచూచిన చుట్టుపట్ల యేబదిమైళ్లవఱకుగల గ్రామములు మున్నగునవి కనుపించును. అక్బరుచక్రవర్తి తనకీర్తి శాశ్వతముగా నిలిచియుండుటకు చాలడబ్బు వెచ్చించి యీమసీదు కట్టించెను.

అజీత్‌సింగామసీదు పరీక్షచేయుచుండఁగా, మృదుమధురమైన సంగీతము వానిచెవులఁబడెను. ఆసంగీతమేదో స్త్రీకంఠమువలె నతనికిఁదోచెను. నిదానించివినఁగా సంగీతములో నారితేరినవిద్వాంసులయొక్క సంగీతమువలెఁ దోచెను. ముసలివాఁడు, వానికుటుంబముగాక నింకకొంతమంది యీపాడుగ్రామములోనున్నట్లు రాజకుమారునికి బాగుగ నమ్మకముగలిగెను. అతఁడు తనలోఁదానిట్లు తర్కించుకొనెను "మసీదుమొల్లా నాతోనబద్ధముచెప్పెనా? ఉమ్రా

వుసాహేబు మోసగాఁడైనను గాటికిఁ గాళ్లుజాచుకొన్న పవిత్రుఁడైనమొల్లా యబద్ధమాడుటకుఁ గారణమేమి? అందువల్ల నీతని కేమిలాభముకలుగును?'

తరువాత సంగీత మెక్కడినుండివచ్చినది తెలిసికొనవలెనని చాల ప్రయత్నించెను. కాని తెలిసికొనలేకపోయెను. గేటుదాటి బయటకువచ్చి పరిశీలింపఁగా గేటుప్రక్క నొక పెద్దనుయ్యి కనుపించెను. ఆగ్రామములో మంచినీళ్లనూతులు మూఁడు మాత్రమే యుండెను. మంచినీళ్లసదుపాయము లేకపోవుటచేతనే యక్బరుచక్రవర్తి రాజధాని యాచోటనుండి మార్చుకొనుటకు ముఖ్యకారణము. నూతికిదగ్గఱగా సరుగుమీఁద నిద్దఱుమనుష్యులుండుట యజీత్ చూచెను. అందులోనొకఁడు యువకుఁడగు సన్యాసి. అతఁడు కాషాయవుదుస్తులు ధరించియుండెను. నల్లనిచుట్టలుచుట్టుకొనియుండు పొడుగుపాటి వెండ్రుకలాతనివీపుమీఁదనుండి మోకాళ్లవఱకు వ్రేలాడుచుండెను. అతని వయస్సిరువదియైదుసంవత్సరములు లోపుగాఁ గనుపించెను. అతనికిఁ గొలఁదిదూరములో నొకముసలివాఁడు వంటచేయుచుండెను. బహుశః యతఁడాసన్యాసియొక్క శిష్యుఁడై యుండవచ్చును.

---

## ౧౩వ ప్రకరణము.

రాజకుమారుఁడు వచ్చినతోడనే సన్యాసి సంగీతముపాడుట మానివేసెను. తాను వచ్చినందువల్ల నతనిసంగీతసాధనమునకు భంగముకలుగునేమోయని సందేహించుచుండఁగా సన్యాసి తిరిగియొక

మంచికీర్తనపాడెను. ఆకీర్తన మతసంబంధముగలదై భగవంతుని యపారకారుణ్యమహిమను స్తోత్రముచేయునదియై యుండెను. కిన్నర స్వరమువంటి యాసంగీతమువిని రాజకుమారుఁడు పరవశుఁడైపోయెను. మంత్రశక్తివలనఁ గట్టఁబడినవానివలె నిలిచియుండినచోటనే కదలక మెదలకనిలిచియుండెను. సన్యాసి కీర్తనపూర్తిచేసి 'ఇంకనజీత్ సింగు రాజకుమారుని శ్రమపెట్టను' అని యనెను. ఆమాటవిని యజీత్తాశ్చర్యముతో "నన్ను నీవెట్లెఱుఁగుదువు' అని యడిగెను. అంబరరాజకుమారుని నెఱుఁగనివారెవరు? అని సన్యాసి బదులు చెప్పెను. నేనుమిమ్ములనెన్నఁడును జూచియుండలేదే! అని యజీత్తనెను. 'చూచినను రాజులకు బీదవారియొక్క జ్ఞాపకముండదు. కాని మేము వారిని తప్పక జ్ఞాపకముంచుకొనెదము' అని సన్యాసి బదులుచెప్పెను. ఈమాటలువిని యజీత్ మనస్సు కొంచెము చిన్నపుచ్చుకొని 'నన్నుఁ బరిహాసముచేయవలదు. నేను మిమ్ములనెన్నఁడును జూచినట్లు జ్ఞాపకములేదు' అనెను. అందుమీఁద సన్యాసి 'నేను మిమ్ములఁజూడకపోయినను మీవంటి గొప్పవారినిగుర్తించుట యొక కష్టములోనిదికాదు. ఆగ్రానుండి పత్తేపూరుసిక్రివఱకునుండు ప్రతిమనుజుఁడు నజీత్ సింగుగారొకానొకరాజకార్యమువిషయమై యిక్కడికివచ్చినట్లు చెప్పుకొనుచున్నారు. ఇదిగాక నాకు జ్యోతిషముకూడ కొంచెము తెలియును' అనెను.

అటులైన మిమ్ము కొన్నిప్రశ్నలడిగి శ్రమపెట్టవచ్చునా? అని యజీత్తడిగెను. అంతట సన్యాసి శిష్యునితో 'భోజనముతయారగుటకు నింక నెంతకాలముపట్టును?' అని వంగభాషలోనడిగెను. శిష్యుఁడైన బెహారీచెరాను పోయి యూదుచు నింకను రెండుగంటలుపట్టునని చెప్పెను.అజీ త్తాశ్చర్యముతో 'మీరు వంగదేశీయులా'

అని యడిగెను. ‘ నాశిష్యుఁడు వంగదేశీయుఁడు. మావంటి దేశదిమ్మరుల కొకదేశము నొకయూరు లేదు ’ అని సన్యాసి బదులుచెప్పెను. ‘ తమరింత చిన్నవయస్సులోఁ బ్రపంచసౌఖ్యములను త్యజించి సన్యాసాశ్రమము స్వీకరించుటకుఁ గారణమేమి ? ’ అని యజీత్తడిగెను. ‘ నావయస్సెంతయని మీయూహ?’ అని సన్యాసి తిరిగి యడిగెను. ‘ ఇరువదియైదు సంవత్సరముల వయస్సని యనుకొనుచున్నాను’ అని యజీత్తనెను. సన్యాసినవ్వి మారుమాటపలుకక యూరకుండెను.

‘ మీవంటి సుందరవిగ్రహము నేనిదివఱకెన్నఁడును జూచియుండలేదు ’ అని యజీత్తనెను.

‘ నన్నుఁజూచి భ్రమింపకుఁడు. నేనాడుదానను కాను ’ అని సన్యాసి బదులుచెప్పెను. ఈమాటలకజీత్ సిగ్గుపడి తిరిగి జబాబుచెప్పక సన్యాసివంక తలయెత్తిచూచుటకు సాహసించక యూరకుండెను. కొంతసేపటికి సన్యాసి ‘ నాకు భోజనమునకు చాల యాలస్యమైనది. మీకిష్టమున్నయెడల మీరడిగెడుప్రశ్నలకు జబాబుచెప్పెదను ’ అని యనెను.

ఇంత కొద్దివయస్సులో నీసన్యాసి జ్యోతిశ్శాస్త్రమునందుఁ బరిపూర్ణుఁడెట్లాయెనోయని సందేహించుచు రాత్రి తనకుఁజరిగినసంగతి యెవరికిని తెలియదని యూహించి దానివిషయములో సన్యాసిని ప్రశ్నించి యోడించవలెనని నిశ్చయించుకొని యిట్లు ప్రశ్నింపసాగెను.

‘ ఈగ్రామము మీ రెందుకువచ్చినారు ? ’

‘ మేమొకచోట నివసించువారముకాము. దేశదిమ్మరులము. పుణ్యస్థలమైన బృందావనమునుండి వచ్చుచు దారిలో నిక్కడ మంచినీళ్లవసతిగలదనివిని భోజనము పూర్తిచేసికొనుటకాగితిమి.’

‘ ఎక్కడికి వెళ్లుచున్నారు ? ’

‘ ఒకచోటనే నియమములేదు. ఆసమయమున కెక్కడికివె ళ్లవలెననితోఁచిన నక్కడకు వెళ్లెదము.’

‘ ఇక్కడి కెంతకాలముక్రింద వచ్చినారు ? ’

‘ ఇంతకుముందే యాగ్రానుండివచ్చుచుఁ ద్రోవలోమీరిక్క డనున్నట్లు విన్నాను.’

‘ బైట నెండగానున్నది. లోపలికిదయచేయుఁడు.’

‘ అనవసరము. శీతోష్ణములు, సుఖదుఃఖములు, సులువుజలు వులు మాకు సమానములు. కాని మీరడుగుప్రశ్నలు త్వరలో నడుగుఁడు.’

‘ నాకు రాత్రి తటస్థించినకథ చెప్పవలయును.’ అని హీన స్వరముతో నజీత్తడిగెను. సన్యాసి యతని యరచేయిజూపుమని చేయిపట్టుకొనెను. సన్యాసియొక్కచేయి యతికోమలముగా నంద ముగానుండెను. దానినిచూచి యజీత్త్రిహస్త మాదువారికిగాని మగవారికుండదని తనలోఁ దాననుకొనసాగెను. ఇంతలో సన్యాసి యజీత్ సింగుచేయి విడిచిపెట్టి ‘ సరే. నేనువేసినలెక్క సరిగానేయు న్నది. సంగతి చెప్పుమనెదరా ? ’ అని యడిగెను. అజీత్ సింగు చె ప్పుమని మెల్లగాఁజెప్పెను. సన్యాసి కొంతసేపాలోచించినట్లు నటించి ‘ గతరాత్రి బేగముమహాలుయొక్క యొకదృశ్యము మీకుఁ జూపిం పఁబడినది ’ అనెను.

ఆమాటలువిని యజీత్ సింగాశ్చర్యముపొంది ‘ ఆహా! ఏమి! ఈసన్యాసికింత బాల్యవయస్సులో జ్యోతిశ్శాస్త్రమునందింత పాండి త్యమెట్లబ్బినది ? రాత్రివేళ నెవరునులోనికివచ్చుటకు వీలులేనిచోట

జరిగినసంగతి చెప్పుచున్నాఁడే ! వీఁడుకూడ కుతంత్రములోఁ జేరిన వాఁడు కాఁడుగద ! ప్రపంచసౌఖ్యములువదలి యాశ్రమములీసికొనిన యీసుకుమారుఁడు కుతంత్రములకు లోనగునా ? అట్లెన్నటికిని కానేరదు. ఇతఁడు తప్పక తన యధ్యాత్మికశక్తివల్లనే యంతయును గనుఁగొనఁజాలియుండును.' అనితలపోయుచు నజీత్ సింగు సన్యాసిని తేరిపారఁజూడసాగెను. సన్యాసి యది కనిపెట్టి 'జరిగినసంగతి నేను చెప్పినందులకు మీ రాశ్చర్యపడుచున్నట్లు కనఁబడుచున్నది. జ్యోతిశాస్త్రమునందు మీకు నమ్మకములేదా ? ' అని యడిగెను.

'నమ్మకములేకేమి. మీరు చెప్పినదంతయు నిజమే. కాని యింకనంతయు వివరముగాఁ జెప్పఁగోరుచున్నాను' అని యజీత్ సింగనెను.

'తప్పీలుచెప్పఁగలను. కాని చాలశ్రమయు సావకాశమును కావలెను. అంతయును సరియైనలెక్కవేసి చెప్పఁగలను. అయినను మీనమ్మకమునిమిత్తము క్లుప్తముగాఁ జెప్పెదను. చక్రవర్తిగారి బేగముమహాలులో జరుగు నొక ఖూనీ మీ యెదుటఁ బ్రదర్శింపఁబడినది. మొదట శృంగారదృశ్యముకూడ కనుపించినది. నేను చెప్పినదిసరిగా నున్నదా ?' అని సన్యాసి యడిగెను. 'సరిగానేయున్నది' అని యజీ త్తనెను.

'మీస్నేహితుఁడైన సర్దారున కొక దయ్యపురూపమనగాఁ జంపఁబడినవాని పిశాచరూపము కనబడెను. ఇది సరియేనా?' అని సన్యాసి యడిగెను. అజీత్ సన్యాసియొక్క యద్భుత విద్యకాశ్చర్యపడి 'అయితే రాత్రిజరిగిన దంతయు నిజమా లేక కలయా ? అని ప్రశ్నించెను. అందుకు సన్యాసి 'ఈసంగతి చాలకాలములెక్కవేసి చూచినఁగాని తేలదు. తత్క్షణము జబాబు చెప్పవీలులేదు. నా

వంట తయారైనది. భుజించిన తరువాత దర్శనమిచ్చిన వివరముగా లెక్కవేసి చెప్పెదను ' అనెను.

‘ దీనివల్ల నాకుఁ బ్రమాదమేమైనఁగలదా ? కలిగిన దానిని తప్పించుకొనుపాయమెద్ది ? ’ అని యజీత్ ప్రశ్నించెను. అందుకు సన్యాసిముఖము చిట్లించుకొని కోపము నాదుర్గాకలవానివలె యీ ప్రకారముచెప్పెను. ‘ మీరు నేచెప్పినప్రకారము నడువఁదలచుకొనిన చెప్పెదను. నాకుఁదెలిసినంతవఱకు నుపాయముగలదు. ఆయ పాయమునుండి తప్పించుకొనుటకుమార్గ మీగ్రామమునుండి త్వర లో వెళ్లిపోవుటయే. అయిన నేసంగతియు స్పష్టముగా భోజనానంతరము చెప్పెదను.’

‘ అయితే మీరుభోజనముచేసేవఱకు నిక్కడనేయుండెదను’ అని యజీత్ సింగనెను.

‘ మామతాచారము ప్రకారమితరులు చూచుచుండఁగ మే ముభుజింపము ’ అని సన్యాసి బదులుచెప్పెను.

అట్లైన మీభోజనానంతరము మీదర్శనముచేసెదను. మీరు ప్రొద్దుగ్రుంకినగాని తిరిగి ప్రయాణముచెయ్యరని యనుకొందును’ అని యజీత్ సింగనెను.

‘ ఎండలో కాళ్లుకాలుచు నెక్కడికివెళ్లెదము? ’ అని సన్యాసి బదులుచెప్పెను.

తరువాత సన్యాసి తనవెనుక వ్రేలాడుసంచిలోనుండి యొక దోసకాయతీసి యజీత్ సింగునకిచ్చి దానిని భుజింపుమనిచెప్పెను. అజీత్తది మహాప్రసాదమని తీసికొనెను. ఇద్దఱిచేతులు కలిసెను. సన్యాసిచేతినుండి యొక విద్యుత్ ప్రవాహము రసపుత్రునిశరీరమం

దుఁ బ్రవేశించి ప్రతినరమునకు నాళమునకు వ్యాపించెను. అతనిగుండె దడదడఁ గొట్టుకొనసాగెను. శరీరమందు గగురుపాటు గలిగెను. నాడీవేగమధికమయ్యెను. ఒకప్రతిమవలె నొకవికారమునకు లోనై యారాజకుమారుఁ డాసన్యాసిముఖమువంకఁ దేరిపారఁజూడసాగెను. కొంతవడికి తెలివితెచ్చుకొని పరిచయములేని క్రొత్తమనుజుని యాప్రకారము చూచుటయనుచిత మమర్యాదయని గ్రహించుకొని తలవంచుకొని మారుమాటాడక పలుకక వెళ్లిపోయెను.

---

## ౧౪ వ ప్రకరణము.

సన్యాసియొక్క స్థితిచూచి యజీత్ సింగున కనుమానముకలిగి కాపలాకాచి యామనుష్యుఁడెవఁడో గుర్తించవలెనని యుద్దేశించెనుగాని యప్పటి దేశకాలమర్యాదలప్రకారము ప్రపంచసౌఖ్యములనువిడిచి సన్యాసాశ్రమము స్వీకరించినసన్యాసిని నిర్బంధించుట మర్యాదకాదని వెళ్లిపోయెను. కాని వెళ్లుచు 'నతఁడేమిచేయునో' యని వెనుకకుఁజూచుచు వెళ్లెను. సన్యాసి భోజనము చేయఁబోవువానివలెఁ గాళ్లుచేతులు కడుగుకొనుటచూచి యింక ననుమానపడవలసినయవసరము లేదనుకొని తాను త్వరలోభుజించి సన్యాసి భుజించకపూర్వమేవచ్చి యతనిని కలిసికొనెదనని మనస్సు స్థిరపరచుకొని యజీత్ సింగు తనబసవైపువెళ్లెను. త్రోవలో నొక సందుమార్గమున వెళ్లుచుండఁగా, 'ఓరాజకుమారా! నీవు నీప్రాణసంరక్షణ చేసికొనవలెనను నుద్దేశమున్నయెడల జాగ్రత్తపడి తత్క్షణమే యీయూరునుండివెళ్లిపొమ్ము.' అను ధ్వనియొకటి వినఁబడెను. ఆధ్వని యొక్క

డినుండివచ్చినది తెలియలేదు. చుట్టునున్న యిండ్లన్నియు వెదకి నను మనుష్యులుకాని, మనుష్యసంచారమున్న జాడగాని కనుపించ లేదు. ప్రాణము బిగబట్టుకొని బిగ్గరగా 'ఎవరువారు ? నాతో మాట్లాడవలసియున్న యెడల నాయెదుటకువచ్చి మాటాడుము' అని కేకవేసెను. కాని యెవరును జవాబీయలేదు. తనస్వరమూపా డుపడిన యిండ్లవల్ల ప్రతిధ్వనించెను. అతనికి ననుమానము హెచ్చె ను. సన్యాసివిషయమై జ్ఞాపకమువచ్చి యనుమానము తీర్చుకొనుట కై యాస్థలమునకుఁ దిరిగివెళ్లెను. కాని సన్యాసిగాని యతనిశిష్యుఁ డుగాని యక్కడలేరు. ఆస్థలముపరిశీలించఁగా నొకపొయ్యిమీఁద కుండలో నీళ్లుకాగుచుండెను. ఇదియంతయుఁ దనను మోసపుచ్చుట కుఁ జేయుపనులని యతఁడు గ్రహించెను. రాత్రి జరిగినసంగతులు జ్ఞప్తికివచ్చెను. ఆలోచనామగ్నమానసుఁడై బసకువచ్చుసరికి భోజ నము సిద్ధమైనదని నౌకరుచెప్పెను. సిపాయిలందఱు తమ క్రొత్త బస బాగున్నదనియు నక్కడనే మిగిలినదినములు గడపినబాగుండు ననియుఁ జెప్పిరి. అందుకు నజీబ్ తనయంగీకారముకనబరచి భోజన మునొద్దకూర్చుండి యీప్రకారము తనలోఁదాననుకొనెను.

'ఈ మొగలాయిదర్బారునందు సౌఖ్యములకు నెట్టియవకాశ ములున్నవో ప్రాణాపాయమునకుఁగూడ నట్టిమార్గములేయున్నవి. జహాంగీరుయొక్కదర్బారు ప్రపంచమందుఁగల యనేకచిత్రములకు విలాసములకు, సౌఖ్యములకు నాస్పదమైయున్నది. ఇదిగాక ఖూనీ లకు రహస్యాలోచనలకు రాజద్రోహములకుఁగూడ నునికిపట్టనియే చెప్పవచ్చును. ఈకాలమందు భర్త భార్యకుఁ దండ్రి కుమారునకు, సోదరుఁడు సోదరునకు భయపడవలసియుండెను. ఎవరిసొత్తుగాని, యెవరిప్రాణముగాని,నిర్భయమని చెప్పవీలులేదు. చక్రవర్తికిఁగూడ

తనప్రాణమువిషయమై భయమే. ఇట్టిస్థితిలో నీఫత్తేపూరుసిక్రియం దు జరుగుసంగతులు, కనపడుదృశ్యములు తలఁచుకొనఁగా నావిషయమై యేదోయొక రహస్యాలోచన జరుగుచున్నట్లూహించెదను. చక్రవర్తి నన్ను భంగపెట్టవలెనని యిక్కడికిఁ బంపియుండునా? రసపుత్రులిప్పుడు పూర్వపుస్థితిలోలేరు. పూర్వము వారు మహమ్మదీయులవల్లఁ జాలగౌరవింపఁబడెడివారు. నా తాతగారగు రాజామాన్ సింగు సోదరిని యక్బరుచక్రవర్తి వివాహమాడెను. మాన్‌సింగు తనయొక్క ధైర్యసాహసములవల్లఁ జక్రవర్తికిఁ గుడిభుజముగానుండి గొప్పప్రఖ్యాతివహించెను. జహాంగీరు, ఖురుములు మొగలాయి చక్రవర్తులకు రసపుత్రస్త్రీలకుఁ బుట్టినపిల్లలే. కానియిప్పటిస్థితి మారినది. ప్రతాపసింగుపేరు చెప్పినంతమాత్రమున యక్బరువంటి చక్రవర్తికూడ గజగజలాడుచుండెను. ఇప్పుడతనిమనుమఁడైన కర్ణసింగు దర్బారులో చక్రవర్తి యాజ్ఞకులోఁబడి యతని కనుసన్నలకు విధేయుఁడై మెలఁగుచు నతనిబానిసగనుండెను. మాకుటుంబమింతవఱకు గౌరవముతోఁ జూడఁబడుచుండిన నిప్పటిచక్రవర్తులను నమ్మవీలులేదు. 'దినదినగండము నూరేండ్లాయుస్సు' యను సామెతప్రకారమున్నది. చావుబ్రతుకులు చక్రవర్తి కటాక్షములోనివై యున్నవి. చక్రవర్తియొక్క మనుగడయే భయోత్పాదములకు నాస్పదమైయుండఁగా నావంటివానిస్థితి వేఱుచెప్పవలయునా!' అని యేమేమోతలపోసి 'ఇంతకును నాతండ్రి రఘువీరుని నాసహాయము నిమిత్తము, సలహానిమిత్తము పంపియున్నాఁడుగదా! అతఁడు నాకుఁ దోఁడునీడమై యెప్పుడును గంటికిరెప్పవలెఁ గాపాడుచుండును. ఈసంగతులన్నియు నతనితోఁజెప్పి కర్తవ్యమాలోచించవలెను. అని నిశ్చయించుకొని, భోజనముపూర్తిచేసి రఘువీరుఁడున్నచోటికి

వెళ్లెను. అతఁడు భుజించి యేదోపుస్తకము చదువుచు పరుండియుండె ను. ఆకాలమందు రాజకుమారుఁడు వచ్చుటకాశ్చర్యపడి తాను లేచి రాజకుమారుని గౌరవముచేసి కూర్చుండబెట్టెను.

---

## ౧౮వ ప్రకరణము.

అజీత్ సింగు రఘువీరునితో నిట్లనెను. 'రఘువీరుఁడా! ఈ పాడుపడినగ్రామముయొక్క నాయనుభవమునుబట్టి చూడఁగా నిం దు కొంతమందిజను లెవరికిని దెలియకుండ దాగియున్నారనియు నా సంగతి యుమ్రావుసాహేబు, వానిమనుష్యులకుఁ దెలిసియుండెనని యు నాగట్టినమ్మకము. ఇదిగాక యిక్కడ మనయునికి సురక్షితము గాదు.'

'ఎందువల్ల ?' అని రఘువీరుఁడడిగెను.

'యావత్తును దప్సీలుగా చెప్పెదను.' అని యజీత్ సింగు గత రాత్రి తనకుఁగలిగిన ఘటనయావత్తు తప్సీలుగాఁజెప్పి, సన్యాసివిష యము నాఁడుదిపలికిన పలుకులనుగూడ చెప్పెను.

తరువాత వారిద్దఱకు నీదిగువసంభాషణ జరిగెను.

అ—మనమీఁద నేదోయొకకుట్ర రహస్యముగా జరుగుచు న్నదనియు నీభూతములవ్యవహారమాకుట్రలో నొకభాగమనియు ననుకొనుటకెంతమాత్రము సందేహము లేదు.

ర—రసపుత్రవీరుఁడెన్నఁడును భూతములకు భయపడఁడు'

అ—అవును. పౌరుషముగల పెద్దపులులతోనైన నెదురుపడి పోరాడవచ్చునుగాని విషముగలసర్పములు మనకుఁ దెలియకుండ నెప్పుడైన కాటువేయవచ్చును.

ర—చక్రవర్తిమనలనిక్కడికిఁబంపునపుడు దురుద్దేశముతోఁ బంపిరనియు సలాబత్తువగైరాలు చక్రవర్తికుట్రలోఁ జేరినవారనియు మీానమ్మకమా ?

అ—అవును. అదియట్లే.

ర—నేనదియెంతమాత్రము నమ్మను. నాకొద్దిపాటిబుద్ధితో నూహింపఁగాఁ జక్రవర్తికేదియో యొక గొప్పరహస్యమైనపని యున్నదనియునది నీవలగాని యింకొకరివల్లఁ గానేరదను నుద్దేశముతో నిక్కడికి మిమ్ములఁబంపినారని నానమ్మకము. మిమ్ములఁజంపించిన నాయనకేమిప్రయోజనము.

అ—అది నిజమేకావచ్చును. కాని జహంగీరు స్వతంత్రుఁడు కాఁడు. రాజకార్యముయావత్తు బేగము నూర్జహానుచేతిలో విడిచినాఁడు. ఆమె సర్వస్వతంత్రురాలు. ఆమెమాటకడ్డులేదు. ఈసంగతి లోకమంతయు నెరుగును.

ర—కాని నేను మనవిచేయునది యేమనఁగా నూర్జహాను చాల తెలివితేటలుగలది. మీా యంబరుకుటుంబముతో విరోధము గలిగించుకొని మొగల్ సామ్రాజ్యము నాశనముచేసికొనుటకెన్నఁడు నొప్పుకొనదు.

అ—ఏదియెట్లున్నను దీనివిషయమై సరిగానాలోచించి కర్తవ్యము నిర్ధారణచేయవలసియున్నది. మనముప్రయత్నించి యీారహస్యము బయలుపెట్టవలెను.

ర—రాత్రి కనుపించినదృశ్యములు పైశాచికసంబంధమైన వియే. మనుష్యులవల్ల జరిగిన, నప్పుడే బయలుపడియుండును. ప్రతి గది నందుగొంది నేను వెదకియున్నాను. ఎవరును బారిపోవుటకు కూడ నవకాశములేదు.

అ—ఒకరహస్యపుగది యెక్కడనో తప్పకయుండవలెను.

ర—మనము వివరముగా వెదకియుంటిమి. బేగముమహాలులోఁ బ్రతిదినముజరిగేసంగతి ప్రదర్శింపఁబడినది. అదృశ్యమే నిజమైన నాబేగమాస్త్రీలాశవ మొక్కరెప్పపాటులో నెట్లదృశ్యము కాఁగలవు.

అ—అయితే నేను కలువరించితిననియా నీయూహ?

ర—కాదు. అది కలగాదు. పైశాచికసంబంధమైనది.

అ—అటులయిన సన్యాసివిషయమై యేమనెదవు? ఈగ్రామమునుండి ; వెళ్లవలసినదిగాఁ జెప్పిన యాస్త్రీవిషయమై యేమి యాలోచించితివి?

ర—నేను వానికిఁదగినసమాధానము ప్రస్తుతముచెప్పలేను. కాని యొకవిషయమందుమాత్రము నాకు గాఢనమ్మకముగలదు. చక్రవర్తి మనల నొక రాజకీయవిషయమై యిక్కడకుఁ బంపియున్నారు. తిరిగి వారియుత్తరువులగువరకు మనకిక్కడనుండి వెళ్లిపోవుట మర్యాదకాదు. రసపుత్రుఁడు ప్రాణముపోయిన నాడినమాట తప్పడు.

అ—అది నిజమే. నేను భయమునకులోనై యీగ్రామమునుండి వెళ్లుటకుఁ దలంచలేదు. నాకు నిజస్థితి తెలిసికొనవలెనని కోరికగలదు.

ర—నీశౌర్యమువిషయమై రసపుత్రులందఱు నెఱుఁగుదురు.

వేలకొలఁది దయ్యములు నారక్తము పీల్చుచున్నను నాబొందిలోఁ బ్రాణముండునంతవఱకు నేనొక్కయడుగైనను గదలను.

అ—అయితే యీసందర్భములో నీసలహాయేమి ?

ర—నాగట్టినమ్మకమేమనఁగా చక్రవర్తి తనకు విరోధులు గానుండి తనపై కుట్రలుపన్నుచున్న కొందఱుజను లీగ్రామములో దాగియుండిరనివిని మీధైర్యసాహసములయందలి నమ్మకముచేత వారిని పట్టుకొనుటకై మిమ్ముల నిక్కడికిఁ బంపియుండును.

అ—అటులయిన సలాబత్తు కొందఱిని యీపాడుగ్రామము లో దాచియున్నాఁడని నీనమ్మకమా ?

ర—అవును, సరిగా వెదుకవలయును.

అ—ఆడవారుకూడ నాకుట్రలోనివారా ?

ర—నేను మీవల్ల విన్నసంగతులనుబట్టి యీప్రకారమే యూహించవలెను.

అ—సన్యాసికూడ యీగుంపులోనే చేరియుండును.

ర—నాకు గట్టినమ్మకమే.

అ—మనయిద్దఱకుఁ గనఁబడినదృశ్యములు పిశాచములవల్ల జరిగినవనిచెప్పునెడల సన్యాసివిషయ మెట్లుసమర్థించుకొనఁగలము.

ర—అంతయు గారడివలెనున్నది. ఏమిచెప్పుటకును వీలు లేదు.

ఆప్రకారము వారిద్దఱు మాటాడుకొనుచుండఁగా ఒక నౌకరువచ్చి యొకయాఁడుది వారికొఱకు బైట వేచియున్నదని చెప్పెను.

‘ ఆమెయెవరు ’ అని యజీత్తడిగెను.

‘ ఒకభిఖారిణివలె నున్నది. పిచ్చిదానివలె మాటాడుచున్నది ’ అని నౌకరు బదులుపలికెను.

‘ ఆమె కేమి కావలెను ?’ అని యజీత్తడిగెను.

‘ ఆసంగతి యామె చెప్పదు. అసందర్భముగా మాటాడుచున్నది. మిమ్ములనుఁ జూడవలెనని చెప్పుచున్నది. ఆమె చాలబీదరాలుగాఁ గనుపించుచున్నది’ అని నౌకరుచెప్పెను.

ఆమెను లోనికిఁ దీసికొనిరావలసినదిగా నజీత్తాజ్ఞయిచ్చెను. ఒక ముసలిస్త్రీ కఱ్ఱనూతగొని వణఁకుచులోనికివచ్చెను. ఆమెవస్త్రలు చినిఁగినవియై శరీరము సగముమాత్రమే కప్పఁబడియుండెను. ధూళిదూసరమైన యొక చింకిగుడ్డ కట్టుకొనియుండెను. తల విరియఁబోసికొనియుండెను. చప్పిదవడలు కండ్లుగుంటలు పట్టియుండెను. చూచినవారికి చాలబీదదానివలెఁ గనుపించును. ఆమె లోనికివచ్చి యతికష్టముతోఁ గూర్చుండెను. రఘువీరునివంకఁజూచి ‘ నీవుకావు’ అనెను. అజీత్ వంకచూచి ‘ నీవే ! నీవే !’ అని బిగ్గరగాననెను. ‘ నీకేమి కావలయును ? ’ అని యజీత్తడిగెను.

‘ నాకంబరదేశపు రాజకుమారుఁడు కావలెను ’ అని ముసలిస్త్రీ యడిగెను. ‘ నేనే యంబరురాజకుమారుఁడను ’ అని యజీత్ బదులుచెప్పెను.

‘ అజీత్ సింగు మీరేనా ? ’ అని ముసలిదియనెను.

‘ అవును ’ అని యజీత్తనెను.

‘ సరియే—నాచిన్న—కుమారుఁడు—యుద్ధములో చనిపోయెను. అయ్యో ! నాయందమైనబిడ్డా !’ అని ముసలిది యేడ్వసాగెను. అజీత్ దయార్ద్రహృదయుఁడు. అట్టిసమయమున నేమి మాటాడుటకు మనస్కరించక నొకవెండినాణెమిచ్చి పంపివేయవలెనను నుద్దేశముతో ‘ ఈడబ్బుతీసికొని వెళ్లుము. నీకుమారుఁడు యుద్ధములోఁజనిపోయిన స్వర్గసుఖ మనుభవింపఁగలఁడు ’ అనెను.

‘ స్వర్గమెక్కడనున్నది ?’ అని ముసలిది యడిగెను.

‘ ఆకాశమందున్నది ’ అని యజీత్త్రాకసము చూపించెను.

‘ తన్నక్కడకుఁ దీసికొనివెళ్ళవలసినదిగా ’ ముసలిదికోరెను.

‘ ఎవరు నక్కడకుఁ దీసికొనివెళ్ళలేరు. నాకుఁ బనియున్నది. ఇంకొకసారి కనఁపింపుము.’ అని యజీత్ చెప్పి వెండినాణెము నీయఁ బోయెను. ముసలిది యానాణెముఁ బుచ్చుకొనక ‘ అవినాకెందులకు ’ నాయొద్దనుండిన నెవరో సంగ్రహించెదరు ’ అనెను.

‘ అయితే నీకేమికావలెను ?’ అని యజీత్ కోపముతో నడిగెను.

‘ నేనీగ్రామములోనికి వచ్చుచుండఁగా నజీత్ సింగుగారిక్కడకు వచ్చినారని యెవరో చెప్పినారు. వారెవరో మరచిపోయితిని ? అని ముసలిది జబాబుచెప్పెను.

‘ తత్క్షణమే వెళ్ళిపొమ్ము ’ అని యజీత్ సింగు కసరుకొనెను.

‘ ఆయన యెవరో జ్ఞప్తికిరాలేదు—జ్ఞాపకము చేసికొనని మ్మి—అవును—ఒకసన్యాసి—సన్యాసియే చెప్పినాఁడు ’ అని ముసలిదియనెను.

---

# ౧౬ వ ప్రకరణము.

‘ సన్యాసి’ యనుమాట ముసలిదానినోటనుండి వచ్చినతోడనే యజీత్ సింగాదుర్దాతో ‘ సన్యాసి—నీతో నేమిచెప్పెను ’ అని యడిగెను. ముసలిది తనకట్టునూతచేసికొని వణఁకుచు ‘ నేను మరచిపోయితిని. రాజకుమారా! ఆసన్యాసి చాలమంచివాఁడు—అతఁ

డు నన్ను దీవించెను—నేను వెళ్లెదను' అనెను. ఇంతకుపూర్వము ముసలిదాని నక్కడనుండి తరిమివేయవలెననెడి యుద్దేశముతో నున్న యజీత్ సింగిప్పుడామెను వెళ్లనియ్యక 'దయచేసి కొంచెము సేపుండుము. సన్యాసిని నీవెక్కడచూచితివి?' అని యడిగెను.

'అక్కడ తోవలోఁజూచితిని' అని ముసలిదిచెప్పెను.

'అతఁడు నీతో నేమిచెప్పెను' అని అజీత్ సింగడిగెను.

'నాకు బాగుగ జ్ఞాపకములేదు—అవును—జ్ఞాపకము తెచ్చుకొనెదను' అని ముసలిదియనెను. 'జ్ఞాపకమున్నసంగతి చెప్పుము' అని యజీత్తడిగెను. 'అవును. అతఁడు నన్నుదీవించి నాకొడుకును బ్రతికించెదనని చెప్పెను. ఇంక జ్ఞాపకము లేదు—అంబరు రాజకుమారుఁడిప్పు డీగ్రామములో నున్నాఁడనియుఁ జెప్పెను—ఇంక బాగుగ జ్ఞాపకములేదు—' అనిముసలిదియనెను. రఘువీరుఁడు ముసలిదానిని కూర్చుండి శ్రమతీర్చుకొనుమని చెప్పెను.

'నేను కూర్చుండను. చాలదూరము వెళ్లవలసియున్నది—ఆ! జ్ఞాపకమువచ్చినది—రాజకుమారుని—తన ప్రాణముమీఁద నాశయున్నచో—తత్క్షణమే యీయూరునుండి వెళ్లవలసినదిగాఁ జెప్పుమని నాతో సన్యాసి చెప్పినాఁడు' అని ముసలిదియనెను.

అజీత్తాశ్చర్యముతో ముసలిదానివంక తేరిపారఁ జూడసాగెను. ముసలిది తాను వెళ్లవలసియున్నదనియు సన్యాసి తనకొడుకును బ్రతికించెదనని చెప్పినాఁడనియుఁజెప్పి వెళ్లఁబోయెను. అజీత్ సింగామెనడ్డగింపఁబోయెను కాని రఘువీరుని సంజ్ఞప్రకారమూరకుండెను. ముసలిది వెళ్లిపోయెను. అజీత్తిద్దఱుసిపాయిలనుపిలిచి ముసలిదాని వెంట వెళ్లవలసినదిగా నాజ్ఞాపించెను.

ఒకఁడాముసలిదానిబసకనుఁగొనిరావలసినదనియు, రెండవ వాఁడామెవెంటనే వెళ్లవలసినఁదనియుఁ జెప్పివంపెను.

'ఈవిషయమై నీయుద్దేశమేమి ?' అని యజీత్ రఘువీరుని యడిగెను.

'కారణమేదైనను మనమీగ్రామములో నుండుటకుఁ గొంచటికష్టమున్నట్లు కనఁబడదు' అని రఘువీరుఁడనెను.

ఇంతలో ముసలిదానితో వెళ్లినసిపాయిలు తిరిగివచ్చి ముసలిది యెక్కడను గనుపించలేదని చెప్పిరి. అజీత్ రఘువీరు లాశ్చర్యముతో బైట పహరాయున్నసిపాయిలను విచారించఁగా వారును ముసలిదానినెవతెను జూడలేదని చెప్పిరి. కడువిస్మయముఁబొంది వారు సిపాయిలకీప్రకార మాజ్ఞయిచ్చిరి. 'ముసలిది యిప్పుడే బైటకు వెళ్లినది. గాలిలోఁ గరగిపోలేదు. మీరందఱు తత్క్షణమే వెళ్లి యామెను వెదకిరండు.'

ఇంతలో నొక పల్లెటూరిపడుచు గంపతో నక్కడకువచ్చి 'మామీఁడా నన్నిక్కడికిపంపినది. మీరు కూరగాయలేమైన కొనెదరా' అని యడిగెను. 'అక్కఱలేదు. నీవొకముసలిదానిని త్రోవలోఁ జూచితివా ? అని యజీతడిగెను.

"ఆ! చూచితిని. వణఁకుచు నింతకుపూర్వమే యామె యీ త్రోవనే వెళ్లుచున్నది. ఆమె యీగ్రామముయొక్క 'వనవనిత'" అని పిల్ల జబాబుచెప్పెను.

అప్పుడజీత్ రఘువీరు లాపిల్లకనుపరచినవైపునకుఁ బరుగెత్తిరి. కూరగాయలపిల్ల నవ్వుచు రెండవవైపునకు వెళ్లిపోయెను. రాజపుత్రులాగ్రామముయొక్క సింహద్వారమునొద్దకు వచ్చునరి

కక్కడ తమసిపాయిలందఱు కూర్చుండియుండిరి. అప్పు డజీత్ సింగు కోపముతో ' నేను మిమ్ములను ముసలిదానిని వెతుకవలసినదిగా నాజ్ఞాపించియుండఁగా నాయాజ్ఞ నుల్లంఘించి మీరందఱు నిక్కడ నెందుకు కూర్చుండియుంటిరి ' అని యడిగెను.

' ముసలిది యిక్కడనున్నట్లువిని యిక్కడకు వచ్చినాము ' అని సిపాయిలనిరి.

' ఎవరు మీతో నాప్రకారము చెప్పినారు ?' అని యజీత్త డిగెను.

' కూరఁగాయలనమ్ముపిల్ల చెప్పినది' అని సిపాయిలు చెప్పిరి.

' ఆపిల్ల యేవైపునకు వెళ్లినది ?' అని యజీత్తడిగెను.

' సలాబత్తు పరిచారికయైన హామీదాకుఁ గూరలమ్మనిమిత్తము వెళ్లినది ' అని సిపాయిలుచెప్పిరి.

అజీత్ సింగునకు కోపమువచ్చి యాముసలిదానిని, పిల్లను వెదకి యెక్కడదొరికితే యక్కడపట్టుకొని తనయొద్దకుఁ దీసికొనిరావలసినదిగా సిపాయిలకాజ్ఞయిచ్చి తాను రఘువీరునితోఁగలిసి వారిని వెదకుటకువెళ్లెను. మసీదునొద్దకు వెళ్లుసరికొక మాలవి మసీదులోనుండి బైటకు వచ్చుచుండెను. మసీదుబైట నొకగుఱ్ఱము గుఱ్ఱపువాఁడునుండెను. ఆమాలవి గుఱ్ఱమునెక్కి తమవైపునకువచ్చి తా నాగ్రా వెళ్లుచున్నాననియు మసీదులో నమాజుచేసి పోవుచున్నాననియుఁజెప్పి వెళ్లిపోయెను. గుఱ్ఱపువాఁడు గుఱ్ఱపుసామానుతీసికొని గుఱ్ఱమువెంట వెళ్లెను.

ఆకాలములో నాప్రకారము ఫకీరులు, మాలవీలు ప్రతిగ్రామములలోనుండు మసీదులలో నమాజుచేసికొనుచు దేశదేశములు

తిరుగుట రివాజుగనుక నీదృశ్యమువల్ల నజీత్ రఘువీరులకాశ్చర్యము గలిగియుండలేదు. తరువాత కొంతదూరమువెళ్లునరికి సలాబత్తు నౌకరైన మహమ్మదుజానును వెంటబెట్టుకొని యొకసిపాయివచ్చెను. మహమ్మదుజాన్ యజీత్ సింగునకు సలాముచేసి ‘ ఆజ్ఞయేమి ’ అని యడిగెను.

‘ ఒక పల్లెటూరిపడుచు కూరగాయలమ్ముటకింతముందిక్క-డికి వచ్చినదా ? ’ అని యజీత్తడిగెను.

‘ ఈదినమున నెవరునురాలేదు ’ అని మహమ్మదుజాను జబాబుచెప్పెను.

‘ హమీదా యామెను మాయొద్దకుఁ బంపినట్లుగా నామె చెప్పినది ’ అని యజీత్తనెను.

‘ నేనెఱుఁగను. అట్టిపిల్లనెవరిని నేనెఱుఁగను ’ అని మహమ్మదుజాను బదులుచెప్పెను.

తరువాత యజీత్ సింగు ముసలిదానివిషయమై యడిగెను. మహమ్మదు జానాశ్చర్యముతో ‘ జంగిలీబా టనేపేరుగల ముసలిదానిని నేనెన్నఁడును జూడలేదు. ఈయూరిలో నీచుట్టుపట్లగ్రామములలో నట్టిది యెవరునులేరు ’ అని యనెను.

అజీత్ రఘువీరు లొకరిముఖమువైపు నొకరాశ్చర్యముతోఁ దేరిపారఁజూచుకొనసాగిరి. తరువాత నజీత్ సింగు మహమ్మదుజాను నిట్లడిగెను.

‘ ఈయూరినుండి బైటకువెళ్లుటకు సింహద్వారముతప్ప వేఱే యింకొకమార్గమున్నదా ? ’

'ఇంకొకటి యేదియునులేదు. ఈయూరు కోటవలె గోడలు గలిగియున్నది. ఎవరైన బయటకువెళ్లవలెనన్న సింహద్వారముగుండనే వెళ్లవలయును' అని మహమ్మదుజాన్ జవాబుచెప్పెను.

'అట్లైన నీవు వెళ్ళవచ్చును. నేనుచెప్పిన స్త్రీలు నీకుఁ గనబడినయెడల వారిని తప్పక నాయొద్దకుఁ బంపవలసినది' అని యజీత్ మహమ్మదుజానుతోఁ జెప్పెను. 'తప్పక పంపెదను. తమయుత్తరవు శిరసావహించెదను' అని మహమ్మదుజాను జవాబుచెప్పి వెళ్లిపోయెను.

అజీత్ రఘువీరుని 'ఈవిషయమై నీయుద్దేశమేమి' అని యడిగెను. రఘువీరుఁడు తనకేమియునుదోఁచక విచారముతోఁగూడిన హీనస్వరముతోఁ దనకేమియుఁ దోఁచుటలేదని ప్రత్యుత్తరమిచ్చెను.



# ౧౮ వ ప్రకరణము.

ఈకథయందువచ్చు ముఖ్యమైన కొన్నిపాత్రలవిషయమై తెలిసికొనుటకై యప్పటి చరిత్రసంబంధమైన కొంతగాథ తెలిసికొనుట యవసరము.

అక్బరు రసపుత్రులతో వైవాహికసంబంధమువల్లఁ దనరాజ్యము స్థిరముగా స్థాపించెను. రసపుత్రులు మొగలాయిసామ్రాజ్యమునకు సహాయభూతులై యుండిరి. అక్బరుపాదుషా జీవితకాలములో నుదయపురపు మహారాణాయైన ప్రతాపసింగుమాత్రము చక్ర

వర్తి యధికారమునకు లోఁబడక తనయొక్క నిరుపమానమైన ధైర్యసాహసములవలన స్వతంత్రముగాఁ దనరాజ్యము పరిపాలించుచుండెను. ప్రతాపుఁడు చనిపోయిన 8 సంవత్సరముల కక్బరు చనిపోయెను. ఈ 8 సంవత్సరములు ప్రతాపసింగుయొక్క కుమారుఁడగు నమార్ సింగుదయపురపురాణాగా నుండెను. అతఁడు తన తండ్రివలె శూరుఁడుకాఁడు. విషయలోలుఁడు. విలాసప్రియుఁడు. ఐన నక్బరు తనజీవితకాలములో నతనివిషయమై యేమియు సంబంధము గలుగఁజేసికొనలేదు. కాని శూరాగ్రేసరుఁడగు జహాంగీరుదయపురముమీఁదికి దండెత్తి యమార్ సింగు నోడించెను. అమార్ సింగు రాజ్యము తనకుమారుఁడైన కర్ణసింగునకువిడిచి తపోవనమునకు వెళ్లెను. మన చరిత్రసమయమునకు శూరుఁడును యుద్ధప్రవీణుఁడునగు కర్ణసింగే యుదయపురము మహారాణాగానుండెను. అక్బరుకాలమందు మాన్ సింగంబరు మహారాణాగానుండెను. అతనిచెల్లెలు జనహాబాయి యక్బరుభార్య. ఆమెకుమారుఁడే ఖుసురు. కాని యితఁడు జహాంగీరువల్ల ఖయిదీగాఁ బట్టుకొనఁబడి గ్వాలియరుకోటలోఁ బేరు ప్రతిష్ఠలులేక చనిపోయెను. అక్బరుచక్రవర్తి కాలమందు మాన్ సింగునకుఁగల పలుకుబడి ధైర్యసాహసము లందఱకిని తెలిసినవే. అతనికుమారుఁడు మనుమఁడు త్రాగుడువల్ల పిన్నవయస్సులోనే గతించిరి. జహాంగీరు జోధపురంపు రాజకుమార్తెయగు జాడ్ బాయిని వివాహమాడెను. ఆమెయాలోచనవల్ల జహాంగీరు మానసింగన్నకుమారుఁడగు జయసింగు నుదయపురము మహారాణాగా నేర్పాటుచేసెను. ఇతఁడు శూరాగ్రేసరుఁడు. ఇతనియొక్క దేశభక్తి పౌరుషసాహసములు నేటివఱకు రసపుత్రులందఱు వేయినోళ్లఁగొనియాడుచుందురు. ప్రస్తుతము ప్రసిద్ధికెక్కిన జయపురమను పట్టణమితఁడు

కట్టినదే. అజీత్ సింగు మానసింగుయొక్క మనుమఁడు. ఈచరిత్ర సమయమున మీవారు లేక ఉదయపురము, మారువారు లేక జోధపురము, అంబరు లేక జయపురము సామ్రాజ్యములు మొగలాయిలకు విధేయతగాను సహాయతగానుండెను. మేవారురాజగు కర్ణసింగుయొక్కయు నంబరురాజగు నజీత్ సింగుయొక్కయు మారువారు రాజగు గజసింగుయొక్కయు నతనికుమారుఁడగు ననిల్ సింగుయొక్కయు పేర్లు మనమీకథయందు వినుచుందుము.

జహాంగీరునకు ఖుసురు, పర్వేషు, ఖురుము, షారియరను నలుగురు కుమారులుగలరు. అందులో పర్వేషు ఖురుమనువారు పైఁజెప్పిన రసపుత్ర రాజకుమారుల యీడువారు. ఖురుము జహాంగీరునకు నంబరురాజుయొక్క బంధువగు కాచుయా దేశపు రాజకుమార్తెకునుఁ బుట్టినవాఁడు. గనుక నతఁడు జహాంగీరు తదనంతరము చక్రవర్తికావలెనని రసపుత్రులు కోరుచుండిరి. అంబరు మార్వారు సంస్థానాధిపతులు జహాంగీరునందు స్నేహముగలవారై యతని యిష్టప్రకారము నడుచుచుండిరి. కాని యుదయపురము మహారాణా యగు కర్ణసింగు సోదరుఁడైన భీమసింగాప్రకారము నడుచుకొనక ఖురుము రాకుమారునియందు గాఢప్రేమ గలిగియుండెను. జహాంగీరు జీవితకాలమందే ఖురుము రాకొమరుని సింహాసనాధిష్టునిగాఁ జేయవలెనని యనేక రహస్యాలోచనలు జరుగుచుండుట జహాంగీరు కనిపెట్టెను. మహాబత్తుఖాన్ (అంబరుదేశ రాజకుమారుఁడు) మహమ్మదీయమతము స్వీకరించి పేరు మార్చుకొనెను. ఇతఁడు యుద్ధకౌశలమునందును, ధైర్యసాహసములయందును జాల ప్రసిద్ధికెక్కెను. ఇతనిని భీమసింగు లోబర్చుకొనెను. జహాంగీరు రాజకీయతంత్రజ్ఞుఁడు గనుక భీమసింగును గుజరాతుదేశపు గవర్నరుగా నియమించెను.

కాని యాపదవి యతఁడు స్వీకరించలేదు. మహాబత్తుఖాన్ ప్రతాపసింగు సోదరుఁడగు శక్తసింగు కుమారుఁడు. ప్రతాపుఁడు తన దేశస్వాతంత్ర్యమునిమిత్తము కొండలుగుహాలు తిరుగుచుండఁగా నక్బరు శక్తసింగును చిత్తూరుగద్దెమీఁద నధిష్ఠింపఁజేసి మీవాహరాణాయని ప్రచురపరచెను. కాని యాదేశప్రజలు వానినియంగీకరింపక ప్రతాపునియందలి గౌరవమువల్ల సత్ సింగును దేశద్రోహిగా నిరసించుచుండిరి. ఇందుకు శక్తసింగు సిగ్గుపడి ప్రతాపసింగును క్షమాపణకోరి తానుచేసిన యపరాధమునకుఁ బ్రతిఫలముగా చక్రవర్తి యెదుట తాను పొడుచుకొనిచచ్చెను. మహాబత్తుఖాను భీమసింగులు ఖురుమురాకుమారుని ఢిల్లీసింహాసనముమీఁదఁ గూర్చుండబెట్టవలెనని చాల ప్రయత్నములుచేసిరి ఒకసారి జహాంగీరుని మహాబత్తుఖాను ఖయిదీగా పట్టుకొనెను. కాని యతఁడు తనభార్య నూర్జహాను వల్ల విడిపింపఁబడెను. ఈచరిత్రకాలమందు జహాంగీరు తనభార్యకు వశుఁడై స్త్రీలోలత త్రాగుడు మొదలగు కేళీవిలాసములతో సుఖమనుభవించుచు రాజతంత్రముయావత్తు తనభార్యయగు నూర్జహానుచేతిలో విడిచిపెట్టెను. నూర్జహాను చాల తెలివితేటలుగలిగి తానే నిరంకుశప్రభుత్వము చేయుచుండెను. ఆమెయుత్తర్వుల కెంతమాత్ర మాతంకములేదు. ఆదినములలో నామెరూపము చిత్రింపఁబడిన బంగారుమొహరు చాల విలువగలదిగానుండెను.

జహాంగీరుజనానా పూర్వరాజులజనానాలను బోలియుండెను. అందులో ననేకదేశముల సుందరీమణులుండిరి. వారిలో ముగ్గురు ముఖ్యులు నూర్జహానునామె మొదటిది. ఆమె సౌందర్యవిలాసములకు నిధియై యందఱిలోఁ బ్రముఖ్యత వహించియుండెను. రెండవది బికనీరుమహారాజ కుమార్తెయగు జాడ్ బాయి. ఆమెతరువాత నంబరుదేశ రాజకుమార్తె ప్రఖ్యాతివహించియుండెను.

నూర్జహానుకుఁ గుమారులులేరు. కానియామె పర్వేషురాకొ మారుని ప్రేమించుచు జహాంగీరనంతర మతనిని చక్రవర్తిచేయు నుద్దేశముతోనుండెను. ఖురుమురాకొమరుఁడు రసపుత్రస్త్రీకి పుట్టినవాఁడుగనుక నతనియెడ నామెకంతగా నిష్టములేదు. రాణీలుగానున్న రసపుత్రస్త్రీలయెడ నామెకనిష్టమే. కాని యాయనిష్టత పైకి గనుపరచిన తన సామ్రాజ్యమునకుఁ బ్రాపగు రసపుత్రవీరులతో విరోధముగలుగుననియు నాకారణమువల్ల సామ్రాజ్యమునకు నష్టముగలుగుననియు నూహించి యామె రసపుత్రస్త్రీలయందభిమానమున్నట్టు కనబడుచుండెడిది. కాని సమయమువచ్చినప్పుడు వారిని సంహారముచేయుటకు వేచియుండెను. మన చరిత్రసమయమున నూర్జహాను నెదుటనే ఖురుమురాకొమరుని చక్రవర్తి చేయవలెననే కుతంత్రము జరుగుచుండెను. ఈనవలయందా మంత్రాంగమేవిధముగా జరుపఁబడెనో తెలుపఁబడెను. ఇదిగాక విచిత్రములకు విలాసభోగములకు నునికిపట్టగు బేగముమహాలుయొక్క రహస్యచరిత్రము కూడ తెలుపఁబడును.

ఈకథాసమయమందు దేశమండలిజనులాశ్చర్యముతో మూఁడు సంఘటనలవిషయమై చెప్పుకొనుచుండిరని యిదివరలోఁ జెప్పియున్నాము. ఖుసురు జహాంగీరువల్ల గ్వాలియరుకోటలో ఖైదీగా నుంచఁబడెను. అతఁడు సుమారు 50 సంవత్సరములక్కడనుండి యక్కడనే మృతినొందెను. కాని దాని నిజస్థితి జనులకు సరిగా తెలియదు. ఈకథాసమయమున నతఁడు గ్వాలియరుకోటనుండి తప్పించుకొని గొప్పసేనతో నాగ్రాపై దండెత్తనున్నాఁడని జనులు చెప్పుకొనసాగిరి. ఈయాందోళనము దేశముఁతటను బ్రబలసాగెను. దీనికిఁ గారణమెట్టిదో యెవరీయపవాదు ప్రబలచేసిరో యెవరికిని తెలియదు.

ఇదిగాక జహంగీరును జంపుటకొకకుట్ర జరుగుచుండెను. ఈసంగతి నూర్జహాను కనిపెట్టెను. నూర్జహాను సామాన్యస్త్రీ కాదు. ఆమెసౌందర్యరాశియనియే చెప్పవచ్చును. ఆమె రాణులలోరాణి. అట్టి స్త్రీతిలకమంతకుపూర్వముగాని, యాసమయమందుగాని, తరువాతగాని, స్త్రీజాతియం దుదయించియుండ లేదు. ఆమె తెలివి తేటలు నిరుపమానములు. శిరోహృదయసంబంధమైన గుణములన్నిటియందు నామె నిపుణతగలిగియుండును. ఆమె బ్రహ్మదేవునియొక్క నిరుపమానమైన సృష్టియనియే చెప్పవచ్చును. ఆమెరాజ్యమునందుజరుగు ప్రతి రహస్యాలోచన, ప్రతికుట్ర, ప్రతితంత్రము తన వేగులవారివల్లఁ దెలిసికొనుచుండెను. ఆమె చాల నీతిజ్ఞయగుటవలన మార్వారు రాజకుమారుఁడగు నసిల్ సింగును, అంబరురాజకుమారుఁడగు యజీత్ సింగును తన స్వాధీనమందుంచుకొని తన శక్తికొలఁది వారికి నుత్తమపదవులు బహుమతులు నిచ్చుచుండెను. చక్రవర్తిని జంపవలెననుకుట్ర జనసామాన్యమునకుఁ దెలియదు. కాని ఢిల్లీలోజరుగు నద్భుతహత్యలనఁగా ఢిల్లీ గేటుకడ ప్రతివారము ఖూనీకాఁబడిన శవములప్రదర్శనము జనులమనములు కలవరపెట్టసాగెను. పత్తేపూరుసిక్రియందుజరిగిన భూతలీల యజీత్ రఘువీరులెవరికిని చెప్పియుండలేదు. ఐన నాసంగతి యావత్తు తప్సీలుగా నాగ్రా, ఢిల్లీ పట్టణనివాసులు తెలిసికొని భయపడసాగిరి. వారిభయమువల్ల రాత్రులునిద్రలేక నవస్థపడుచుండిరి.



# ౧౮ వ ప్రకరణము.

అక్బరుచక్రవర్తి యాగ్రాలో యమునానదియొడ్డున నొక కోటకట్టెను. ఆకోట యిటుకతోఁగాక యెఱ్ఱరాతితోఁ గట్టఁబడెను. ఆకోటయొక్క యందము నేటివఱకు ననేకమందియాత్రికుల నాకర్షించుచున్నది. ఇదిగాక నెట్టి చతురతగలశిల్పులవల్లఁ గట్టఁబడెనో గాని కొంచెమైనను శిథిలముగాక మానవలోకమున కాశ్చర్యము గలిగించుచున్నది.

ఈకోటచుట్టు లోతగునీటితో నిండియుండు కందకముగల దు. ఆకోటలోపలకు వెళ్లుటకు బైటకువచ్చుటకు సింహద్వారము తప్ప వేరుమార్గములేదు. ఆద్వారమునొద్ద సిపాయిలు పిచ్చుకత్తులతో రాత్రింబవలు పహరాయిచ్చుచుఁ గోటలోనికి వచ్చువారిని బయటకు వెళ్లువారిని జరీక్షించుచుందురు. అగడ్తచుట్టు సిపాయిలు నివసించుట కనేకభవనములుకలవు. కోటలోఁ దెల్లచలువరాతితోఁ గట్టఁబడిన మోతీమసీదు నేటివఱకుఁ బ్రకాశించుచున్నది. దానికి దగ్గఱగనే చక్రవర్తినివసించు మేడగలదు. ఆకోటలోనుండు భవనములన్నియు నందముగాఁ గట్టఁబడియుండెను. దివానీఆమ్, దివానీ ఖాస్, బేగమ్‌మహల్ అందులో ముఖ్యమైనభవనములు. బేగముమహాలుయొక్క యందముకొనియాడ వేయినోళ్లు కావలయును. అది మొగలాయిచక్రవర్తులయొక్క కేళీవిలాసభవనము. అది తెల్లచలువరాతితోఁ గట్టఁబడి పైభాగమంతయు బంగారుపూత పూయఁబడి చూపరులకన్నులు మిరుమిట్లుగొల్పుచుండెను. దీనియందనేకములగు గదులున్నవి. అందులో ప్రతిబేగమునకు వేఱువేఱియిండ్లుగలవు. ఈమహాలుకట్టిన శిల్పియొక్కచతురత యెంతనివర్ణింపఁగలము! యీ

మహా లెత్తుస్థలమందుండుటవలన నందుండుజనులకు యమువానది యు, దానిచుట్టు దూరముననుండు కొండలవరుసలు నానందముగలి గించుచుండును. ప్రతిగదియందు రహస్యద్వారములు, రహస్యప రలుగలవు. ప్రతిగదియందు నమూల్యమైన కొయ్యసామానులు, గాజుసామానులు, రత్నకంబళ్లు, చిత్రములుగలవు. భూమి యడుగు భాగమందుకూడ వివిధ సౌఖ్యోపకరణములతో నలంకరింపఁబడిన యనేకములగు గదులుగలవు. బేగములు వేసవికాలమందుఁ బగటి పూట పైగదులలో నెండగాలికిఁ దాళఁజాలక నేలక్రిందిగదులయం దుందురు. ఆచీఁకటిగదులలో నెన్ని ఘోరకృత్యములెన్ని ఖూనీలుజరిగి యుండెనో చెప్పశక్యముకాదు. ఆమహాలుయొక్క గదులకట్టఁబడి చాలచిక్కగాను, దోవలు జిగిబిగిగానుండును. ఒక నూతనవ్యక్తి యామహాలులోనికిఁ జొరఁబడిన తిరిగి బయటకువచ్చుట చాలదుర్ఘ టము. చక్రవర్తి, యతనికుమారులుతప్ప నితరపురుషు లామహాలు లోఁ బ్రవేశించుటకు త్రర్వులేదు. ధృఢకాయమతిభయంకరరూపము గలిగిన యనేకమంది ఖొజ్జాలెల్లప్పుడు ప్రతిద్వారమునొద్ద కావలా కాయుచుందురు. ఇంతేగాక బందీలుయనఁగా నాడనవుకర్లు వాడిగల చిన్నకత్తులతో సదా తిరుగుచుందురు. ఇట్టి మహాలుయొక్క మధ్య భాగమందొక పెద్దసావడి (Hall) కలదు. అది పెద్దిరాణియగు నూర్జహానుపయోగించునది. ఆసావడియొక్క సౌందర్యము వర్ణనా తీతము. నేలమీఁద పరిషియాదేశపమూల్యమైన రత్నకంబళములు పరువఁబడియుండెను. గోడలన్నియుఁ జిత్తరువులతో నలంకరింపఁబ డెను. హాలంతయు విలువగల బంగారు వెండి సామానులతో నిండి యుండెను. దాని పైభాగమున పరిమళముగల పుష్పములతోఁగట్టఁ బడిన యనేకదండలు వ్రేలాడుచుండెను. అందు సువాసనగలచము

రుతోఁ దయారుచేయఁబడిన యైదు వేలకొవ్వొత్తులు పలురంగుల గాజుబుడ్లలో వెలుఁగుచుండెను. గదియంతయు పువ్వులయొక్కయు నత్తరవులయొక్కయుఁ, బన్నీరులయొక్కయు, మఱియు ననేకమైన సుగంధవస్తువులయొక్కయు సువాసనతో నిండియుండెను. ఈమహలుకొకప్రక్కను జిత్రశాలయొకటిగలదు. అందు వివిధ దేశపు గొప్ప గొప్ప రాజులయొక్కయుఁ, బండితులయొక్కయు దేవతలయొక్కయు, మునులయొక్కయు, సేనాధిపతులయొక్కయుఁ జిత్రములు, స్వాభావిక నైసర్గిక చిత్రము లలంకరింపఁబడెను. ఈచిత్రశాలకావల నొకవిశాలమైన ఖాళీస్థలముగలదు. దానియందనేక పుష్పఫలజాతులతోఁగూడిన యుద్యానవనముగలదు. ఈయుద్యానవనము మధ్య నక్కడక్కడ విశ్రమించుటకుఁ బుష్పలతలతో నారామములు కట్టఁబడియుండెను.

ఒకానొకదినమున నీయుద్యానవనమందు నూర్జహానొక ముఖమలుకుర్చీపైఁగూర్చుండి యేదియో రాజకీయవిషయమై యాలోచించుచుండెను. ఆమెయెదుట యమునానది తరంగముల బిందులు కనుపించుచుండెను. దగ్గర పరిమళముగల యనేకరకముల గులాబీమున్నగు పుష్పములతో నిండియుండొక బంగారుపాత్రయుండెను. ఆమెచుట్టు గొట్టములు పన్నీరును గుత్తులవలె వెదజల్లుచుండెను. పరిమళించు పుష్పములనుండివచ్చు కమ్మని మందమారుత మామెఘ్రాణేంద్రియములకు విందుగొల్పుచుండెను. ఆమెకూర్చుండినకుర్చీ పైభాగమందనేకజాతుల పిట్టలయొక్క పంజరములు వ్రేలాడుచుండెను. ఆపక్షిసంతానముయొక్క మృదుమధురస్వరములు చెవులకుఁ బండుగచేయుచుండెను. జహాంగీరు రాజ్యభారమంతయు నూర్జహానుపై విడిచి తాను కేళీవిలాసములలోను సౌఖ్యపరంపరలలోను మునిగిఁ

యున్నాఁడని యిదివరకే చెప్పియుంటిమి. ఆమె యాసమయమందు హిందూదేశపు కోట్లకొలఁదిప్రజల బాగునోగులకు సంబంధించిన యేదియోయొక యోచన చేయుచుండెను. ఏకాంతమందామె యా ప్రకార మాలోచనానిమగ్నయైయుండఁగా నితరులెవరు నామెయొద్దకు వచ్చుటకనుజ్ఞలేదు. చక్రవర్తియైనను రావీలులేదు. ఎవరైన నట్టిసమయమందా రాణీలలో రాణియైన యానిరుపమాన సౌందర్యరాశియగు నూర్జహానును జూచినయెడల నామె గ్రీసుదేశపు 'హెలెను' కన్యయో, హిందూదేశపు 'దమయంతి' యో యీజిప్టుదేశపు 'క్లియపాట్రి' యో లేక 'దేవపద్మిని' యో యని యనుమానింపకపోరు. ఆమె వయస్సిరువదియాఱు సంవత్సరములు. ప్రపంచసౌఖ్యములన్నియుఁ దనివితీర ననుభవింపగోరునట్టి వయస్సిది యేకదా! సౌందర్యముతోపాటామె తెలివితేటలు నిరుపమానములు. స్త్రీయైన నామె బుద్ధికుశలతచేత హిందూదేశమంతయు నిరంకుశముగాఁ బాలించుచుండెను. గొప్ప గొప్పసర్దారులు, మంత్రులు, రాజులు, మహారాజు లుమ్రావు లామెకటాక్షమునకుఁ బాత్రులైయుండిరి. ఆమె యాలోచనాభవనము నందుండునపుడామెయొద్దకు వెళ్లుటకుఁ జక్రవర్తికికూడ యనుజ్ఞలేదని పైనఁ జెప్పియున్నాము. కాని యామెపరిచారిక లేక స్నేహితురాలని పిలువఁబడు 'జులేఖా' యను స్త్రీకిమాత్రము సర్వస్వతంత్రముగలదు. నూర్జహానెక్కడ నున్నను, నెట్టిస్థితిలోనున్నను, రాత్రియైనను, బగలైనను వెయ్యేల, యామె తనభర్తయగు చక్రవర్తిదగ్గరనున్నను జులేఖా వెళ్లుటకు స్వతంత్రముగలదు. ఆమె బందీయైనను స్నేహితురాలివలె నాలోచనచెప్పుదానివలెను మెలఁగుచుండెను. ఆమెయు నిరుపమానసౌందర్యముదీక్ష్ణమైన తెలివితేటలు గలిగియుండెను. అప్పుడప్పుడు

నూర్జహాను రాజకీయవ్యవహారములందుఁగూడ నీమెసలహా తీసుకొనుచుండును. ఎన్నఁడైన రాణిగారియుత్తర్వులకు మార్పుగలిగిన యట్టిమార్పు జులేఖాబందీయొక్క సలహావల్లనే గలిగెనని జనులుచెప్పుకొనుచుండిరి. ఈకారణములవల్ల యావన్మంది యామెను గౌరవములో భయముతోఁ జూచుచుండిరి. నూర్జహాను జులేఖాలు సమానవయస్కులు. జులేఖాయొక్క పూర్వవృత్తాంతము మరుగుపడియుండెను. అది జులేఖాకుకూడ జ్ఞాపకమున్నట్లామె పైకిఁగనుపించదు. నూర్జహానుయొక్క పూర్వపుపేరు 'మెహారుడున్నీసా.' ఆమె పరిషియాదేశమందు సామాన్యకుటుంబమునందలి కన్య. ఆమెయొక్క నిరుపమానసౌందర్యముచూచి జహాంగీరామెను చిన్నతనమందే మోహించెను. అక్బరుచక్రవర్తి యీసంగతికనిపెట్టి తనకుమారుఁడీబీద కన్యను బెండ్లియాడి రాణినిచేయుననుభీతిచేత నామెనుదర్బారునందుఁ బౌరుషమున ప్రసిద్ధికెక్కిన షర్ అఫ్గన్ అనునతనికిఁ బెండ్లిచేసి వారిద్దఱిని వంగదేశమునకుఁ బంపివేసెను. షర్ అఫ్గను చక్రవర్తికిఁ దనయందభిమానముగలదను గర్వముచేత బరద్వానుప్రజలను పీడించుచు వారిని మహమ్మదీయమతము స్వీకరింపుమని బలవంతపరచుచుండెను. ఆదేశమందు బాగుగ పలుకుబడిగలిగినట్టియు శూరుఁడైనట్టియు నరహరిరాయఁడను నొక బ్రాహ్మణజమీందారుడుండెను. మన చరిత్రసమయమున నతఁడు ముసలివాఁడగుటవలన నతనికుమారుఁడగు భీమల్‌రాయి తన జమీన్యవహారములు చక్కబెట్టుకొనుచుండెను. భీమల్‌రాయి, యతనిభార్య, కుమార్తె, తండ్రి తప్ప యీకుటుంబమునం దితరులెవరునులేరు. క్రూరుఁడగు షర్ అఫ్గనొకప్పుడీజమీందారుమీఁద దాడివెడలెను. నరసింహరాయలు వృద్ధుఁడగుటవలన శక్తిగొలఁదిపోరి లొంగిపోయెను. షర్ అఫ్గన్ భీమల్

రాయిని యుద్ధములోఁజంపి వానికుటుంబమువారిని మహామ్మదీయ మతము స్వీకరించునట్లు నిర్బంధించెను. ముసలివాఁడగు నరహరిరాయలు తన ప్రజలవలన బహిష్కరింపఁబడి తన మనుమరాలగు 'లలిత' తో విదేశగతుఁడయ్యెను. అతఁడెక్కడకు వెళ్లినది యేమైనది యెవరికిని దెలియదు. కొందఱతఁడవమానము భరింపఁజాలక గంగానదిలోఁబడి మృతినొందెనని చెప్పుకొనసాగిరి. షర్ ఆఫ్గన్ భీమల్ రాయి భార్యయగు సర్బసుందరిని బందీగాఁ దనయింటికిఁదెచ్చి తనభార్యయగు మెహరుఉన్నీసాయొద్ద దాసిగానుంచెను. ఆసర్బసుందరియే మహామ్మదీయమతము స్వీకరించినతరువాత 'జులేఖా' యని పిలువఁబడెను. జహాంగీరు చక్రవర్తియైనతరువాత మెహరుఉన్నీసాను బెండ్లియాడెను. అమెయే నూర్జహానయ్యెను. జులేఖాకూడ చెలికత్తెవలె నూర్జహానునొద్దనే యుండెను. నూర్జహాను ప్రథమమునుండి జులేఖాయందెక్కువ ప్రేమగలిగియుండెను. ఆమెయొక్క నిరుపమాన బుద్ధికుశలత, నూర్జహాను కొలఁదిదినములలోనే గ్రహించి యామెయందు లక్ష్యభావము గలిగియుండెను. జులేఖా తన పూర్వ వృత్తాంతము తనకు జ్ఞాపకమున్నట్లెన్నఁడు కనుపించలేదు. ఆమె తనభర్త గతించినందుకుఁగాని తనమామ, కుమార్తెలజాడ తెలియనందుకుఁగాని విచారపడియుండలేదు. సర్బసుందరి యనునామె పూర్వమే గతించినది. ఈజీవితము జులేఖాదియని తలపోయుచు నామె నిశ్చలమనస్సుతోఁ గాలము గడుపుచుండెను.



# ౧౯ వ ప్రకరణము.



ఆప్రకారము నూర్జహా నుపవనమునందుఁ గూర్చుండియుండఁగా జులేఖా మెల్లఁగ నామెయొద్దకువచ్చి నిలుచుండెను. నూర్జహా నాలోచనానిమగ్నమానసయై యుండుటవల్లఁ బ్రథమములో జులేఖారాక తెలిసికొనలేకపోయెను. కొంతసేపటికి జులేఖానుగుర్తించి 'ఏమి జులేఖా! నీకార్యము సఫలమైనదని నమ్ముదును' అనెను. జులేఖా సహజస్వాతంత్ర్యముతో నామెదగ్గఱకూర్చుండి బంగారు పిడిగల యొక చిన్నవిసనకఱ్ఱతో నూర్జహానును విసరుచు 'రాణీగారినౌక రామెప్రయత్నమునందెన్నఁడు నోటమి పొందనేరదు' అనెను.

నూర్జహాను తన చెలికత్తెచేతినుండి విసనకఱ్ఱతీసికొని యామె మీఁదఁ జెయివేసికొని యీప్రకారమనెను. 'నానమ్మకమైన స్నేహితురాలా! నీయొక్క నిరుపమానమైన తెలివితేటలకు నేను చాల సంతోషించితిని. ఈదినమున నేమివిన్నది స్పష్టముగాఁ దెలియఁజెప్పుము. తెలివిహీనులైన యితరులమాటలు నేనమ్మఁజాలను. గ్వాలియరుకోటనుండి ఖుసురురాకొమరుఁడు తప్పించుకొని పారిపోయినాఁడను గాలికబురున కాధారమేమైననున్నదా?'

జులేఖా నవ్వుచు నిట్లనియెను 'జహాంగీరుచక్రవర్తిగారి కాలములో బాహ్యప్రపంచమునుండి దర్బారున కెట్టివార్తలును దెలియవు.'

ఆమాటలువిని నూర్జహానుముఖము గంభీరభావము వహించెను. తిరిగి యామె (జులేఖా) యిట్లు చెప్పఁదొడగెను. 'ఎవ్వఁడైన నే

సంగతియైనఁ దెలియవచ్చిన నదినిజముగాక నబద్ధములతోను వర్ణనల తోను నిండియుండును. ఎన్నఁడైన నీసామ్రాజ్యము నాశనమగునెడల నిట్టికారణములవల్లనే జరుగును.'' నూర్జహాను కోపదృష్టితో 'ఖుసురువిషయమై నిజమైనవార్త నీవల్ల నేను వినగోరుచున్నాను' అనెను.

'మూఁడు సంవత్సరములక్రిందట గ్వాలియరుకోట సేనాధిపతి ఖుసురురాకొమరుని నింకను ఖయిదీగానుంచుట ప్రమాదమని యెంచి యురితీయుంచెను' అని జులేఖా బదులుచెప్పెను.

'ఈసంగతి నేను నమ్మవచ్చునా?' అని నూర్జహానడిగెను.

'తప్పక నమ్మవచ్చును. సూర్యుఁడుదయము తూర్పుదిక్కున నుదయించుట యెంతనిజమో యీసంగతికూడ యీప్రకారమే నిజము. నేనొక నమ్మకమైననౌకరును గ్వాలియరు పంపినాను. అతఁడీసమాచారము తెచ్చియున్నాఁడు' అని జులేఖా బదులుచెప్పెను.

'అట్లైన చాలసంతోషము. ఖుసురురాకొమరుఁడు రాజపుత్రసేనతో నాగ్రామీఁదకు దండెత్తివచ్చుచున్నాఁడనుసంగతి గాలికబురేనా? జులేఖా! నీవుచెప్పినమాట నిజమే. మనకు బయటజరుగు పనులయొక్క నిజమైనసమాచారము తెలియుటయరుదు. ఢిల్లీ ఖూనీలవిషయమై సమాచారమేమైనఁ దెలిసెనదా?' అని నూర్జహానడిగెను.

'మీదయవల్లను నాచేతిలో చాల డబ్బున్నది. అందువల్ల వందలకొలఁదిజనము నాపలుకుబడిలోనున్నారు. ఒకమనుష్యుని నేనీపనిమీఁదఁ బంపినాను. అతఁడింతకుపూర్వమే ఢిల్లీనుండి వచ్చినాఁడు' అని జులేఖా బదులుచెప్పెను.

'అతఁడేమిచెప్పెను. మనము విన్నదంతయుఁ గల్పనాకథ యేనా ? అందులో నేమైన నిజమున్నదా ?' అని నూర్జహానాతుర తతో నడిగెను.

'కేవలమబద్ధముకాదు. గోరంతలు కొండంతలుచేసి జనులు చెప్పుకొనుచుందురు. రెండునెలలకుఁ బూర్వ మొకశవము దిగంబరి గా ఢిల్లీగేటుకడ నుంచఁబడినది. తరువాత నెలదినములకుఁ దిరిగి యా తేదీనే యింకొకశవముకనఁబడెను. నాకరునుఁబంపిననాఁడు తిరిగి యొకశవము కనుపించినఁదట. వందలకొలఁది శవములమాట యబద్ధ ము. మూఁడుసార్లుమాత్రమే యీప్రకారము జరిగినది. ఢిల్లీవంటి పెద్దపట్టణములో మూఁడుఖూనీలుజరుగుట యొకవింతకాదు. అది గాక వరుసగా రెండు నెలలో యొకే తేదీని ఖూనీజరుగుటయు భయ మునకుఁ గారణముకాదు' అని జులేఖా బదులుచెప్పెను.

'ఆహా ! అందువల్లనే జనులు భయభ్రాంతితోనున్నారు' అని నూర్జహానడిగెను.

'ఇంకొక ముఖ్యమైనవార్త నేనువింటిని. ఆకడసారి చంపఁ బడిన రాజకుమారుఁడు మేవారుదేశపు మహారాణాయైన కర్ణసిం గు' అని జులేఖా చెప్పెను.

ఆమాటలువిని నూర్జహానతిసంతోషముతోఁ దానువిన్నది నిజమో కాదో యనుసందేహముతో 'ఏమి ! కర్ణసింగే ! చచ్చు టయే ! నిజమేనా ?' అని యడిగెను.

'అవును నేను పంపినచారుఁడు చాల తెలివిగలవాఁడు. కర్ణ సింగును బాగుగ నెఱుఁగును. శవము యమునానదిలోఁ బారవేయక పూర్వమాతఁడాకళేబరమునుజూచి కర్ణసింగును గుర్తుపట్టెను. ఇందు కెంతమాత్రము సందేహములేదు' అని జులేఖా బదులుచెప్పెను.

నామార్గమందలి యొకయడ్డంకి తొలఁగింపఁబడెను. చాల సంతోషము! అజీత్ సింగునందు నాకు చాల నమ్మకముండెడిది. కాని యతఁడెందుకును బనికిమాలినవాఁడైనందున నేను చాలవిచారించుచున్నాను ' అని నూర్జహాననెను.

' రసపుత్రవీరులు దయ్యములకు భూతములకు భయపడరని నేను విందును ' అని జులేఖా బదులుచెప్పెను

' మనమతనివిషయమై విన్నసంగతి యెంతవఱకు నిజము ? ' అని నూర్జహాను ప్రశ్నించెను.

' అంతయు నిజముకాకున్నను గొంతవఱకు నిజమైయుండును. అజీత్ సింగు పత్తేపూరుసిక్రికిఁ బంపఁబడెనుగదా! ' అని జులేఖా యనెను.

' అవును. కాని యతనిపయాణమునకుఁ గారణము నేను చెప్పియుండలేదు ' అని నూర్జహాను బదులుచెప్పెను.

' ఇంకను దెలియఁజెప్పుటకుఁ దరుణముకాదు ' అని జులేఖా యనెను.

అప్పుడు భీమసింగు మహాబత్తుఖానులయొక్క కుటవిషయమై జులేఖాయుద్దేశము తెలిసికొనఁగోరి నూర్జహానామె నావిషయమై యడిగెను.

' నాకును సందేహముగానున్నది. ఐనను మనము జాగ్రత్తలోనుండుట మంచిది. ఏదియెట్లున్నను హిందూబేగమునకుఁ బుట్టిన రాకుమారుఁడాగ్రాసింహాసన మధిష్టించుటకు వీలులేదు ' అని జులేఖా జబాబుచెప్పెను.

నూర్జహానుముఖ మెట్టబారెను. గంభీరభావముతో నామె యిట్లనెను. ‘అట్లు నిశ్చయించవీలులేదు. ఆవిషయమై యేమియును జెప్పలేను.’

ఇంతలో జనానాలో రాజభవనములో నొకయాందోళనము పుట్టెను. బందీలాతురతతో నిటునటుపరుగెత్తసాగిరి. ఏదోయొక ముఖ్యమైనసంగతి రాణీగారితోఁజెప్ప నుద్యుక్తులై యుండిరి. కాని చెప్పుటకెవరికిని సాహసము లేకపోయెను. ఎట్టకేలకొకబంది యొడలంతయువణఁకఁ జెమటలుగ్రమ్మ మాటాడలేక నూర్జహానెదుటకు వచ్చి నిశ్చేష్టురాలై నిలువఁబడెను. ఏమిప్రమాదము గలిగినది నూర్జహానుకుఁ దెలియలేదు. నౌకరు మాటాడక నిలిచియుండుట వల్ల నూర్జహాను మిక్కిలికోపముతో ‘ఓబుద్ధిహీనురాలా! ముద్దువలెమాటాడక నెందుకు నిలిచియుండెదవు? సంగతి చెప్పనియెడల నిక్కడకెందులకుఁ వచ్చితివి? జులేఖా! ఈపాపిష్టురాలను ‘ఖోజా ముసురునొద్దకుఁ బంపుము.’ ఈ వాక్యముయొక్క యర్థమందఱికిని తెలియును. అక్కడికిఁ బంపినమనుష్యుఁడు తిరిగి యీలోకమందుఁ గనుపించఁడు.

దాసి యామాటవిని భయకంపితగాత్రియై రాణీగారికాళ్ల మీఁదఁబడి యేడ్వసాగెను. అప్పుడు ‘నూర్జహానామెతో ‘ఓపిశాచమా! లేచి నీవుతెచ్చిన సమాచారము త్వరగాఁజెప్పుము’ అనెను.

దాసి కాళ్లమీఁదనుండిలేచి వణఁకుచు ‘ఖురుముఁరాకొమరుఁడు—ఆగ్రానుండి—ఎక్కడికో—పారిపోయినారు’ అనెను.

‘ఓ తెలివితక్కువదానా! పొమ్ము!’ అని రాణి యాజ్ఞ యిచ్చెను.

బ్రతికితిగదాయని దాసి యవతలకు వెళ్లిపోయెను. నూర్జ

హాను సంతోషముతోఁ జుట్టు కనుపించుచున్న ప్రకృతిసౌందర్యమును జూచుచుండెను.

జులేఖా తన యజమానురాలియొద్దకువచ్చి నెమ్మదిగా ‘ తమకీసంగతి యిదివఱకే తెలియునా ? ’ అని యడిగెను.

‘ అవును. చాలకాలముక్రిందటనే యెఱుఁగుదును. నాదర్బారునందు బుద్ధికుశలతగల ప్రతివ్యక్తికి నిదివఱకే తెలిసియుండును. చాలకాలమునుండి ఖురుము దర్బారునందుఁ గనుపించుటలేదు. అతఁడప్పుడే మనవిరోధులను గలిసియుండును. ఈదినమున నీబుద్ధిహీనులింత యల్లరిచేయుచున్నారు ’ అని నూర్జహాను జబాబుచెప్పెను. జులేఖా మృదుమధురస్వరముతో ‘ అమ్మా ! మనవిరోధులెవరు ? ’ అని యడిగెను.

‘ మనవిరోధులను నీవెఱుఁగవా ? మార్వారురాజగు కర్ణసింగు, భీమసింగు, మహాబత్ ఖాను మొదలగువారందఱు మనవిరోధులే ’ అని నూర్జహాను జబాబుచెప్పెను.

---

## ౨౦ వ ప్రకరణము.

ఆప్రకారము జులేఖా నూర్జహానుతోఁ బ్రసంగించి తిరిగి వచ్చుచు సిన్ మహాల్ అని పేరుపడినభూమి యంతర్భాగమందుఁ గల గదులు ప్రవేశించెను. ఎక్కడచూచినను నిశ్శబ్దత, చీకటియే. కొంతవఱకు పైభాగమందుండు బేగములయొక్క స్త్రీలయొక్కయు ధ్వనులు వినిపించెను. తరువాత నాధ్వనులుకూడ వినుపించుటలేదు. అగాధాంధకారముగల గుహాలోపల నేమూల నెవరు డాగియున్నది తెలిసికొనుట యసాధ్యము. జులేఖా కాయంతర్మార్గములన్నియు

బాగుగఁ దెలియును. బేగముమహాలులో, చక్రవర్తి, చక్రవర్తిని, తరువాత నీమె తప్ప యీమార్గములు తెలిసిన మతియొకవ్యక్తి లేదు. అట్టినమ్మక మామెకుఁగలదు. ఏదియెట్లున్నను భోగవిలాసములతోఁ గూడియుండు జహాంగీరురాజ్యమందుఁ బ్రాణభయమునకు మితిలేదు. ఏమనుష్యున కెట్టిశత్రువులున్నది తెలుసుకొనుటకష్టము. ‘ దినదిన గండము నూరేండ్లాయుస్సు ’ అను సామెతవలె జీవితము గడుపవల యును. హిందూదేశముపాలించు చక్రవర్తినియొక్క చెలికత్తెయైన దసదయకుఁబాత్రులై చాలమంది యుమ్రావులు, సర్దారులు, వీరు లు, శూరులు, నౌకర్లు గలిగియుండిన నాచీఁకటిగదులలో నడచు నప్పుడు జులేఖాకు భయములేకపోలేదు. ఏమూల నెట్టిహంతకుఁడు దాగియుండెనో యని యామె యతినిపుణతతోను జాగ్రత్తతోను దారితడువుకొనుచు మెల్లగా నడువసాగెను. ఇంతలో నేదోవస్తువు తనమీఁద నకాత్తుగాఁ బడినట్లు మెగ్రహించెను. ఆమెనోటిలో గు డ్డలు గుక్కఁబడెను. కాళ్లుచేతులు త్రాళ్ల చేతఁ గట్టఁబడెను. కనుల కు గంతలుకట్టఁబడెను. మాటాడవీలులేదు. చూడశక్యముకాదు. పారిపోవుటకసలే వీలులేదు. ఈపని యేదుర్మార్గులవల్ల జరిగెనో యూ హింపలేకపోయెను. తరువాత నాహంతకులు జులేఖాను మోసికొని పోవసాగిరి. ఎక్కడకు తీసికొనివెళ్లుచున్నది యామెకుఁ దెలియుట లేదు. కొంతదూరము తీసికొనివెళ్లి యక్కడదింపి కాళ్లుచేతులకుఁ గట్టినత్రాళ్లు విప్పి వారు పారిపోయిరి. కనుగంత యూడతీసికొని చూచునప్పటికా కటికచీఁకటిలో పైనుండి క్రిందివఱకు నల్లనిగుడ్డ బురకావేసికొనియున్న కొందఱుమనుష్యులు పారిపోవుచుండిరి. వా రెక్కడనుండివచ్చినది యెక్కడికి వెళ్లుచున్నది యామెకు బోధపడలే దు. ఆమె తనలోఁ దానిట్లాలోచించెను.

'నన్నీదుర్మార్గు లిక్కడ కెందుకుఁ దెచ్చిరి? చంపుటకా? చంపుట కేమైన నన్నిట్లువిడచి యెందుకు వెళ్లెదరు? వారిగుర్తు నాకు దెలిసినయెడల వారిప్రాణములపై వారాశ వదులుకొనవలసినదని వారికి తెలియదా? ఇట్టిధైర్యము! ఇట్టి మొండిధైర్యము! ప్రాణముపై నాశలేనిసాహసము చేసినవారెవరు? ఎవరి యుత్తర్వుప్రకారము వీరీపనిచేయ సాహసించిరి? ఇందు నూర్జహానుయొక్క సలహాయేమైన నున్నదా? నేనీ చీఁకటిసొరంగమందు నీరాహారము లేక మాడి చావవలసినదేనా! నాజీవితవుద్దేశ మింకను దీరలేదే! తీరకయే యిట్టి తుచ్ఛమరణమునకుఁ బాల్పడవలసినదా? పిలచినఁ బలికి యాదరించువారెవరును లేరే! బేగముమహాలుయొక్క రహస్యపుగదులు, త్రోవలన్నియు నాకుఁ దెలియునుగాని యీసొరంగ మెన్నఁడును జూచియుండలేదే!'

ఇట్లు తలపోయుచు, నతిధైర్యస్థురాలును, బుద్ధికుశలతగలదియు గనుక ధైర్యమువహించి యాసొరంగమువెంట చీఁకటిలోనే నడువఁజొచ్చెను. నాలుగుబారలదూరముపోగా నొక పెద్దయినుపతలుపడ్డమువచ్చెను. అది రెండవవైపున తాళము వేయఁబడియుండెను. అవతలకుఁబోవుటకు మార్గ మేమియునులేదు. ఇనుపతలుపు భేదించుటకు శక్తిలేదు. నిరుత్సాహముగలిగి యీశ్వరధ్యానముచేసికొని కొంతసేపు దుఃఖంచి తిరిగి ధైర్యము తెచ్చుకొని సొరంగము రెండవవైపునకు నడువసాగెను. కొంతదూరము వెళ్లఁగా నొక వెలుతురుకనుపించెను. ఆవెలుతురునుబట్టి నడువఁగా నింకొకసందు (సొరంగము) ప్రవేశించెను. తిరిగి యీసొరంగము మూయఁబడిన యొకస్థలమునకువచ్చెను. అక్కడ త్రోవకొక పెద్దరాతిబండ యడ్డుపెట్టఁబడెను. అవతలకుఁబోవుటకు మార్గములేదు. అంతయు నిశ్శబ్దముగానుండె

ను. ఆలోచించఁగా నాస్థలము బేగముమహాలు బయటనుండు స్థలముయొక్క క్రిందిభాగమువలె నామెకుఁదోఁచెను. నిరుత్సాహము తో నెక్కడనైన శబ్దమువినఁబడునాయని యిటునటుఁ దిరుగుచుఁ జావే నిశ్చయమని స్థిరపరచుకొనియుండఁగా నేదోయొకశబ్దము విని పించినట్లామెకుఁ దోఁచెను. వెంటనే శ్రవణేంద్రియములుతప్ప మిగిలిన యింద్రియములన్నియు బిగించి తదేకదృష్టితో నాలకించఁగా మనుష్యుల మాటలసందడివంటిధ్వని వినుపించెను. కొంతవఱకు చైతన్యమునుబొంది యాధ్వని వినఁబడువైపునకువెళ్లి యక్కడగోడ పరీక్షించగా నొకమూల మూయఁబడిన యొక రహస్యద్వారము కనుపించెను. సంతోషముతో నాద్వారము తనశక్తికొలఁది త్రోయఁగాఁదలుపు తెరువఁబడెను. మెట్లు కనుపించెను. ఆమెట్లమీఁద నెమ్మదిగానెక్క మనుష్యులసందడి మఱింతబిగ్గరగా వినుపించెను. మెట్లపైభాగమునకెక్కునరికి యొక పెద్దద్వారముకనుపించెను. ఆమె యిప్పుడు బేగముమహాలున నుండెను గాని యాభాగమిదివఱలో నామె చూచియుండలేదు. ఆతలుపుసందులనుండి చూడఁగా లోపల నొక విశాలమైనగది కనుపించెను. ఆగది యతిసుందరముగా నలంకరింపఁబడియుండెను. ఆగదిలో తానుఁజూచినదృశ్యమువల్ల నామెకు భయమును గోపమును జనించెను.

---

## ౨౧ వ ప్రకరణము.

జులేఖా తాను పదిసంవత్సరములనుండి మొగలాయిజనానాలోనుండి బేగముమహాలుయొక్క యనేకవిధములైన దృశ్యములను

జూచుచుండెను. తనయొక్క సూక్ష్మబుద్ధివల్లను, దూరదృష్టివల్లను రహస్యములకు నునికిపట్టగు బేగమ్‌మహాలుయొక్క ప్రతిభాగమును తిరుగుచు నక్కడనుండువారికి తనయందు భయమును గౌరవమును గలిగించుచుండెను. కొంతకాలమువఱకు కొన్ని హేయపుదృశ్యములుచూచి సిగ్గుపడుచుండెను. కాని క్రమశః యామెమనస్సు రాయియై యవి తనకు సంబంధములేనివానివలె వానిని నిర్లక్ష్యభావముతోఁ జూచుచుఁ దనపనిమీఁదఁ దాను దిరుగుచుఁ గాలము గడుపుచుండెను. విలాసములకు వ్యభిచారములకు మూలకందమగు నామహాల్‌లోఁ దిరుగుచుండిన నామె మనస్సెన్నఁడును జలించక శిలావృత్తమైయుండెను. ప్రస్తుతపుదృశ్యమువంటి హేయమైనదృశ్యమామె యిదివరలో నెన్నఁడును జూచియుండలేదు. అందువల్ల కొంతసేపటి వఱకాశ్చర్యముతో నసహ్యతతోను నిశ్చేష్టురాలై యుండెను.

ఆగది తెల్లచలువరాతితోఁ గట్టఁబడి బంగారుపూత పూయఁబడియుండెను. గదినిండ ననేక సౌఖ్యదాయకములైన వస్తువులుండెను. గోడలమీఁద మనస్సును జలింపఁజేయునట్టియు శిల్పకారుని యొక్క బుద్ధిచాతుర్యము చూపించునట్టియు, యోగులవంటివారికి కూడ మనోవికారము గలుగఁజేయునట్టియు ననేకచిత్రపటములుగలవు. గదిమధ్య ననేకశాఖలుగల దీపములు వ్రేలాడకట్టఁబడెను. నేలమీఁద పరిషియా దేశపు విలువగల రత్నకంబళ్లు పఱుపఁబడెను. మెత్తనియిసుకపైన కాలుపెట్టిన నేప్రకారము కాలు దించుకొనిపోవునో యట్టి మెత్తదనము వానికి గలిగియుండెను. గదికి నొకప్రక్కను ముఖమల్ శాటినుతోఁ దయారుచేయఁబడిన పడకయుండెను. దాని యొద్ద బంగారుతోను ముత్యములతోను జెక్కఁబడినబల్లయు, దాని మీఁద వివిధదేశములనుండి తేఁబడిన పరిపక్వమైన మధురఫలము

లుంచఁబడెను. ఇదిగాక మంచిసువాసనగల గులాబీమొదలగు ననేక పుష్పజాతులు పళ్లెరములయందుఁ దట్టలయందు, సీసాలయందు నక్కడక్కడ నుంచఁబడెను. అనేకవిధములగు తినుబండారపువస్తువులును, దాక్షారసము మొదలగు మత్తుపదార్థములును పడకప్రక్కను మేజాపై నుంచఁబడెను. ఇవియన్నియుఁజూచి జులేఖా యాశ్చర్యపడియుండలేదు. ఇవియన్నియు నామె సాధారణముగ జనానాయందుఁ బ్రతిదినము చూచుచుండునవియే కాని యామెకత్యాశ్చర్య మనహ్యత కలుగఁజేసినదృశ్య మేమనఁగా—

పర్వేషు రాజకుమారుఁ డాపడకమీఁద కూర్చుండి సారా త్రాగుచుండెను. అతనిచుట్టు ననేకమందిస్త్రీలు దిగంబరులై సురాపానముచేయుచు, నవ్వుచు, దుళ్లుచుఁ దొర్లుచుఁ, బొర్లుచునుండిరి. ఒకస్త్రీ పర్వేషురాజకుమారుని యురస్థలమందుఁ బరుండెను. ఈ వారవిలాసినులు రూపుచేష్టలుచూచిన యతులకుకూడ మనస్సుచలింపకమానదు. అధికసురాపానమువలన రాజకుమారునికనులు సగము మూఁతపడియుండెను. ఇటువంటి హేయమగు దృశ్యముచూచి జులేఖా తనదృష్టి కొంచెముమరల్చుకొని ‘ఇట్టి స్త్రీలోలుఁడా! హిందూదేశము పరిపాలించువాఁడు. విచిత్రము!’ అని తనలోఁదాననుకొనెను. వెనుకకుఁదిరిగి వెళ్లఁదలఁచుకొని తనయొక్క యసహాయతకు మనస్సున నొచ్చుకొనుచు బయటకువెళ్లుటకు వేఱేమార్గములేక నిశ్చేష్టురాలై గుమ్మముకడ నిలిచియుండి యీప్రకారమాలోచించసాగెను. ‘నన్నిక్కడికెవరు తీసికొనివచ్చినారు? వారియుద్దేశమేమి? ఇటువంటి హేయమైనదృశ్యము నాకుఁ గనపర్చుటకుఁ గారణమేమి? స్త్రీలంపటుఁడగు నీరాజకుమారుని నాకుఁ గనపర్చుటయొక్క యుద్దేశమేమి? నాకు వానియందసూయ పొడమునట్లుచే

యుటకై యుండునా ? నాకు వీనియం దెన్నఁడు నభిమానములేదే ! రాణికి వీనియందభిమానముండిన నుండవచ్చును. దానితో నాకేమి సంబంధము ? రాణియొద్ద నేనాలోచనముచేయుదానను గనుక, నా యాలోచనమీాద నామె విశ్వాసముంచును గనుక, నేనీదృశ్యము చూచి నూర్జహానుమనస్సు పర్వేషుమీాఁదనుండి త్రిప్పునట్టుచేసెదనని యూహించి యిట్టిదృశ్యము కనుపరచియుందురా ? వీది యెట్లున్నను నేనిక్కడనుండి తప్పించుకొనుటకు వేఱేమార్గముకనుపించదు. నేను కొంతసేపటివఱకు సిగ్గువిడిచి ప్రవర్తింపవలయును ' ఇట్లు నిశ్చయించి తలుపు నెమ్మదిగాతోసెను.

తలుపుచప్పుడువిని స్త్రీలందఱు తలుపువైపుచూచి యొక క్షణకాల మాపరికారమేయుండి తరువాత నవ్వుచుఁ గొంతసిగ్గుపడి తమ దిగంబరశరీరములను దలగడదిండ్లతో మరుగుపెట్టుకొనసాగిరి. రాజకుమారుఁడు జులేఖావైపుచూచి ' ఆహా ! నీవు వచ్చితివా ! మంచిది రమ్మ ' అనెను. అపరిమితమైన కోపమువలన జులేఖా ముఖము యెఱ్ఱపడి శరీరము వణఁకజొచ్చెను. ఆమెయిప్పుడు పూర్ణమైన మధ్యవయస్సునందుండెను. కొంచెము హెచ్చుతగ్గుగా నూర్జహానందముతోఁ బోల్పఁదగినయందము గలిగియుండెను. అవయవములన్నియుఁ బూర్ణముగా వృద్ధిపొంది బంగారువన్నె బెట్టినరీతినుండెను. ఎక్కువశ్రద్ధతో దుస్తులుధరించకపోయిన నామెయొక్కదుస్తులామెయొక్కరూపమునకు మఱింత శోభగలిగించుచుండెను. అప్పుడామె గంభీరమైనస్వరముతో నిట్లనెను. ' రాజకుమారా ! నేనెవరినో నీకుఁ దెలియునా ? నన్నవమానపరచుటకా యిక్కడఁకు బిలుపించితివి ? '

పర్వేషు రాజకుమారుఁడు స్వభావమున పిరికివాఁడగుటవలన జులేఖామాటలువిని భయపడి లేచి, తిరిగి కూర్చుండి తడఁబడుమాటలతో, 'కాదు, కాదు. జులేఖాబీబీ! నాయుద్దేశమది కాదు. నాకు నీతోఁ గొంత రాజకీయసంబంధమైన పనిగలదు.' అని చెప్పెను.

'రాజకీయసంబంధమైనపని కిది యనువైన సమయము?' అని జులేఖా యడిగెను.

'అందుకు నేను బాధ్యుఁడను కాను. నేనిక్కడికి తీసుకొనిరమ్మనమని చెప్పియుండలేదు. ఆ తెలివిహీనులు గొప్పతప్పు చేసినారు' అని రాజకుమారుఁడు జబాబు చెప్పెను.

'నాకనులు గంతలుగట్టి నన్నీ పరిశారమిక్కడకుఁ దీసికొనివచ్చుటకుద్దేశమేమి? కాకితో వార్తచేసిన మీరు వీలైన స్థలమునకు వచ్చి మాటాడుదురుకదా! లేదా మీయుద్దేశము బాదుషా బేగముగారికిఁ దెలియఁబరచిన బాగుండునుగదా!' అని జులేఖా మారుపలికెను.

'తగాదా యక్కడనే యున్నది' అని రాజకుమారుఁడనెను.

'ఎందుకు' అని జులేఖా యడిగెను.

'కారణము లేకపోలేదు. నేను నీవనుకొనునంత తెలివిహీనుఁడనుగాను' అని రాజకుమారుఁడనెను.

'నేను నీతల్లివయస్సుగలదానను. నాయెదుట నీ హేయమైన దిగంబరులను భోగఫుపడుచుల నుంచుకొనుటకు నీకు సిగ్గుజనించుటలేదా? నేను బాదుషా బేగముగారియొద్దకు వెళ్లవలసియున్నది. ఆమెయొద్దకు వెళ్లుటకు మార్గముచూపుము. నాచేతివ్రేలియందున్న యుంగరమునుజూచితివా? దానిమీఁద నూర్జహానుగారి పేరు చెక్కబడియున్నది' అని తనచేతివజ్రపుటుంగరము జులేఖా రాజకుమారునకుఁ జూపెను.

ఆయుంగరమునకు మొగల్ కోర్టులోనున్నవారే కాక హిందూదేశమందలి యెట్టిగొప్పవారైనను దలవంచుకొని లోఁబడవలసినదే. అట్టియుంగరముయొక్క పరిభావమువల్ల జులేఖా రాజకుమారునితో నీపరికారమనెను. ‘ నీవు చెప్పుమాటలయందుఁ దల తోఁక కనుపించదు. నాతోఁ రహస్యముగా మాటాడవలసియున్న యెడల నిది స్థలముకాని సమయముకాని కాదు’ ఇంతలో రాజకుమారుని కనుసంజ్ఞవల్ల భోగపుపడుచులు ప్రక్కగదిలోనికివెళ్లిరి. ఇంతవఱకు జులేఖా గుమ్మముదాటి లోపలికివెళ్లలేదు. ఇప్పుడు గుమ్మముదాటి యక్కడనేనిలిచి ‘ రాజకుమారా! నీవేనా ఢిల్లీసింహాసనము నెక్కఁగోరువాఁడవు ? ’ అని పలికెను.

జులేఖా కూర్చుండియుండలేదు. గుమ్మమునొద్దనేనిలిచి యిట్లు తనలోఁదాను దలపోయసాగెను.

‘ నన్నిక్కడకుఁ దెప్పించుటకుఁ గారణమేమైయుండును? రాజకీయసంబంధములో నితఁడు నాపై కుట్రయేమైన బన్నియున్నాఁడా ? ఇట్టి స్త్రీలోలుఁడట్టిపని యెన్నఁడును జేయఁజాలఁడు ’ ఈపరికారమాలోచించి, తరువాత గంభీరమైనస్వరముతో నిట్లనెను.

‘ రాజకుమారా! బాదుషాబేగముగారియొద్దకుఁ దోవజూపుము. నేనామెయొద్దకు వెళ్లుటకు తొందరపడుచున్నాను.’

రాజకుమారుఁడిట్లు బదులుచెప్పెను. ‘ నేను నిన్నిక్కడకుఁ బిలిపించియుండలేదు. ఇక్కడ నీరాకకుఁ గారణమేదియో తెలిసికొనఁగోరి యింతవఱకు నీవుచెప్పుచున్న మాటలన్నియు వినుచున్నాను. బహుశః యీగదిమార్గముతప్ప వేఱొకమార్గముగల స్థలమునకు నీవు వెళ్లగోరుచున్నావు. నీవుతప్ప నింకెవరైన నీసమయమం

దీపరికారము నన్నాతంకపరచియుండినయెడల నట్టివారితల యప్పు డే నేలపైఁబడియుండును.

‘ మీరుతప్ప యింకెవరిట్టిసమయం దీస్థలమున కీవిధముగ నన్నుఁ దెప్పింపసాహసించెదరు ’ అని జులేఖా యడిగెను.

రాజకుమారుఁడేదో చెప్పఁబోయెను. కాని యాశ్చర్యముతో భయిముతోఁగూడిన యస్పష్టమైన యొకమాట వానినోటినుండి వెలువడెను—నిశ్చేష్టితుఁడై తెల్లపోయి యాశ్చర్యముతోఁ జూచుచుండెను—జులేఖా కేమిజరిగినది తెలియదు. ఆమెమునస్సాందోళన పడుచుండెను. పర్వేషునోటినుండి యేదో యస్పష్టమైనమాట వినఁబడెను. అతఁడాశ్చర్యమునకు లోనైనట్టు కనిపెట్టెను. ఇంతకుతప్ప యామెయేమియుఁ జూచియుండలేదు. క్రమశః యంతయు గాఢాంధకారమయ్యెను. క్షణకాల మామెకేమియుఁ గనుపించలేదు. కాని జులేఖా యతిధైర్యస్థురాలనియుఁ బ్రమాదము కష్టమువచ్చినప్పుడ ధైర్యపడునదికాదనియు నిదివరలోనే చెప్పియున్నాము. కొంతసేపటికి మనస్సు కుదుకుపరచుకొని చూడఁగా తాను నిలిచియున్నస్థలము (ఒక రాతిబండ) తోపాటు క్రిందికి దిగుచున్నట్టు కనుపించెను. ఆమె నిలిచియుండలేక కూర్చుండి తాను కూర్చొండియుండెడి రాతిని గట్టిగా పట్టుకొనెను. తిరిగి నిలుచుటకుఁ బ్రయత్నించెనుకాని కనులు తిరుగుటవల్ల నిలువలేకపోయెను. తాను 10 సంవత్సరముల నుండి బేగమ్మహాలులోనుండిన నిట్టిదృశ్యమెన్నఁడును జూచియుండలేదు. అప్పుడత్యాశ్చర్యమగు ననుభవముగలిగెను. తాను క్రమముగాఁ బాతాళలోకమునకు వెళ్లుచున్నట్లుండెను. ఇట్టిస్థితియందు ధైర్యముగల మనుష్యుఁడైనను భయమునకులోనై కేకలువేయవలసినదే. గాని జులేఖా యట్లుచేయలేదు. ఆమెయొక్క మనోదార్ఢ్యము

నిశ్చలత యసమానములు. ఆమెగుండె రాతితోఁ జేయఁబడియుండ వచ్చును. ఆమె మనోధైర్యమునువహించి యీప్రకారము తలపో యసాగెను. 'ఈప్రకారము నన్ను బాధపెట్టుటకుఁ గారణమేమో? నన్ను జంపనుద్దేశము కనుపించదు. ఆయుద్దేశముండిన నాపనియిది వఱకే జరిగియుండును. అదిగాక నూర్జహాను నావిషయమై విశ్వప్ర యత్నముచేసి నన్ను ఖూనీచేసిన వారిని తగినట్టు శిక్షించఁగలదు. నేను పాలుత్రాగుపిల్లనుకాను. నామనస్సు కుదురుపరచుకొనెదను. నేనీమహలునందు ప్రతిరహస్యద్వారము, గది, మూల యెఱిఁగిన దాననని గర్వపడుచుండెడిదానను. ఇప్పుడు నాకాగర్వభంగము గలి గినది. నాకు తెలియని యాశ్చర్యములీమహలులో నింకనెన్నియో యున్నవి.'

ఈప్రకారమనుకొనుచుండఁగాఁ దనచుట్టు చీఁకటియధికమ య్యెను. తాను చుట్టునీరుండెడి యొక తేమప్రదేశముగుండ వెళ్లు చున్నట్టు తనకుఁదోఁచెను. ఆమెనోటినుండి మాటరాలేదు. చుట్టు నుండు మురికియొక్కయు చెత్తయొక్కయు దుర్వాసన ఘ్రాణరంధ్రములను బాధించుచుండెను. ఆహా! పైభాగమందు విలాసములకు పుట్టినిల్లగు రాజకుమారుని మందిరము. దాని దిగువభాగమున రొచ్చు, కుళ్లు, మురికితోనిట్టిస్థలము! ఎట్టి తారతమ్యము. ఆమె భూగర్భములోనికి వెళ్లుచున్నట్టామెకుఁ దోఁచెను. ఇప్పుడు తిరిగి మనస్సునకుఁ గొంత యాందోళనకలిగెను. గమ్యస్థానము తెలియదు. ఎట్లుతీసుకొనిపోఁ బడుచున్నదియుఁ దెలియదు. భూమిక్రిందకుఁగ్రిందుగఁదీసికొనిపోఁ బడుచున్నట్టుమాత్రము తోఁచెను. ఇట్టిచావు చచ్చుటకంటె చేత నున్న వుంగరమందలి వజ్రపుపొడిమ్రింగి చచ్చిన బాగుండునని జులేఖా యనుకొనెను. కాని తిరిగి మనస్సు కుదురుపరచుకొని యీ ప్రకారమూహింపసాగెను.

‘ ఆహా ! ఆత్మహత్య మహాపాతకము. అదిగాక నేనుదలచుకొనిన కార్యమింకను కొనసాగలేదు. ప్రత్యపకారము చేయవలెనను కక్ష మనస్సును బాధించుచున్నది. నాకక్ష తీరనిది యాత్మహత్యయా! అనేకసంవత్సరములనుండి పోషింపఁబడుచున్నకక్ష తీరకుండ నాత్మహత్యయా ! అంతముచూడవలసినదే ’ అని యూహించి ధైర్యము వహించి రాతిని గట్టిగాఁబట్టుకొనికూర్చుండెను. మనస్సు కుదుటపరచుకొని విచారించఁగా తాను క్రిందకుదిగుచున్నట్టు కనుపించలేదు. ఎందుకనఁగా తిన్నఁగా క్రిందకుదిగునెడల నీసరికి పాతాళలోకమునకుఁ జేరియుండవచ్చును. ఏదో రహస్యమైనట్టియు, నాశ్చర్యకరమైనట్టియు, యంత్రసహాయమువల్ల నామె రాజభవనముయొక్క క్రింది భాగమునకుఁ దీసికొనిపోఁబడుచుండెను. ఏప్రకారమెవరివల్ల నిట్లు జరుగుచున్నది తెలియలేదు. ఆహా ! ఎట్టి యాశ్చర్యమైనయంత్రము లేర్పాటుచేయఁబడెనో ! అకాత్తుగా నామె చీకఁటినుండి వెలుతురుకుఁ దేఁబడెను.



## ౨౨ వ ప్రకరణము.

కటికచీఁకటినుండి వెలుతురులోనికి వచ్చుటవల్లఁ గనులుమిరుమిట్లుగొనసాగెను. కొంతసేపటివఱకు భయసంభ్రమములతోఁ గొయ్యబారియుండెను. తానేప్రకారమక్కడకుఁ దీసికొనిరాఁబడినదియుఁ దెలియక నాశ్చర్యపడుచుండెను. అక్కడ నిశ్శబ్దముగానుండెను. పురుగులధ్వనియైన వినఁబడుటలేదు. కొంతసేపటికి మనస్సుకుదురుపరచుకొని యిటునటుచూఁడగాఁ దానొక విశాలమైనగదిలోనుండెను.

ఆగదిలో విలాసార్థముపయోగపడు సామగ్రియేమియునులేదు. గది మధ్యభాగమందొక యిత్తడిదీపము వ్రేలాడఁగట్టఁబడియుండెను. దాని వెలుతురువల్ల గదియంతయుఁ బ్రకాశమానముగనుండెను. ఆలోచించిచూడఁగా నామందిర మొక మసీదువలెఁ గానుపించెను. సాధారణముగా మసీదులలో రాత్రివేళలట్టిదీపములు వెలిగింపఁబడును. కాని యామసీదు నిదివరలో నామె చూచియుండలేదు. అది రాజమందిరమునకు వెలుపల కోట లోపలనున్నది లేక కోటగోడ బయటనున్నది. యామెకు బోధపడలేదు. జులేఖా భయమువల్ల నాశ్చర్యమువల్లనుఁ గొయ్యబారి స్త్రీస్వభావజనిత భయమునకు లోనయ్యెను. తన పూర్వజీవితము జ్ఞప్తికివచ్చి కన్నులవెంట నీరుకారసాగెను. తిరిగి మనస్సు కుదురుపరచుకొని ధైర్యము తెచ్చుకొని తానున్నగది పరీక్షింపఁజొచ్చెను. అది రాతితోఁగట్టఁబడియుండెను. రాకపోకలకొక ద్వారమును గాలికి రెండుకిటికీలును గలిగియుండెను. గది వస్తుశూన్యముగానుండెను. తానక్కడికేప్రకారము తీసికొనిరాఁబడినదో తెలిసికొనవలయునని గది పరీక్షించెను. ఆప్రకారము పరీక్షించుచుండఁగా గదితలుపు నెమ్మదిగా తెరువఁబడెను. ఒక పురుషుఁడు లోనఁ బ్రవేశించెను. వానినిజూచి తన కేదైనయపాయము తటస్థించునేమోయని యూహించి తన కుడిచేయి హృదయమునందుంచి యందుండు పదునగుకత్తిని చేతితో గట్టిగాపట్టుకొని యవసరమైన బైటకుఁదీయుటకు సిద్ధముగనుండెను. తరువాత నూతనపురుషుని శ్రద్ధగాఁ బరీక్షింపసాగెను. అతఁడుపొడవరి. గంభీరభావముగలవాఁడు. అతని తెల్లగడ్డము నాభివఱకు వ్రేలాడుచుండెను. ఒక తెల్లటిబురకా మెడనుండి కాళ్లవఱకుఁ గప్పఁబడియుండెను. మెడయందనేకవిధముల పూసలదండలుండెను. ఫకీరులచేతియందుండునట్టి యొక చిన్నకఱ్ఱ

వానిచేతియందుండెను. వాని వేషమునుబట్టి యతఁడొక ముసలిఫకీరుగా జులేఖా తలంచెను. మనస్సునందలిభయముపోయి యతనియందు గౌరవభావము కలిగెను. జులేఖా తానాయుధములవలనఁ గాపాడుకొనఁ బ్రయత్నించుచున్నదని యానూతవ్యక్తి గ్రహించి నవ్వుచు నామెతో నిట్లనెను. 'సర్బసుందరీ! నీవెప్పుడు నీతోఁ గత్తియు విషమును నుంచుకొనెదవని నాకుఁదెలియును. తనపూర్వపుపేరు వినినతోడనే జులేఖా యాశ్చర్యముతో నోటమాటలేక నిశ్చేష్టురాలై యుండెను. మొగలాయిదర్బారులోఁ బాదముపెట్టినదిమొదలునఁగా తాను మహమ్మదీయమతము స్వీకరించినదిమొదలు తన్నెవరును బాతపేరుతోఁ బిలిచియుండలేదు. సర్బసుందరి చాలకాలముక్రిందటనే వంగదేశమునం దొకగ్రామములోఁ జనిపోయియుండెను. ఇప్పుడీ నూతనపురుషు డెఱిగినవానివలెఁ బాతపేరుతోఁ బిలిచినందున కాశ్చర్యముగలిగి యతనిముఖమువంకఁ దేరిపారఁజూచెను. 'బేగముమహాలులోఁగలుగు నుపద్రవములనుండి తప్పించుకొనుట కాయుధములు దగ్గరనుండవలసినదే. ఆత్మహత్య చేసికొనవలసియున్నయెడల విషమును శత్రువులు మీఁదఁబడునప్పుడు వారినిపొడుచుటకుఁ గత్తియు నుపయోగపడును. నామాట నిజమేనా?' అని ఫకీరడిగెను. ఇంతలో జులేఖా తనమనస్సు కుదురుపరచుకొని యిట్లనెను. 'నేను సర్బసుందరినికాను. చక్రవర్తినియగు నూర్జహానుగారికిఁ జెలికత్తెనగు బందిజులేఖాను.'

'నీపాతకధయంతయు నాకుఁదెలియును' అని ఫకీరనెను.

'తెలిసియుండవచ్చును. కాని సర్బసుందరి చాలాకాలముక్రిందనే చనిపోయినది. మీయెదుట కనఁబడుస్త్రీ మహమ్మదీయమతము స్వీకరించినబందీ జులేఖా' అని జులేఖా బదులుచెప్పెను.

ఫకీరామెహృదయము పరీక్షింపఁగోరి యామెవంకఁ దదేక దృష్టితోఁజూచి 'నీవుచెప్పినమాట నిజమేనా?' అని యడిగెను. తప్పకుండ నిజమేయని జులేఖా బదులుచెప్పెను. ఫకీరు కొంతసేపటి వఱకు మాటాడలేదు. అతఁ డామెమనస్సునందుండు నూహాలు గ్రహించవలెనని యామెవంక రెప్పవాల్పకఁ జూచుచుండెను. తరువాత కొంతసేపటికిట్లనెను. 'కాదు. నీవుచెప్పినది నిజముకాదు. నీ వింకను బరద్వాను దేశమందలి యొకగ్రామములోఁ బెంపఁబడిన సర్వసుందరివే.' జులేఖా కోపదృష్టితో నిట్లనెను.

'అయ్యా! మీరెవ్వరో నాకుఁదెలియదు. కాని మీవేషమునుబట్టిచూడఁగా నొకఫకీరువలెఁ గాన్పించుచున్నారు. మీయుద్దేశ మెట్టిదైన నీవిషయములో మీయొక్కనడత బాగుగఁ గనుపించుటలేదు. మీరు నన్నీరీతిగా నిక్కడి కెత్తుకొనివచ్చుటకుఁ గారణమేదియో, యది యెట్టినడనడికయో సమర్థించుకొనఁగలరా? ఫకీరు నెమ్మదిగా నిట్లు జబాబుచెప్పెను. 'ముఖ్యమైన రాజకీయవ్యవహారములు కొన్ని జరుపుకొనవలసినప్పుడు కుయుక్తులనుబన్ని కష్టములు పెట్టవలసివచ్చును. కాని మనము ముఖ్యముగా గమనించవలసిన నీతి యేమనఁగా చాలమందికి మంచిచేయవలెను' జులేఖాముఖము కోపమువల్ల నెఱ్ఱఁబాఱెను. ఆమె కోపముతో 'నీవు రేపు బాదుషాబేగమువారియెదుట రప్పింపఁబడి యామెవలన కఠినశిక్షను పొందఁగలవు' అనెను.

'నీవు నేను చెప్పునదంతయు వినినపిమ్మట నాసంగతులెక్కడను జెప్పవని నానమ్మిక' అని ఫకీరనెను.

'ఇటువంటి క్రూరకృత్యములు నూర్జహానురాణీగారినుండి రహస్యముగ నుంచెదనని నీవు తలంచుచుంటివా?' అని జులేఖా యడిగెను.

'తప్పక నీవేమియు బైటపెట్టవని నేను నమ్మకముగఁ జెప్పఁగలను' అని ముసలిఫకీరు జబాబుచెప్పెను.

జులేఖా యాశ్చర్యముతో 'ఏమి! మీరు ప్రతివిషయము నిశ్చయముగఁ జెప్పుచున్నారే!' అనెను.

అప్పుడు ఫకీరు జులేఖాతో 'నేను నీతో నొక ముఖ్యమైన విషయము మాటాడవలసియున్నది. దయచేసి కూర్చుండుము' అని పలికెను.

జులేఖా కక్కడనుండుట కొంతమాత్రము నిష్టములేదు. కాని నీసంగతియొక్కలోతు కనుగొనఁదలంచి కూర్చుండెను. అప్పుడు ఫకీరు 'నేను నీతో చెప్పుసంగతు లెవరికైనను దెలిసినయెడల యపాయముకలుగును' అనిచెప్పెను. 'ఎందువల్ల? మీరెవరో దయచేసి చెప్పుడు' అని జులేఖా యడిగెను. 'నీవావిషయమై యాతురపడవలదు. నీకాసంగతి క్రమశః దనంతటనదియే తెలియఁగలదు' అని ఫకీరనెను. 'పర్వేషురాకొమరునకు నేనిక్కడికి వచ్చినసంగతి తెలియుననుకొందును' అని జులేఖా యడిగెను.

'అవును. కాని యతఁడీసంగతి తనతలపోయిన నితరులతోఁ జెప్పఁడు. గనుక నితరులకెవరికిని యీసంగతి తెలియకుండనుంచవలెనని నాయుద్దేశము' అని ఫకీరు బదులుచెప్పెను.

'దిగంబరులైన యాదుష్టవారవనితలు నేనిక్కడికివచ్చుట చూచియుందురని నానమ్మకము. వారినోళ్లు మీరెట్లుకట్టఁగలరు' అని జులేఖా యడిగెను. 'ఆవిషయమై తగునేర్పాటుచేసెదను' అని ఫకీరు జబాబుచెప్పెను.

'విచిత్రమైనవిధమున రహస్యసంభాషణకొఱకై నన్నిట్లు రప్పించుటయందు మీయుద్దేశమేమి?' అని జులేఖా యడిగెను.

‘ నీవంతయుఁ దెలిసికొనెదవు. మనము సంభాషణ ప్రారంభింతము ’ అని ఫకీరనెను.

జులేఖా కోపముతో ‘ నేను మీవల్ల నిన్నికష్టములు నిబ్బందులుపొంది మీరుచెప్పునది యేదియో వినకపోవుటధర్మముకాదు. ఏమి చెప్పఁదలఁచుకొంటిరో త్వరగాఁజెప్పి నన్ను విడిచిపెట్టుఁడు ’ అనెను.

ఫకీరు నవ్వుచు ‘ నీవు నిజముగ నాడుసింహమువలె నున్నావు—నీవు, నూర్జహాను, మీయిద్దరిలో నెవరు యెక్కువశక్తిగలవారో చెప్పుము ’ అని యడిగెను. జులేఖా కోపముతో నింకపరిహాసముకట్టిపెట్టి సంగతిచెప్పుమని కోరెను. ఫకీరు నెమ్మదిగా ‘ నీవు పేరునకు జులేఖాఁబందీవిగాని నిజముగ పాత సర్బసుందరివే ’ అనెను. జులేఖా మిక్కుటమైనకోపముతో ‘ నన్నీ ప్రకార మెందులకు బాధపెట్టుచున్నారు. ఉరిసినపుండ్లమీఁద నుప్పురాయుచున్నారే. నేను మీకెన్నఁడు నపకారము చేసియుండలేదు. నాకీప్రకారము మనోవ్యథ నెందుకుఁ గలిగించెదరు ? ’ అనెను.

అప్పుడు ఫకీరు స్థిరమైనస్వరముతో ‘ నాకు నిన్ను బాధపెట్టనుద్దేశములేదు. నీయొక్కపూర్వచరిత్ర నీవు మరచియుండలేదని చెప్పుటకై యిట్లంటిని. నీవిప్పుడు పేరుకు జులేఖావైనను నిజముగ పాత సర్బసుందరివియే ! ’ అనెను.

జులేఖా యేదో యనఁబోయెను. కాని ఫకీరుమాటకడ్డము వచ్చి యిట్లనెను. ‘ కొంచెముసేపోపికగలిగి నేను చెప్పునది వినుము. జులేఖా ! నీవు పదిసంవత్సరములనుండి పగతీర్చుకొనవలెనని గట్టిపట్టుదలతో విశ్వప్రయత్నములు చేయుచున్నావు. నీప్రోద్బలము, ఆలోచనలేనిది షర్ఆఫ్‌గన్ ఆప్రకారము చంపఁబడియుండఁడు.”

‘ అయ్యా ! మీకు నాపురాతనగాధ బాగుగ తెలిసినట్లు కన బడుచున్నది. ఆపరమదుర్మార్గుఁడు నాభర్తనుచంపి నన్ను నాస్వా మినుండి యెడబాపి తురకమతము నాకిప్పించి తనభార్యయొక్క దాసి గానుంచినాఁడు. ఆహా ! నాచిన్నికుమార్తె యేమైనదో నాకుఁదెలి యదుగదా ! నాముసలిమామగారు సిగ్గువల్ల నభిమానమువల్లను దేశమువిడిచి విదేశములపాలయ్యెను. ఇదియంతయు నాదుర్మార్గుని కారణమువల్ల నేగలిగెను. అట్టిదుర్మార్గునిమరణమునకు నేనొక కారణ భూతురాలనగుట యాశ్చర్యమా ! అందువల్ల దుర్మార్గురాలనా ! ’ అని జులేఖా యడిగెను.

‘ కాదు. నీచర్యమంచిదే. ఎంతచేసికొనెనో యంతయనుభ వించినాఁడు. కాని నేను చెప్పఁదలఁచుకొనినది యేమనఁగా ‘ నీమన స్సునందు నీకార్యమింకను శాంతిపడలేదు ’ అని ఫకీరు జబాబు చెప్పెను.

‘ అయ్యా ! మీరు గొప్పభ్రమలోనున్నారని నామనవి. నేను నాపూర్వచరిత్ర నామనస్సునుండి తుడిచివేసికొంటిని. నూర్జహా నుగారిదయవల్ల నాకు బేగముమహాలులోఁ బలుకుబడిగలదు. ఆమె నన్నుఁ దనసోదరివలెఁ జూచుకొనుచున్నది. నాకేమియును గొఱఁత లేదు. నేను బేగమ్‌మహల్‌లోనెవరికిని బాధకలుఁగజేసియుండలేదు.” అని జులేఖా యనెను.

‘ నీవెవరికిని యపకారముచేసినావని నేను చెప్పుటలేదు. బేగ ముమహాలులో నందఱు నిన్ను గౌరవించెదరు. నూర్జహానుకంటె నీవే యెక్కువయధికారము గలిగియున్నావు. నీవు సామాన్యస్త్రీలతోఁ బోల్పఁదగవు. నీమనస్సులో గొప్పగొప్ప యుద్దేశములున్నవి ’ అని ఫకీరనెను.

‘ మీరుచెప్పుచున్నది నాకు బోధపడుటలేదు.” అనిజులేఖా బదులుచెప్పెను.

‘ అంతేయుఁ జెప్పెదను. సావధానముగ వినుము. హిందూదేశమందీతురకరాజ్యముమార్చి హిందూరాజ్యము స్థాపించనుద్దేశించియున్నావు. ఇందుకొఱకై క్రొత్తవేషముధరించి పదిసంవత్సరములనుండి శక్తికొలఁది ప్రియత్నములు చేయుచున్నావు. నూర్జహానును బైకిఁ బ్రేమించుచుందువుగాని మనస్సునందామెను నాశనముచేయనుద్దేశముగలదు. నీయొక్క ముఖ్యోద్దేశము మొగలాయీరాజ్యము నాశనముచేసి హిందూరాజ్యము స్థాపించుటయే. సర్వసుందరీ ! నేను చెప్పునది నిజమేనా ? ’ అని ఫకీరడిగెను.

క్షణమాత్రము జులేఖాముఖము తెల్లబారెను. ఉత్తరక్షణమున నవ్వుచు నిట్లనెను. ‘ ఓపవిత్రమైన ఫకీరుఁడా ! ఏమి ! మీరు కలువరించుచుంటిరా ? లేక సంధియెత్తినదా ? మీరుచెప్పు పెద్దసంగతులు నాచిన్నమెదడు గ్రహింపఁజాలకున్నది. నేనొక యమాయకురాలనగు దాసిని. నూర్జహాను చక్రవర్తిని నన్నుదయతోఁ జూచుచుండుననుమాట సత్యము. నాపూర్వవృత్తాంతమంతయు నాజీవితమునుండి తుడిచివేసితినని యిదివఱకే చెప్పియున్నాను. మీరొక పిచ్చివానివలె మాటాడుచున్నారని చెప్పుటకు సాహసించుచున్నాను. దయచేసి నన్ను క్షమింపుఁడు.’

ఫకీరు జులేఖాను దదేకదృష్టితోఁజూచి యిట్లనెను. ‘ హిందూదేశమందు వంగదేశీయుల తెలివితేటలు చాలయుత్కృష్టమైనవి. నీవు వంగదేశీయురాలవు. నీతెలివియొద్ద నూర్జహాను తెలివితేటలు సూర్యునియెదుట దీపమువంటివి.’



# ౨౩ వ ప్రకరణము.

'నాతో వ్యగ్రప్రసంగమెందులకు? బాదుషా బేగముగారు నాకొఱకు వెదకుచుందురు' అని జులేఖా యనెను.

అందుకు ఫకీరు 'బాదుషా బేగమునకీరాత్రి నీవిషయమై దర్యాప్తుచేయుటకు సావకాశముండదు. చక్రవర్తిగారీరాత్రి యామెతోఁగడపెదరు' అని ఫకీరు బదులుచెప్పెను.

జులేఖా యాశ్చర్యముతో 'ఏమి! మీరు దర్బారుసంగతులన్నియుఁ దెలిసినవారివలెఁ గనుపించుచున్నారు. జనానాసంగతులు నాకంటె మీకే యెక్కువ తెలిసినట్లున్నదే!' అనెను.

ఫకీరునవ్వుచు నిట్లనెను. 'నీవు నీమనస్సువిప్పి సందేహించక నాతోమాటాడిన నాకును నీకును నుపయోగకరముగనుండును.'

'నేను మీకుమనస్సువిప్పి చెప్పవలసినసంగతి యేమున్నది? నేను బేగముమహాలులో నొకదాసిని. రాణీగారిదయకుఁ బాత్రురాలను. ఇంతకంటె రాజకీయవ్యవహారములలో నాకేమియు సంబంధములేదు' అని జులేఖా చెప్పెను.

'సంబంధమున్నది. లేనియెడల నీప్రకారము నిన్నిక్కడకు రప్పింపనవసరములేదు. సరే. నీవు నీమనస్సులోనున్నసంగతులు చెప్పఁదలఁచుకొనలేదు గనుక నావిషయము మనము విడిచిపెట్టుదము. కాని నీవిషయమై కొన్నిప్రశ్నలడుగవలసియున్నది' అని ఫకీరనెను.

'అడగవచ్చును' అని జులేఖా బదులుచెప్పెను.

అప్పుడిద్దఱికిని యీాదిగువసంభాషణ జరిగెను.

'నీకుమాత్రవిషయమై యామె యెక్కడనున్నదో నీకేమైనఁ దెలియునా?

'నాకుఁదెలియదు. ఆమె యెక్కడనైన బ్రతికియున్నను నాకుఁ జచ్చినదానితోనే సమానము.'

'అయితే యిపుడాగ్రాలో లేదా?'

'నాకేమియును దెలియదు. మీకు కొంత తెలిసినట్లు మాట్లాడుచున్నారే!'

'నీవాపిల్లవిషయమై దర్యాప్తుచేయవా?'

'చేయను. నేను ప్రస్తుతము మామతమునుండి బహిష్కరింపఁబడి మొగలాయిజనానాయందు దాసిగానున్నాను. నాపిల్ల బ్రతికియున్నను నాముఖమామెకెట్లు కనుపరచఁగలను?'

'నీమామగారెక్కడ తిరుగుచున్నదియు నీకుఁదెలియునా?'

'తెలియదు. జనులుచెప్పుకొనువాడుక నమ్మినయెడల నాయన నాకుమార్తెతో గంగానదిలో మునిగియుండును.'

'ఆసంగతి నీవు మనస్ఫూర్తిగా నమ్మెదవా?'

'నమ్మెదను. కాని అయ్యా! ఇటువంటి యనవసరప్రశ్నలతో నన్నెందులకు బాధపెట్టెదరు?'

ఢిల్లీలోజరుగుచున్న హత్యలవిషయమైగాని యాకళేబరములవిషయమైగాని నీకేమైనఁ దెలియునా?

జులేఖా కోపముతో 'మీరు నన్ను హంతకురాలిగ నిరూపించుచున్నారా?'

'పత్తేపూరుసిక్రి సంగతులవిషయమై నిజస్థితిచెప్పఁగలవా!'

'చెప్పలేను. ఆసంగతులు నాకెట్లు తెలియును?'

'అయితే ఖురుమురాకొమరుఁడెక్కడదాగియున్నదిచెప్పుము'

'క్షమించండి. మీరిచ్చినమాతలకు నేను జవాబు చెప్పదలఁచుకొనలేదు.'

‘ కూరగాయలమ్మునది, ముసలిపిచ్చిస్త్రీ, సన్యాసి, మాలవీ వీరెవరో నీకుఁ దెలియునా ? ’

‘ చెప్పలేను. చెప్పలేను. ఓభగవంతుఁడా ! యీప్రకారము నన్నెందుకు బాధపెట్టెదవు ! ’

‘ అయితే నేను చెప్పినదంతయు నబద్ధమా ? ’

‘ అబద్ధమో, నిజమో. ఆసంగతులేమియు నాకుఁ దెలియవు’

‘ సరే. గాని సర్వసుందరీ ! నీమనస్సులోనున్న సంగతి నాకుఁ జెప్పిన బాగుండును. నీయుద్దేశమునకు నేను సహాయముచేయఁగలను. నీసంగతి నాతోఁ జెప్పకుండుట మంచిపనికాదు.’

‘ అయ్యా ! మీరు చాలపొరపడుచున్నారు. నాకేకోరిక యును లేదు. అట్టిదియున్న యెడల మీరడుగకుండగనే మీవంటి గొప్పవారితో మనవిచేసికొని ధన్యురాలనై యుందును.’

‘ తిరిగి యాలోచింపుము. నీమనస్సునందలి రహస్యము నాతోఁ జెప్పిన నీకు నావలన మంచి గలుగఁగలదు.’

జులేఖా కోపముతో ‘ మీయుంచి నాకవసరము లేదు. నన్ను వెళ్లనిమ్ము.’

‘ అట్లైనసరే. నీయిష్టమువచ్చినట్లు నీవు వెళ్లవచ్చును.’

‘ దయచేసి నేను బైటకువెళ్లుటకుఁ దోవకనపరపుము.’

‘ అదిగో, ద్వారము కనుపించుచున్నది. ఈసంగతి నితరులకుఁ దెలియఁజెప్పుటవిషయములో నాలోచించిచేయుము.’

‘ తప్పక నట్లేచేసెదను. దానిప్రతిఫలము త్వరలోనే మీరు పొందఁగలరు.’

ఫకీరు నవ్వుచు ‘ నీవు విశ్వప్రయత్నముచేసినను, నేనెవరినో, యెక్కడనుందునో గనుఁగొనఁజాలవు. వర్వేషువిషయమై నీవు

గుట్టు బయలుపరచునెడల నీకేయపకారము కలుగఁగలదు' అనెను. ఈప్రకారముచెప్పి ఫకీరు ద్వారమునుచూపి 'ఇంక వెళ్లవచ్చును' అనెను.

జులేఖా యామార్గ మెక్కడికివెళ్లునని యడిగెను.

'వెళ్లిన నీవే తెలిసికొనఁగలవు. కాని తిరిగిచెప్పుచున్నాను. నీమనస్సులోనున్నరహస్యము నాతోఁజెప్పిన నీకుచాలయుపకారము నావల్లఁ గలుగఁగలదు' అని ఫకీరనెను.

జులేఖా రెండుమూఁడడుగులు ముందుకువేసి తిరిగి ఫకీరునొద్దకువచ్చి 'అయ్యా! మీరు నావిషయమై చాల దురభిప్రాయములోనున్నారు. ఐనను మిమ్ములను నేను స్నేహితునిగా నెంచుకొనవలెనో, లేక శత్రువుగా నెంచుకొనవలెనో దయచేసి చెప్పుఁడు' అని యడిగెను.

'నీయిష్టమువచ్చినట్లు తలంచుకొనవలెను. అదియంతయు నీనడతమీఁదనే యాధారపడియుండును' అని ఫకీరు బదులుచెప్పెను.

'మీవిషయమై కొంచెము తెలిసికొనవలసినయవసరము గనుక మీ రెవరో తప్పీలుగాఁ జెప్పెదరా?' అని జులేఖా యడిగెను

'నేను సామాన్యపు ఫకీరును' అని ముసలివాఁడు బదులుచెప్పెను.

'నేను రాణీగారిదాసినియెట్లో యట్లేనా?' అని జులేఖా యడిగెను.

'కొంతవఱకట్టిదే. నాకు మహమ్మదీయులయందు ప్రేమ హిందువులయందయిష్టత లేదు. ఇంక నీవువెళ్లవచ్చును' అని ఫకీరనెను.

'ఈమార్గము రాజభవనమునకుఁ దీసికొనివెళ్లి విడుచునా?' అని జులేఖా యడిగెను.

'వెళ్లిచూడుము' అని ఫకీరు బదులుచెప్పెను.

'మనము తిరిగి యెన్నడైనఁ గలిసికొనెదమా?' అని జులేఖా యడిగెను.

'అవసరమైనయెడల కలిసికొనుటకు నేర్పాటుచేసి కొనవచ్చును. ఇంక నాలస్యముచేయక వెళ్లవచ్చును' అని ఫకీరుచెప్పెను.

జులేఖా ద్వారముగుండా బయటకువచ్చెను. అకాత్తుగా తన వెనుక నొకధ్వని వినుపించెను. ఆశ్చర్యముతో వెనుకకుఁజూడఁగా ద్వారము కనుపించలేదు. ఒక పెద్దరాతిగోడయుండెను. దానిలో ద్వారముండినగుర్తుకూడ లేదు. తానక్కడి కేప్రకారమువచ్చినది కూడ తెలియుటలేదు. తానప్పుడొకచిన్నగదిలో నిలిచియున్నట్లామె తెలిసికొనెను. తనయెదుట మెట్లుకనుపించెను. పైయంతస్థులోనున్న దీపముయొక్క కాంతి క్రిందకుఁగనుపించుచుండెను. ఆగదియందు గుమ్మమేమియుఁ గనుపించలేదు. ఆమెట్లమీఁదుగ పైకెక్కగా నొక యందమైనమసీదులో నున్నట్లామెకు స్ఫురించెను. అందులో ననేకశాఖలుగల యొక పెద్దలాంతరు వ్రేలాడుచుండెను. ఆకాంతివల్ల గదియంతయుఁ బ్రకాశించుచుండెను. ఆ తెల్లరాయికట్టడము తప్పీలుగాపరీక్షించగా తానాగ్రాకోటలోనుండు ప్రసిద్ధికెక్కిన మోతీమసీదులో నున్నట్లు నిశ్చయించుకొనెను. ఈమసీదాదినములలో ఖాస్‌మసీదని పిలువఁబడుచుండెను. జహాంగీరుకుమారుఁడైన షాజహాను దానిపేరు మోతీమసీదుగామార్చెను. ఈమసీదు చక్రవర్తి, రాణి, చక్రవర్తికుమారులయొక్క యుపయోగమునిమిత్తము కట్టఁబడినది. దానియొక్కయంద మిప్పటివఱకుఁ జెక్కుచెదరక ననేకమంది యాత్రిస్తుల నాకర్షించుచున్నది. ఈమసీదు రాజభవనమునకుబైట కట్టఁబడియున్నది. రాజభవనమునుండి దీనిలోనికి

నేలసొరంగముగుండ తోవయున్నసంగతి జులేఖాకుఁ దెలియదు. పర్వేషు రాజకుమారునికికూడ తెలియదు. ఎందువల్లననఁగా నాసంగతి యతనికి తెలిసియుండిన జులేఖా క్రిందికిపోవునప్పు డాశ్చర్యపడియుండడు.

జులేఖా యట్టిరాత్రిసమయమం దామసీదులో మనుష్యులెవరునులేనందున కాశ్చర్యపడలేదు. అప్పుడక్కడ తానునిలిచి యాలోచించుట యనవసరమని యూహించి జులేఖా తొందరగ మసీదు బయటకువచ్చెను. వచ్చునరికినామెకుఁ గనుపించినదృశ్యమునకామె యాశ్చర్యనిమగ్నయై నిశ్చేష్టురాలయ్యెను. తానెవరితో నింతవఱకు మాటాడియుండెనో యాదుస్తులావేషముగల ఫకీరే తనముందర కొలఁదిదూరములో వెళ్లుచుండెను. ఏమియుఁదోచక జులేఖా తన లోఁదానిట్లు తలపోయసాగెను.

'ఏమి ! ఈఫకీరును నేను మసీదులోవిడిచి ముందువచ్చితినే. అతఁడు నాతోరాలేదు. నావెనుక మెట్లమీఁదుగా నాతోవచ్చినను నాకుఁదెలియకుండునా ? నావెనుక బయలుదేరి యతడీప్రకారము ముందెట్లువచ్చును ? పొరపడుటకు వీలులేదే ! అవేదుస్తులు! అదే మనిషి ! చాలయాశ్చర్యముగానున్నదే ! ఆమసీదునుండి బయటకు వేరే యింకొకరహస్యమార్గ ముండియుండును. ఇన్నిసంవత్సరముల నుండి నేనిక్కడ నివసించుచున్న నీరహస్యమార్గములు నాకుఁ దెలియలేదు. కానిమ్ము. ఈఫకీరెక్కడకువెళ్లునో చూచెదనుగాక.'

ఈప్రకారము నిశ్చయించుకొని వానివెంట కొలఁదిదూరమునఁ దొందరగ జులేఖా నడువసాగును. ఫకీరు తొందరగ రాజభవనమువైపునకు నడుచుచుండెను. 'ఏమి ! యీఫకీరు రాజభవనమునకువెళ్లుట యాశ్చర్యముగానున్నది ! ఇతఁడెవఁడైయుండవచ్చును ?

ఎవరియొద్దకు వెళ్లుచున్నాఁడు ? ఈరహస్యసమావేశమునకుఁ గారణమేమి?' అనితనలోఁదాననుకొనుచు ఫకీరునందుదృష్టియుంచి నడుచుచుండెను.

అకాత్తుగా నామె శిలావిగ్రహమువలె కదలక నోటమాట లేక నిలువఁబడియుండెను. పిడుగువల్లను దెబ్బతినినదానివలె, నిర్జీవప్రతిమవిధమునఁ దెల్లబోయి చూచుచుండెను.

---

# ౨౮వ ప్రకరణము.

ఆఫకీరు రాజభవనముయొక్క సింహద్వారముచేరెను. తత్క్షణమేయక్కడ పహరాయుండుసిపాయిలందఱు లేచి చక్రవర్తికి చేయదగ్గమర్యాదచేసిరి. వారుచేసినమర్యాద చక్రవర్తికితప్ప నింకెవరికిని చేయరు. రాజకుమారులకుఁగూడ నట్టిమర్యాదచేయుట యలవాటు లేదు. అదిచూచి జులేఖా విస్మయభయములతో శిలావిగ్రహమువలె నిలువఁబడెను. కొంచెము తెలివివచ్చినతరువాత తనలోఁ దానిట్లనుకొనెను.

'ఏమి ! ఇతఁడు చక్రవర్తియా ! ముసలిఫకీరువేషముతో నింతవఱకు నాతో సంభాషించినయతఁడు చక్రవర్తియా ! అసంభవము. నేను చక్రవర్తిని యనేకసార్లు వివిధముగుదుస్తులతోనుండగాఁ జూచియుంటినే ! చక్రవర్తియైన నేను గుర్తింపఁజాలకుందునా ? అతఁడు చక్రవర్తికాడు. కానియెడల చక్రవర్తికి నివ్వఁబడుమర్యాద సిపాయిలితనికెందుల కిచ్చియున్నారు ?'

ఈప్రకారము వితర్కించుకొనుచు భయమునకులోనై శరీరమంతయుఁగంపింప నేదియో యాలోచించుచుండెను. ఇంతలో నా ఫకీరువేషగాఁడు రాజభవనములోనికి వెళ్లిపోయెను. జులేఖామనస్సు కుదురుపరచుకొని ధైర్యమువహించి రాజభవనద్వారమునొద్దకు వచ్చెను. భవనద్వారమునందలి నగారా మ్రోగనారంభించెను. దానినిబట్టి యప్పుడర్ధరాత్రిమించినదని యామెగ్రహించెను. ఫకీరు లోనికివెళ్లినతోడనే సిపాయిలు తిరిగి వారివారిస్థలములలోఁ గూర్చుండియుఁ బరుండియుఁ దొర్లుచు, సంగీతముపాడుచుఁ గాలముగడుపుచుండిరి. జులేఖా, ద్వారమునొద్దకువచ్చి త్రోవనీయవలసినదిగా కోరెను. ఆమెముఖముందు బురకాయుండుటవల్ల నామెను సిపాయిలు గుర్తింపఁజాలక బీబీసాహేబ్ యిట్టిరాత్రిసమయమందు లోనికిఁబోనిచ్చుటకు హుకుములేదు. ఈరాత్రివేళ నెవరికొఱకై బయటకువెళ్ళితివో మాకుఁదెలియదు. ఈరాత్రి బయటనే యుండవలసివచ్చును ' అనిరి. అప్పుడు జులేఖా తనచేతి వజ్రపుటుంగరము వారికిఁజూపెను. ఆయుంగరమందలి ' మూర్జహా ' నను నక్షరములు ప్రకాశమానముగా సిపాయిలకుఁ గనుపించెను. వారుభయకంపితగాత్రులై సిగ్గుపడి మారుమాటాడక నామెకు లోనికిఁ ద్రోవయిచ్చిరి. ఆమె నాలుగడుగులు ముందుకువేసి తిరిగి సర్దారునొద్దకువచ్చి ' ఇంతకుముందు రాజమందిరములోనికి వచ్చినవారెవరు ? ' అని యడిగెను. ' చక్రవర్తిగారు ' అని సర్దారు బదులుచెప్పెను. ఆమాటలు భయభ్రాంతయై ' ఏమి ! చక్రవర్తియా ! ముసలిఫకీరుకాఁడా ! నాకు ముందొకఫకీరీ లోపలికిచ్చినాఁడే ' అని జులేఖా యడిగెను. ' ఫకీరు రాలేదు. చక్రవర్తిగారే వచ్చినారు. ఇందులో నబద్ధమేమియులేదు. మేము వారికిచేసినమర్యాద చూడలేదా ? ' అని సర్దారు జబాబు చెప్పెను.

జులేఖా మారుమాటాడక త్వరితగతి బేగమ్మహాలునకు వెళ్లెను. గేటునొద్ద ఖొజ్జాముసురు పహరాయుండెను. తనయుంగరము వానికిఁ జూపినతోడనే యతఁడు దిడ్డివాకిలి తెఱచి యామెను లోనికిఁబోనిచ్చెను. వెళ్లుచు నామెసురయాతో నిట్లనెను.

“ముసూరీ! చక్రవర్తిగారీరాత్రి యేబేగమునొద్ద నరుండెను’ ‘బాదుషాబేగముగారగు నూర్జహానుగారియొద్దనుండును. మీకీసంగతి తెలియదా?’ అని ముసూరీ తిరిగి యడిగెను. జులేఖా మారుమాటాడక తనగదివైపునకు వెళ్లెను. అర్ధరాత్రిదాఁటుటవలన మహాలులోనుండు పెద్దదీపములన్నియు నార్పఁబడియుండెను. చిన్న చిన్న దీపములక్కడక్కడ వెలుఁగుచుండెను. ఆదీపముల కాంతిసహాయమున జులేఖా నూర్జహానుగదియొద్దకువెళ్లి తలుపునొద్ద చెవిపెట్టివినఁగా నేమియుశబ్దము వినుపించలేదు. నిరుత్సాహియై తనగదియొద్దకువచ్చెను. జులేఖాకు, నూర్జహానుగది దిగువభాగమున మూఁడుగదులీయఁబడెను. ఒకగది పడకగది క్రింద నుపయోగపడుచుండెను. రెండవది హాలుక్రిందను మూఁడవది నౌకరుండుటకును వాఁడబడుచుండెను. జులేఖాయే యొకనౌకరై యుండఁగా నౌకరుక్రింద నింకొకనౌకరేమియని కొందఱికాశ్చర్యము గలుగవచ్చును. కాని జులేఖా నౌకరువలెనుండుటలేదని యామెరాణీగారిదయకుఁ బాత్రురాలై యామెతరువాత నధికారము చెల్లించు వ్యక్తియనియు నిదివఱకే చెప్పియున్నాము. గనుక నామె యొక నౌకరునుంచుకొనుట యాశ్చర్యము కాదు. జులేఖా వచ్చుసరికి నామెనౌకరు దీపమునొద్ద కుట్టుకుట్టుచుండెను. నౌకరుముసలిదైన నామెకుదృష్టిలోపములేదు. ఆమెకు చెవుడులేదు. జులేఖాకాలిచప్పుడు వినినతోడనే యామె ప్రక్కకు తిరిగి లేచి, ‘బిడ్డా! యింతవఱకు నెక్కడనుంటివి? నీకేమై

ననపాయము సంభవించినదేమోయని నామనస్సు తహతహపడు చున్నది? అని యింకనేమేమో చెప్పబోవ జులేఖా యడ్డమువచ్చి ‘ దయామణీ! చక్రివర్తి యీరాత్రి యేబేగమువద్దనుండెనో నీకుఁ దెలియునా?’ అని యడిగెను. ‘ సూర్జహానుబేగమునొద్దనే. ఆయన తండ్రిాను నేను లోపలకు వెళ్లుట చూచినాను. పొద్దుగ్రుంకకపూర్వ మే యక్కడకు వచ్చినాఁడు’ అని దయామణి బదులుచెప్పెను. ‘ చక్రివర్తి తిరిగి యామెగదినుండి వెళ్లెనా?’ జులేఖాయడిగెను.

‘ బయటకు వెళ్లుటయా? ఆమాయలమారి యతనిని గదల నిచ్చునా? వచ్చినప్పుడు తాగితూలుచు నిద్దఱు స్త్రీలయొక్కసహా యమువల్ల లోనికివెళ్లెను. అతఁడిప్పుడామెకాళ్లు పిసుకుచు నామె యొద్దనేయుండును’ అని దయామణి యేమేమో చెప్పఁబోవ జులేఖా యామెమాటలకడ్డమువచ్చి యామెనోరునొక్కి ‘ గోడలకుఁ జెవు లుండును. కేకలు వేయునలకు. ఈమాటలితరులువినిన మనప్రాణ ములు దక్కవు’ అని బెదరించెను.

దయామణి “ అమ్మా! నేనిక్కడ పనిచేయలేను. నన్ను నా యూరు పంపివేయుము’ అని చెప్పుచు జులేఖాను ఫలహారముచే యుమనికోరెను.

‘ ఇప్పుడుచేయను. తరువాతచేసెదను’ అని జులేఖా బదు లుచెప్పెను.

‘ నీకుఁగావలసిన పండ్లు, పాలు, మిఠాయి, బంగారుపళ్లెర ములోనుంచి వెండిపళ్లెరముమూతవేసి యామూలనుంచితిని. నీయి ష్టమువచ్చినప్పుడు భుజింపుము. పులావునగైరాలు బీదలకుఁ బంచిపె ట్టితిని’ యని దయామణి చెప్పెను. జులేఖామనస్సు కలవరపడసాగె ను. తలంతయుమండుచుండెను. ఆరాత్రిచూచినదృశ్యములవల్ల నను

భవించినకష్టములవల్లను మనోవ్యథగలిగి యేమియుఁదోచక కొంచె ము సేపు విశ్రమించుటకామె గదిలోనికివెళ్లి పడకమీఁద నొడలు తెలియనిదానివలె పడెను. కాని యేమియాశ్చర్యము ! ఆమె యొవ రిమీఁదనోపడెను. బేగమ్‌మహల్‌లో రహస్యముగ కొంతమంది రా జకుమారులు, సుందరపురుషులు, జనానాస్త్రీలపొందుగోరి స్త్రీవేష ధారులై వారి ప్రియురాండ్రగదులలోఁ జొరఁబడి వారి ప్రక్కల మీఁదఁ బరుండుటఁగలదు. మహలునందలి వ్యభిచారచేష్టలన్నియు జులేఖాకుఁ దెలియును. అట్టి వేశ్యాలంపటమందిరమందుఁ దాను తిరు గుచున్నను దానెంతమాత్రమును జలింపక తన పాతివ్రత్యమామె జాగ్రత్తతోఁ గాపాడుకొనుచుండెను. ఆమెకుఁ గోరికగలిగినయెడల చక్రవర్తియొక్క రాణికాఁగలదు. కాని యట్టికోరికగాని యధికారగ మునందాశగాని యామెకులేదు. ఇదిగాక యక్బరుచక్రవర్తికాలము లో హిందూస్త్రీలనేకులతని జనానాలోనుండిరి. వారు వారిమతము లకు నష్టముకలుగకుండ వారి యిష్టప్రకారము భోజనమజ్జనాదులు జరుపుకొనుటకు చక్రవర్తి యాజ్ఞగలదు. వారి మతసంబంధమైన స్వాతంత్ర్యమడ్డుపెట్టువారికి శిక్ష విధించఁబడునని యక్బరుచక్రవర్తి శాసించియున్నాఁడు. గనుక హిందూస్త్రీలందఱు వారివారి మతా నుసారము భోజనమజ్జనాదులు జరుపుకొనుచుండిరి. జహంగీరుకూడ తనతండ్రివలెనే హిందూరాణుల మతస్వాతంత్ర్యము గాపాడుచుం డెను. కాని జులేఖా మహమ్మదీయ మతానుసారము జీవితము గడు పుచున్నట్టందఱికిఁ గనుపించుచుండెను. ఆకారణమువల్ల నామెకమూ ల్యమైన మాంస మత్స్యాహారములు ప్రతిదినము జనానానుండి పంపఁ బడుచుండెను. కాని యామె యట్టివిలువగల యాహారమంతయు బీదలకుపంచిపెట్టి తాను పండ్లు, పాలు, మిఠాయి మొదలగు వాని నే భుజింపుచు దేహయాత్ర గడుపుచుండెను.

## ౨౫వ ప్రకరణము.

జులేఖా మానసాందోళనమువలనఁ గొంతసేపటివఱకు విశ్రమింపఁదలఁచి తనపడకమీఁద పరుండుసరికి నంతకుఁబూర్వమే యా పడకమీఁద నిద్రించుచున్నవ్యక్తి తనమీఁద జులేఖా పడుటవల్ల బాధగలిగినట్లు మూలిగెను. కాని యావ్యక్తికిమెలకువరాలేదు. జులేఖా బేగముమహాలుయొక్క రహస్యములన్నియుఁ దెలిసినవిగనుక నే రాజకుమారుఁడైనను బరపురుషుఁడైనను దన పాతివ్రత్యము భంగముచేయుటకుఁ జీఁకటిలో రహస్యముగావచ్చి తనపడకమీఁద పరుండియుండవచ్చునని యూహించి, 'ఓదుర్మార్గుఁడా! నీవెవరు? నాపడకమీఁదఁ బరుండునట్టి మొండిధైర్యము నీకెట్లు గలిగినది?' అని కోపముతోననెను. కాని నిద్రించువ్యక్తికి బాగుగమెలకువరాక బాధవల్ల 'అబ్బా' అని గొణుగుకొనుచు మైమఱచి నిద్రించుచుండెను. అప్పుడు జులేఖా 'నేనెవరినో గుర్తించలేదా?' అని యనుచు నొకదీపము తీసికొనివచ్చి పరుండినవ్యక్తి ముఖమునొద్దపెట్టుసరికి నావ్యక్తి పురుషుఁడుకాఁడనియుఁ బది పండ్రెండుసంవత్సరముల యీడుగల యొకబాలికయనియు గ్రహించి తనలోఁదాను నవ్వుకొనుచు నిద్రపోవుచున్నపిల్లను 'దులాలీ! దులాలీ!' అని లేపెను. దులాలీ కనులుతెఱచి జులేఖావంకచూచి, 'ఏమి నేను బాగుగ నిద్రపోయినట్లున్నానే!' అనెను.

జులేఖా యామెప్రక్కఁగూర్చొని 'నీ వెక్కడినుండివచ్చితివి?' అని యడిగెను. 'చాలదూరమునుండి' అని దులాలీ బదులుచెప్పెను. 'ఎంతదూరమునుండియో చెప్పుము' అని జులేఖా తిరిగి

యడిగెను. దులాలీ చేతితో నేదో గుర్తుచేసెను. ఆగుర్తు జులేఖా గ్రహించి ' అజీత్ సింగక్కడనుండి యింకను బారిపోలేదా ?' అని యడిగెను. ' లేదు. రాజపుత్రులంతతొందరగా లొంగువారుకారు' అని దులాలీ బదులుచెప్పెను.

' ఇంకా విశేషములేమి ' అని జులేఖా తిరిగి యడిగెను.

' భీమసింగు, మహాబత్తుఖానులు నొక గొప్పసైన్యముతో నీ వైపునకు వచ్చుచున్నారు ' అని దులాలీ బదులుచెప్పెను.

' రాజకుమారుఁ డిప్పుడెక్కడ నున్నాఁడు ' అని జులేఖా యడిగెను.

' అతఁడెక్కడ దాగియుండెనో బ్రహ్మకుకూడ తెలియదు' అని దులాలీ ప్రత్యుత్తరమిచ్చెను.

' నీకుఁ దప్పక తెలిసియుండును. నాతోఁ జెప్పుము ' అని జులేఖా యడిగెను.

దులాలీ ! తనకు నైసర్గికమైన పెద్దనవ్వునవ్వి ' నేనొకముఖ్యమైన రహస్యముచెప్పెదను వినుము. పర్వేషురాకొమరుఁడు రేపు తెల్లవారకపూర్వము యుద్ధమునకు బయలుదేరును '. అనెను.

' ఎవరితోఁ బోరాడుటకు ? ' అని జులేఖా యడిగెను.

' రాజపుత్రులతో ' అని దులాలీ బదులుచెప్పెను.

' నీకీవిషయమై యెవరుచెప్పిరి ' అని జులేఖా యనెను.

' నీకుఁ దెలియదా? ఇందువిషయమై యన్నియేర్పాట్లుపూర్తియైనవి. చక్రవర్తియే యుత్తరవులిచ్చియున్నాఁడు ' అని దులాలీ బదులుచెప్పెను.

జులేఖాయొక్కముఖము తెల్లబారెను. మనస్సునందాందోళనమధికమయ్యెను. దులాలీతో నిట్లనెను. ' ఈమధ్య నూర్జహానునకు

నాయందు గౌరవముతగ్గినది. కొన్నిసంగతులు నాకుఁదెలియనిచ్చుట లేదు. దినదినమామెకు నాయందునమ్మకము తగ్గుచున్నది.'

'ఆమెజీవితమునకు సంబంధించినసంగతులు నీతో నెందుకు చెప్పవలయును?' అని దులాలీ యడిగెను.

'నిజమే. కాని పర్వేషు యుద్ధమునకు వచ్చుచున్నట్టు వారికి తెలియునా?' అని జులేఖా యడిగెను.

'ఎవరికిని దెలియదు. నాకుమాత్రమే తెలియును' అని దులాలీ బదులుచెప్పెను.

'నీకెట్లు తెలియును' అని జులేఖా యడిగెను.

'ఆసంగతియంతయుఁ దరువాత నెమ్మదిగాఁజెప్పెదను. నాకు నిద్రవచ్చుచున్నది' అని దులాలీచెప్పి పడకమీఁద తిరిగిపరుండి కొలఁదికాలములో గాఢనిద్రపోయెను.

ఈసందర్భమందు దులాలీయొక్కచరిత్ర కొంతవిమర్శింతము. ఈమె చూపులకుఁ బది పండ్రెండుసంవత్సరముల వయస్సుగల బాలికవలె కనఁబడుచుండునుగాని పది సంవత్సరములనుండి బేగముమహాలులో నామెను జూచుచుండువారామె పిల్లకాదనియు, శరీరస్థితి, యాకారమెప్పుడు నాప్రకారమే యుండెననియుఁ జెప్పుచుందురు. ఆమె యెక్కువయందకత్తెయని చెప్పవీలులేదు. కాని కురూపికాదు. ఆమెయొక్క నల్లనివెండ్రుకలు చుట్టలుచుట్టుకొని యామెభుజముల మీఁదఁ జిందులాడుచుండెను. ఆమె విలువగల దుస్తులెన్నఁడును ధరించదు. ఆమె యెక్కడపుట్టినదో, యేకులమో, తల్లిదండ్రులెవరో యెవరికిని దెలియదు. బేగముమహాల్ వంటి యద్భుతభవనమందామెయు నొక యద్భుతదర్శనమే! ఎవరైన నామెపుట్టకవిషయమై ప్రశ్నించిన జబాబుచెప్పక నవ్వుచు నక్కడనుండి యామె

తొలఁగిపోవును. ఈపిల్లవిషయమై యొకయద్భుతమైన సంగతికలదు. శరీరము దుర్బలమైనను గనులు నిప్పులవలెఁ బ్రకాశించుచుండును. ఎవరికైన యామెయెడ దురభిప్రాయముగలిగిన నామెదృష్టికి భయపడి యామెదగ్గఱకుఁజేర వెఱతురు.

చాలకాలముక్రిందట నీమె యేదేశమునుండియో బేగము మహాలునకుఁ దేఁబడెను. ఆమహాలులో నామెకున్న స్వాతంత్ర్యము నిరుపమానము. జులేఖావంటిదానికికూడ నూర్జహాను నామూతురము లుగలయుంగరము చూపినఁగాని బయటకు వెళ్లుటకుఁగాని లోనికివచ్చుటకుఁగాని యాజ్ఞలేదు. కాని యీపిల్లవిషయములో నట్టి యాతంకములేమియు లేవు. ఆమెను మహాల్లోనుండి బయటకు వెళ్లునప్పుడుగాని లోనికివచ్చునప్పుడుగాని యెవరు నడ్డుపెట్టరు. జులేఖా నూర్జహానులకామెయందుఁ జాలదయ. ఈపిల్ల పైకి పిచ్చిదానివలె కనుపించినను జాల తెలివితేటలుగలది. ఈతెలివితేటలు నూర్జహాను గ్రహించెను. అప్పుడప్పుడీమె పిచ్చిదానివలెనటించుచు నసంబద్ధపు మాటలు మాటాడుచుండును. పిచ్చిపిల్లయని యూహించి జనులామెకు తినుటకు పండ్లు, మిఠాయి పెట్టుచుందురు. అనేకసార్లామె బేగముమహాలునుండి బయటకువెళ్లి చాలదినముల తరువాత తిరిగి వచ్చుచుండును.

ఈసారి యామె యాగ్రానుండివెళ్లి వారముదినములైనది. ఎక్కడకువెళ్లినదియుఁ దెలియదు. ఎప్పుడో యొకప్పుడామె తిరిగి వచ్చునని జులేఖా యామెవిషయమై వ్యాకులపడియుండలేదు. ఆమె బహుతొందరగానడిచే మృగముకంటె తొందరగా నడవఁగలదు. ఉడతవలె నొకచోటినుండి యింకొకచోటి కతిత్వరితముగఁ బ్రాకఁ గలదు. కోతివలె యెంతపెద్దచెట్టయినను లేక యింటిపై భాగమున

కైనను క్షణమాత్రములో నెక్కి పోఁగలదు. ఎవరు నామెవెంటఁబడి యామెను పట్టుకొనలేరు. ఆమెవచ్చి జులేఖాగదిలోఁ బరుండుట ద యామణికూడ కనిపెట్టలేదు.

అట్టిదులాలీ మార్గాయాసమువలనఁ దిరిగి గాఢముగా నిద్రిం చగా జులేఖా యింకొకపడకమీఁద కూర్చుండి యేదో యాలోచిం చి తత్క్షణమే తన యినుపపెట్టె తెఱచి యందులోనున్న కాకితములు బయటకుతీసి యొకటితరువాతనొకటి చింపి దీపమునందుఁ దగులబెట్ట సాగెను. ఆప్రకారము కాకితములన్నియు భస్మముచేసి యొక పెద్ద నిట్టూర్పువిడచి తనలోఁ దానిట్లనుకొనెను.

ఆహా! దైవఘటనదాఁటుట కెవరికిని శక్యముకాదుగదా! నేనింకను నెన్నికష్టములను బొందవలసియున్నదో భగవంతునికే యెరుక. నాజీవితముయొక్క యాశ ఫలోన్ముఖమునకు వచ్చుటకిది యేసమయము. దైవమేమిచేయఁదలఁచుకొనెనో తెలియదు.'

ఈప్రకార మాలోచించుకొనుచుండఁగా నౌబత్తువినఁబడెను. దానినిబట్టి తెల్లవారినట్టుగ తెలిసికొని చక్రవర్తియింకను నూర్జహా ను మందిరమందుండెనేమో యని సందేహించి తన గదికిటికీ తెరచె ను. సూర్యకిరణములు లోనికిఁ బ్రసరించెను. కాని యాగ్రాపట్టణ మింకను చీఁకటిలోనే మునిగియుండెను. మహల్ లోనుండు జను లందఱు నింకను నిద్రాదేవి యొడిలోనేయుండిరి. ‹ ఏమి! పర్వేషు రాజకుమారుఁడు తెల్లవారకపూర్వమే యుద్ధమునకువెళ్లునని దులా లీ చెప్పినదే! ఆసంగతి నిజమైన నీసరి కాగ్రాపట్టణమంతయు నల్ల కల్లోలముగా నుండవలసినదే. దులాలీ యబద్ధమాడెనా? లేక యామెకెవరైన యసత్యవార్తనుజెప్పిరో? ఐనను మనజాగ్రత్తలో

మనముండుటమంచిది ' అని జులేఖా యూహించి దులాలీనిలేపి యామెను ప్రాతఃకాలకృత్యములు నిర్వర్తింపుమని చెప్పెను. ఆమె యట్లు చేసెను. దయామణి యింకను నిద్రించుచుండెను. అప్పుడు జులేఖా దులాలీచెవిలో నేదో చెప్పెను. దులాలీ యదిగ్రహించి ' తెలిసినది —పత్తేపూరుసిక్రి ' అనెను. ' కొన్ని బంగారునాణెములు తీసికొని బండికట్టించుకొని వెళ్లుము ' అని జులేఖా చెప్పెను.

' అనవసరము. నానల్లరంగణా (పొట్టిగుఱ్ఱము) కోటబైట నున్నది. మీరాదుర్గాపడవలదు ' అని దులాలీ బదులుచెప్పెను.

## ౨౮ వ ప్రకరణము.

దులాలీ రెప్పపాటులో దృష్టిపథమునుండి వెళ్ళిపోయెను. జులేఖా తాను తనగదినుండి బయటకువచ్చి నౌకరునులేపి ' నీవు నీ పనులయందుండుము. నేను నూర్జహానువిషయమై భోగట్టాచేసివచ్చెదను ' అనెను.

జులేఖాకు రాత్రియంతయు నిద్రలేదు. కూర్చుండియే యుండెను. చక్రవర్తి నూర్జహానుగదినుండి బయటకువెళ్లిన నామెకు తెలిసియేయుండును. సాధారణముగ జహంగీరు రాత్రి యేబేగమునొద్దపరుండిన నొకరాత్రివేళలేచి తనగదికివెళ్లి నిద్రపోవుచుండును. గాని నూర్జహానువిషయములో నట్లుకాదు. సాధారణముగ రాత్రియంతయు నామెయొద్దనే గడుపుచుండును. చక్రవర్తి తనయొద్దనున్నంతకాలము నూర్జహాను జులేఖాను పిలుచుటగాని జులేఖా యక్కడకువెళ్లుటగాని జరగదు. ఈదినమున నింకను జహంగీరు నూర్జ

హాసుమందిరమందే యుండినయెడల తాను తనమనస్సువేధించుచుం డు ననేకసంగతులు సావకాశముగ నాలోచించుటకు వీలుగలుగునని జులేఖా యనుకొనెను. ఈసంగతి తెలిసికొనుటకై జులేఖా నూర్జహా నుగదియొద్దకు వెళ్ళెను. గదితలుపు మూయఁబడియుండెను. గుమ్మ మునొద్ద నిద్దఱుదాసీలుపరుండి గాఢనిద్రలోనుండిరి. తలుపు నెమ్మ దిగ తెఱచి లోనికిఁ దొంగిచూడఁగా నూర్జహానింకను గాఢనిద్రలో నుండెను ఆమె వంటరిగానే పరుండియుండెను. తిరిగి నెమ్మదిగ తలు పువేసి బయటపరుండియున్న దాసీలనులేపెను. తమనులేపినది నూర్జ హానని యూహించి దాసీలు భయముతో నులికిపడిలేచిరి. కాని జులేఖాయనిగ్రహించి మనస్సు స్థిమితపరచుకొనిరి. అప్పుడు జులేఖా నెమ్మదిగా వారిని ‘ చక్రవర్తి రాణీగారిగదినుండి యెప్పుడు వెళ్లిరి’ అని యడిగెను.

‘ మేము నిద్రపోతిమి. మాకుఁదెలియదు. మమ్ములను లేప లేదు ’ అని దాసీలు బదులుచెప్పిరి.

‘ ఏమి జహాంగీరుచక్రవర్తి యింతజాగ్రత్తగల వ్యక్తిగామా రెనా ? ’ అని తనలోఁదాననుకొని జులేఖా దాసీలతో ‘ బాదుషాబే గముగారు మీతో నేమైనచెప్పినారా ? ’ అని యడిగెను.

“ మేము నిద్రించకపూర్వమామె బయటకువచ్చి ‘ చక్రవ ర్తిగారు బయటకువెళ్లినారు. నేను నిద్రపోయెదను. ఎవరునువచ్చి నన్ను లేపకుండ జాగ్రత్తగ పహారాయిచ్చుచుండవలెను ’ అని చె ప్పెను. మేమాప్రకారము రాత్రియంతయుఁ గాపలాకాచి యింత కుముందే యొడలు తెలియక నిద్రించితిమి ” అని దాసీలుచెప్పిరి.

ఇంకను నిద్రపోవద్దు. నూర్జహానుకు తెలిసిన మీప్రాణము లుదక్కవు. ఆమె నిద్రనుండి లేచినతోడనే నాకుఁదెలియపరచుఁడు’

అని జులేఖా చెప్పి వెళ్లిపోయెను. దారిలో నామె తనలోఁదానిట్లను కొనెను.

‘ నామనస్సులోనున్న నుద్దేశము నెరవేర్చుకొనుటకిదియే సరియైనసమయము. రాత్రికలిగిన యనుభవములవలన నామనస్సు కలవరముఁజెందియున్నది. మోతీమహాల్ క్రిందిభాగమునకు రహస్య మార్గముద్వారా నన్నుఁగప్పించి ఫకీరువేషముతో నాతో మాటలాడినది చక్రవర్తియా! అతఁడైన నేను గుర్తించలేకయుందునా? నేనీమహాలునందలి రహస్యమార్గములు గదులన్నియుఁ దెలియుననే భ్రమలోనున్నాను. నాకుఁదెలియనివి చాలయున్నవి. నాముఖ్యోద్దేశము నెరవేరకుండ నాజీవిత మీదినముతో నంతరించునుకాఁబోలు. ఇన్నిసంవత్సరములనుండి రహస్యముగజరిపిన కృషియంతయు నీదినమున నూర్జహానుయొక్క మాటలలో నిష్ఫలము కాఁగలదుకాఁబోలు. ఆహా! దైవమా! యెట్టిస్థితికిఁదెచ్చితివి! అయిన నిప్పుడు నూర్జహాను నిద్రించుచున్నది. గనుక నిది మంచితరుణము ’ అని యనుకొని జులేఖా ఖోజానాయకుఁడగు మసూరి భవనమునకు వెళ్లెను. మసూరి చాల భాగ్యవంతుఁడు; బేగముమహాల్‌లో కర్చుపడు యావత్తుపైక మతనిముఖమున కర్చుపడవలసినదే. ఇదిగాక యుమ్రావులకుమాళ్లు, రాజపుత్రులు, రాజపుత్రికలు, మహాలులోనుండే బేగములు, కన్యకలు యావన్మంది యితనికి లోఁగియుందురు. వారి రహస్యాలోచనలు, గుప్తప్రవర్తనలు, నాయికానాయకుల సమావేశములు మసూరి యెఱుకలేనిది జరగనేరవు. కనుక వారందఱతనికి విలువగల యనేకాభరణములు బంగారము మున్నగు బహుమతులిచ్చుచుందురు.

అట్టి మసూరియొద్దకు జులేఖా యుదయమువచ్చుట చూచి మసూరి యాశ్చర్యపడి కారణమామెనడిగెను.

' రాజకీయవ్యవహారము ' అని జులేఖా బదులుచెప్పెను.

తరువాత జులేఖా యొక యాసనముమీఁద కూర్చుండెను. జులేఖాకు నూర్జహానుకుగలస్నేహము మస్రూ యెఱుఁగును. మస్రూకు జులేఖాకు నీదిగువసంభాషణ జరిగెను.

జు—రాజకుమారుఁడు యుద్ధమున కెప్పుడువెళ్లెను?

మ—ఏరాజకుమారుఁడు?

జు—షహజాదా పర్వేషు.

మ—గతరాత్రి పర్వేషు యుద్ధమునకువెళ్లెను.

జు—రాత్రిప్రపర్వేషుతోనున్న స్త్రీలెవ్వరు?

మ—ఈసంగతియెవరికికావలెను? నీకానూర్జహానుగారికా?

జు—నూర్జహానుగారికే.

మ—వారు నగరమునుండివచ్చిన వారవిలాసినులు.

జు—వారు ప్రస్తుతమెక్కడనున్నారు?

మ—వారు వారియిండ్లకుఁ బంపివేయఁబడిరి.

జు—గతరాత్రి నేను బయటకువెళ్లినసంగతినీకుఁదెలియునా?

మ—నాకుఁ దెలియదు.

జు—చక్రవర్తి నూర్జహానుగదినుండి యెప్పుడు వెళ్ళినది చెప్పఁగలవా?

మ—రాత్రి చక్రవర్తి జనానాలోనికి రాలేదు. కుమారుని యుద్ధమునకుఁబంపుట తొందరలోనున్నారు.

ఆమాటవిని జులేఖామనస్సు కళవరపడసాగెను. ఎట్టకేలకు కుదురుపరచుకొని తాను తనగదికి తిరిగివచ్చి, ' ఆహా! యేమి! నానౌకరు నాతో యబద్ధముచెప్పినదా? అట్లుచెప్పుటకుఁ గారణమేమి? గతరాత్రిజరిగిన సంఘటనలు తలఁచుకొనిన 'మనస్సుయొక్కయాందోళన హెచ్చగుచున్నదే! యేమి కానున్నదోగదా!

ఈప్రకారమాలోచించుచు నేదోసంగతి యూహించి భయమువల్ల మొద్దుబారిపోయెను. భూదేవి తనను దనగర్భములోనికిఁ దీసికొనిపోవుచున్నట్లామెకుఁ దోఁచెను.



## ౨౮వ ప్రకరణము.

జులేఖాముఖము తెల్లబారెను. మనస్సునం దాందోళనమధికమాయెను. రాత్రియంతయు నొకకునుకైనను గునకలేదు. నిరాశతో నొక్కనిట్టూర్పువిడిచి తనలోఁదానిట్లు తలపోయసాగెను.

‘ఆహా ! నాజీవితవిషయమై నాకేమియు లెక్కలేదు. కాని నేను 10 సంవత్సరములనుండి యేయుద్దేశముతోఁ బనిచేయుచున్నానో యాకార్యము సఫలముకాకపూర్వమే చావవలసివచ్చుచున్నదని చింతించుచున్నాను. సూర్జహాను నిద్రలేచుటతోడనే తప్పక నన్నుఁ బిలిపించును. ఓదేవుఁడా ! నన్నెట్టిస్థితికిఁ దీసికొనివచ్చితివి ?’ అని విచారించి పక్కమీఁదనొరిగి శరీరము డస్సియుండుటవల్ల నిద్రపోయెను. కాని యది గాఢనిద్రకాదు. యేదోయొక భయంకరమగు కలఁగని యొడలు చెమటలుపోయ వణఁకుచు నిద్రనుండిలేచెను. లేచుసరికి యొకదాసి తనయొద్ద నిలిచియుండెను. తన ముఖవర్చస్సువల్ల నామె తన మనోవ్యాకులత తెలిసికొనునేమోయని ముఖము ముసుకువేసికొని దాసితో ‘ఏమి నీవువచ్చి యెంతసేపైనది? ఇప్పుడెంత పొద్దెక్కినది ? రాత్రియంతయు నిద్రలేనికారణమున నింతకుముందే నిద్రపట్టెను’ అనెను.

‘ ఇప్పుడు రెండుజాములైనది. నూర్జహానుసాహేబుగారు మిమ్ములను బిలిచికొనిరావలసినదిగా సెలవిచ్చియున్నారు. ఆమె సిస్ మహల్‌లో మీకొఱ కెదురుచూచుచున్నారు.’ అని దాసి చెప్పెను. ‘ సిస్ మహల్‌లోనా ?’ అని యాశ్చర్యముతో జులేఖా యడిగెను. ‘ ఎండవేఁడిమివల్లఁ గ్రిందిగదులలోనికి వెళ్లినారు ’ అని దాసి బదులుచెప్పెను.

‘ ఇంకెవ్వరైన నామెతోనున్నారా ? ’ అని జులేఖాయడిగెను.

‘ ఎవరును లేరు ’ అని దాసి బదులుచెప్పెను.

‘ నేనిప్పుడే వచ్చెదను. నీవు వెళ్లవచ్చును ’ అని జులేఖా యనెను. దాసి వెళ్లిపోయెను. జులేఖా తత్క్షణమే లేచి యినుపపెట్టె తెఱచి యేదో సంగతి యొక కాగితపుముక్కమీఁద వ్రాసి దయామణిని పిలిచి ‘ నీవు నన్నుఁ బ్రేమించుదానవు. ఆకారణమువల్లనే నీవు నీ దేశమునువిడిచి నాతో వచ్చియున్నావు. నేను నీతో సావకాశముగ మాటలాడుటకు వీలులేదు. బహుశా యీదినమే నాజీవితముయొక్క యంతిమదినము. అందువల్ల నీకుఁ దిరిగికనుపించను. నేను సాయంకాలములోపుగా తిరిగి యీగదిలోనికి రానియెడల నీపెట్టెలోనున్న ధనమునుయావత్తు నీవు తీసికొని ఫత్తేపూరుసిక్రికి వెళ్లుము. ఇందులోసగముధనము దులాలీకిమ్ము. మిగిలినసగము నీవు తీసికొని నీయిష్టప్రకార మనుభవింపుము. ఆధనమువల్ల నీవు యావజ్జీవము సుఖముగ నొకరియొద్ద నవుకరీయవసరములేకుండ రాణివలె సుఖింపఁగలవు ’ అని చెప్పెను.

దయామణి విచారముతో ‘ నేనీరాత్రి ఫత్తేపూరుసిక్రి కెట్లు వెళ్లగలను ? ’ అని యడిగెను.

‘ ఆగ్రా చౌకుబజారులోనున్న తములపాకులవర్తకురాలగు గాంగియా నీకు యేసహాయముకావలయునన్న నాసహాయము చేయును. నిన్నామె పత్తేపూరుసిక్రీకి తీసికొనివెళ్ళగలదు ’ అని జులేఖా బదులుచెప్పెను.

‘ పత్తేపూరుసిక్రీలో నెవరియొద్దకు నేను వెళ్ళవలెను ? ఎవరు నన్నాదరించెదరు ? ’ అని దయామణి యడిగెను.

‘ దులాలీని గలిసికొనుము. ఆమె నిన్ను నీస్వగ్రామము తీసికొనివెళ్ళగలదు ’ అని జులేఖా చెప్పెను.

అప్పుడు దయామణి కన్నీటితో ‘ నీవిషయమై యేమి ? ’ అని యడిగెను.

జులేఖా తెచ్చిపెట్టుకొనిన నవ్వుముఖముతో ‘ భగవంతుని దయగలిగిన నిన్నుఁ దిరిగికలిసికొనెదను ’ అనెను.

దయామణి బిగ్గరగా నేడ్వనారంభించెను. జులేఖా యామె నోదార్చి ‘ నేను చెప్పినప్రకారము తప్పకచేయుము ’ అని తిరిగి చెప్పెను.

‘ ఈవస్తువులన్నియు నీరాత్రివేళ నేను తీసికొనివెళ్ళుచుండఁగా నన్ను పహరావాండ్రడ్డుపెట్టి వెళ్ళనియ్యరేమో ? అని దయామణి సందేహముతోఁ బలికెను.

జులేఖా తన దాసీయొక్క బుద్ధికుశలతకు మెచ్చుకొని తిరిగి యాలోచించి ‘ అట్లైన పగలే బయలుదేరుము. నేను ఖోజామసూరుకు యుత్తరమిచ్చెదను. ఆయుత్తర మతనికిఁజూపించిన నిన్నతఁడాతంకములేకుండ విడిచిపెట్టును ’ అని చెప్పి మసూరుపేర నీదిగువ యుత్తరము వ్రాసెను.

ఖాన్‌సాహేబు మస్రూకు—

'రాణీగారి యుత్తర్వుప్రకారము నానౌకరామె న్వగ్రామము పంపివేయుచున్నాను. ఆతంకములేకుండ నామె యామెవస్తువులతో బయటకువెళ్లనిమ్ము.'

పైప్రకారమువ్రాసి యాయుత్తరమును మొదట తాను వ్రాసినచీటియును దమామణిచేతికిచ్చెను' కాకితము చీటిమొక్క జాగ్రత్తగా దులాలీచేతికీయవలసినదనియు నెవరికిని జూపకూడదని యుఁ బారవేయకూడదనియుఁ జెప్పెను.

ఇంతలో రాణీగారియొద్దనుండి తిరిగి నౌకరువచ్చి 'రాణీగారు మిమ్ములను దీసికొనిరమ్మని యాజ్ఞయిచ్చియున్నారు' అని చెప్పెను. జులేఖా యామెతో సిస్‌మహాల్‌కు వెళ్లెను. త్రోవలో తన యొక్క పూర్వజీవితమంతయు జ్ఞప్తికివచ్చి విచారపడెను. కాని యా విచారము పైకిఁ గనపడనీయలేదు.

సిస్‌మహాల్‌లో నూర్జహానొక పెద్దగదిలో నొంటరిగాఁ గూర్చుండియుండెను. ఆగది నేల యడుగుభాగమందుండు గదిగనుక నెక్కువవెలుతురు లేదు. చీకటిగనుండెను. జులేఖా వెళ్లుసరికి నూర్జహానొక ముఖమల్ సోఫామీఁదఁ బరుండియుండెను. జులేఖానుజూచి యామె లేచికూర్చుండెను. ఆమెముఖమునందు పూర్వపునవ్వులేదు. ప్రసన్నతలేదు. గంభీరభావముతో నుండెను. కొంతకాలమువఱకు నెవ్వరును మాటాడలేదు. తరువాత నూర్జహానిట్లనెను.

'జులేఖా నేనెక్కువమాటలు మాటాడుదానను కానని నీకే తెలియును. నేను నిన్ను 10 సంవత్సరములనుండి నాసోదరివలెఁ బ్రేమించుచు నీయాలోచన తీసుకొనుచు నీయిష్టప్రకారము పోవుచుంటిని. నీవు స్వామిద్రోహము చేసినావు.'

జులేఖా యాతురతతో ' బాదుషా బేగమా ? ' అని ఏమో చెప్పఁబోవుచుండ నూర్జహానామాటల కడ్డమువచ్చి యాదుసింహా మువలె యెత్తునికనులుచేసికొని యిట్లనెను.

' ఇంతవఱకు నాపరిక్కలో నొకపామును బెంచుచున్నాను '

జులేఖా తిరిగి యేమేమో చెప్పఁబోవఁ జెప్పనీయక నూర్జహా నీపరికారమనెను. ' నీవింతవఱకు మొగలాయీసామ్రాజ్యము నాశనముకొఱకై ప్రయత్నించుచున్నావు. ఓకృతఘ్నురాలా ! నిన్ను పోషించుట పామునకుఁబాలుపోసి పెంచునట్లున్నది.ఉదయపురం రాణాయగు కర్ణసింగును జక్రవర్తి చేయఁదలఁచి మహాబత్ ఖాన్ భీమసింగులతోఁగలసి రాత్రింబగళ్లు నీవుకుట్రాలోచన చేయుచున్నావు.'

జులేఖా గద్గదస్వరముతోఁ దిరిగి యేమో చెప్పఁబోయెను. కాని నూర్జహానామెను మాటాడనీయక నిట్లనెను.

' నోరుమూయుము. ఓనీచురాలా ! దుర్మార్గురాలా ! పర్వేషు ఖురుము రాకుమారులను జంపించుటకు యుద్ధముపన్నియుంటివి. అందులో నొకరిదివఱకే కనిపించుటలేదు. పర్వేషు యిప్పుడు యుద్ధమునకు వెళ్లినాఁడు. అతనిసంగతి యెట్లుండునో తెలియదు.'

జులేఖా మనస్సు కుదుటపెట్టుకొని ' బాదుషా బేగముగారూ! తమరుచెప్పినదంతయు నబద్ధము ' అనెను.

' ఎన్నటికిని యబద్ధముకాదు. నేనీసంగతులు చాలకాలము నుండి వినుచున్నాను. కాని నీయందుండు నమ్మకమువల్లను బ్రేమవల్లను వానిని నమ్మలేదు. నేనిప్పుడాసంగతులు నిజమని నమ్ముచున్నాను ' అని నూర్జహాను పలికెను.

జులేఖా ధైర్యముతో ' ఎవరోగిట్టనివారు నాపై యీవనంతి వేసియుండవచ్చును. కాని మీరీవిషయమై నాయందుఁ దప్పేమైన స్వయముగాఁ గనిపెట్టినారా ? ' అని యడిగెను.

‘ లేదు. నేను గంటితో నేమియుఁజూడ లేదు. ఆవిషయములో నీ తెలివి తేటలు ప్రశంసనీయములే ’ అని నూర్జహాను చెప్పెను.

‘ నాకట్టికుట్రతో నేమిసంబంధము ? దానివల్ల నాకేమియు పయోగము ? తమరే యాలోచింపుఁడు ’ అని జులేఖా యనెను.

నూర్జహాను గంభీరస్వరముతో నిట్లనెను. ‘ ఏమి యుపయోగమా? చెప్పెదనువినుము. నీమామ బ్రతికియున్నాఁడు. నీకుమార్తె బ్రతికియున్నది. కర్ణసింగును జక్రవర్తిచేసి యతనికి నీకుమార్తెను వివాహముచేసి నీవు చక్రవర్తినియొక్క తల్లికావలెనని కోరుచున్నావు. నీకు బరద్వానులోఁగలిగిన పరాభవమునకుఁ బ్రతిక్రియ చేయఁజూచుచున్నావు.

జులేఖా యామాటలువిని నవ్వుచు ‘ నేను నాజీవితమువిషయమై లెక్కచేయను. పూర్వమే నేనాత్మహత్య చేసికొనవలయునని యూహించితిని. కాని తమయొక్క నిరుపమానకటాక్షమువలననుఁ దయవలన నాపనియందు విముఖురాలనైతిని. నాకుగలిగిన యధికారమువలన నాయందు చాలమందికసూయత గలిగి వారు నాకువిరోధులుగానున్నారు ’ అని యింక చెప్పలేక వెక్కివెక్కి యేడ్వసాగెను. కాని యీస్థితికూడ నూర్జహాను మనస్సునందెంతమాత్రమును దయగలిగించియుండలేదు. అప్పుడు జులేఖా ‘ నావిరోధులమాటలు మీరు నమ్మితిరా ? అని యడిగెను. నూర్జహాను దృఢమైన స్వరముతో ‘ నేను విన్నమాటలెన్నటికిని యబద్ధములుకావు. నీదుర్మార్గతవిషయమై నాయొద్ద తగినంత సాక్ష్యమున్నది ’ అని నూర్జహాను బదులుచెప్పెను.

జులేఖా నిరాశతో ‘ నేను రాణీగారితో నింకవాదించిన బ్రయోజనములేదు. తమరు దానికి యేశిక్షవిధించనెంచెదరో విధింపుఁడు ’ అనెను.

నూర్జహాను కోపముతోఁ బండ్లుకొఱుకుచు 'నీవు నీయొక్క దుర్మార్గములకుఁ దగినశిక్షను బొందెదవు. నీతల నరికివేయుటకంటె నీకుఁ దగినశిక్ష నింకొకటిలేదు' అని నూర్జహాననెను.

———

# ౨౨వ ప్రకరణము.

జులేఖా ధ్యానసమయమందు మనుష్యులయొక్క కాలిచప్పుడువిని వెనుకకుఁజూడగా నిద్దఱు నల్లని పొడుగుపాటి మనుష్యులు విచ్చుకత్తులతో గుమ్మమునొద్ద కనుపించిరి. వారిని చూచినతోడనే జులేఖా పైప్రాణములు పైకినెగిరిపోయెను. నోటమాటలేదు. గుండె దడతోఁ గొట్టుకొనసాగెను. కాళ్లుతడఁబడెను. ఇంకొక యితర వ్యక్తియైన భయముతో నొడలు తెలియక మూర్ఛపొందియుండును. కాని జులేఖాయొక్క మనోధైర్యములవిషయమై యిదివఱకే చెప్పియున్నాము. ఆమె ధైర్యమువహించి స్ఫుటమైన స్వరముతో 'ఓమహారాణీ! నాతల తలవరులచే నఱికించిన నీకు లాభమేమి? నేను నీయొక్కనమ్మకమునకు దూరస్థురాలనైనప్పుడు నాజీవితమింక వ్యర్థమే. దయచేసి విషమునిప్పించిన నదిత్రాగి తమసాన్నిధ్యమందే నాజీవిత మంతమొందించుకొనెదను' అని చెప్పెను. రాణియేమియును మాటాడలేదు. ఆసమయముచూచి జులేఖా 'నావిరోధులమాటలు నమ్మి నన్ను—' అని యేమోయనఁబోవ నూర్జహానడ్డమువచ్చి విసుకుతోఁ గాళ్లు నేలమీఁదఁగొట్టి 'తలవరులారా' అని కేకవేసెను. తలవరులిద్దఱు జులేఖాయొద్దకు వచ్చిరి. జులేఖా ధైర్యముతో గంభీరముగాఁ దలవరులను దూరముగా పొమ్మనిచెప్పఁగా వారు

తిరిగి వెనుకకు వెళ్లిరి. అప్పుడు జులేఖా నూర్జహాను పాదములపై (బడి యేడ్చుచు 'మీదాసిపై దయయుంచుఁడు' అని వేడుకొనెను. నూర్జహాను కోపముతో 'నేను 10 సంవత్సరములనుండి నిన్ను నమ్మితిని. ఇంకనమ్మను. నీవుచేసిన దుర్మార్గమునకుఁ దగినంతసాక్ష్యమున్నది' అని తలవరిని తిరిగి కేకవేసెను. అప్పుడు జులేఖా తనహస్తలాఘవమువలన తనహృదయమునొద్ద దాచుకొనియున్న కత్తిని బయటకుఁదీసి నూర్జహానును బెదరించుచు 'బాదుషాబేగమునాహా! మీకెవరును సహాయము రాకపూర్వమే యీకత్తితో మిమ్ముఁజంపగలను. కాని యట్టిహేయపుపని నేను జేయను' అని కత్తిపారవేసి యొక విషసంబంధమైనమాత్రి నోటిలో వేసికొనెను. ఇదియంతనొకక్షణకాలములో జరిగెను. అప్పుడు జులేఖా కడసారి యిట్లనెను.

'బాదుషాబేగమా! నాకడసారిమనవి వినుము. నేను మీయొద్ద ప్రేమతో నౌకరీ చేసియుండినయెడల మీయొక్కహృదయమందుఁ గొంచెమైనను దయయుండునెడల నాతుదికోరిక నెరవేర్పఁ బ్రార్థించుచున్నాను. నామృతకళేబరము హిందూమతప్రకారము దహనముచేయించకోరుచున్నను. దానిని బాతిపెట్టుటగాని యింకొకవిధముగా వినియోగపరచుటగాని చేయవద్దని మీయొక్కదయ కిదివరలో పాత్రురాలగు జులేఖాయొక్క తుదికోరిక.' ఈమాటలు తొందరగా నస్పష్టముగా నూర్జహానుకు వినఁబడెను. ఆమె జులేఖా ముఖమువంక చూచుచుండెను. జులేఖా నిలుచుండలేక తత్క్షణమే భూమిమీఁదఁ గూలఁబడెను. ఈయకస్మాత్తుఘటనచూచి నూర్జహానుముఖము వెలవెలఁబోయెను. ఆమె తనసోఫామండిలేచి స్పృహ తప్పి వెల్లకిల మొద్దువలెఁబడియున్న జులేఖాశరీరము చూచెను. మరణచిహ్నములన్నియు నాశరీరమందుఁ గనుపించెను. కనులు తెలుపఁ

బడియుండెను. గుడ్లు కదులుటలేదు. తెలివియెంతమాత్రము కనిపించదు. విషముయొక్క ప్రభావమువల్ల శరీరావయవములన్నియుఁ గొయ్యవలె బిగిసిపోయెను.

కొంతవఱకు సూర్జహాను శిలావిగ్రహమువలె చైతన్యము తప్పి నిలువఁబడెను స్పృహవచ్చినతరువాత జులేఖా కళేబరమున్నచోటికిఁ బరుగెత్తుకొనివచ్చి యాకళేబరముప్రక్కఁ గూర్చుండెను. అప్పుడామె మనుష్యసంబంధమైన గుణములు మఱచిపోయెను. దైవసంబంధమైనట్టియు స్త్రీస్వభావమైనట్టియుఁ బవిత్రమైన గుణములకు హృదయము లోనయ్యెను. మనస్సు నవనీతమువలె మెత్తఁబడెను. ఇట్టి భూషణములగు గుణములు గలిగియుండుటచేతనే యామె స్త్రీలోకమునకుఁ దిలకమని యనుపించుకొనఁదగినది. ఆమె తనమృదువైన మృణాళములవంటి చేతులతో జులేఖాతల నెత్తి తనతొడమీఁద నుంచుకొనెను. ఆహా! ఆదృశ్యము చూచితీరవలయును! వర్ణించుటకు శక్తిచాలదు. ప్రపంచములో నందమైన స్త్రీరత్నము తనతొడపైన వంగదేశమందంతటను ప్రఖ్యాతివహించిన యొకస్త్రీరత్నమును బరుండఁబెట్టుకొనెను. రాణి తనచేతులతో జులేఖాతల, హృదయము స్పృశించి, నాడీపరీక్షచేసి ప్రాణవాయు వాకళేబరమునుండి యదివఱకే పోయినట్లు గ్రహించి తనకండ్లవెంట కన్నీరు కార్పసాగెను. ముహూర్తమాత్ర మామెకామెశరీరము తెలియకయుండెను. ఏదో యాలోచనతోఁ గూర్చుండెను. కన్నీళ్లు ముత్యములవలె నామెచెక్కులమీఁద జారుచుండెను. కొంతసేపటికి జులేఖాతల తనతొడమీఁదనుండి నెమ్మదిగ తప్పించి, తివాసిమీఁదనుంచి, లేచి నిలువఁబడి తలవరులతో 'మసూరును నిక్కడికిఁబంపవలయును' అని యాజ్ఞయిచ్చెను.

నూర్జహాను తనసింహాసనము మీఁద కూర్చుని జులేఖా శరీరమువంకఁ జూడఁజాలక తలతిప్పుకొని కూర్చుండెను. ఇంతలో మసూ్రివచ్చి జులేఖాశవమును నూర్జహానుయొక్క స్థితియును జూచి కొంచెముసేపు నిలుచుండి, తరువాత రాణీగారికాళ్ల మీఁదఁబడిలేచి 'సేవకుని కేమియాజ్ఞ' అని యడిగెను. 'అకాత్తుగా నాచెలికత్తె చనిపోయినది' అని నూర్జహాను చెప్పెను. 'సెలవైనయెడల ఖుస్ఖానాలో నీశవమును బారవేయించెదను' అని మసూ్రి బదులు చెప్పెను.

బేగముమహాల్‌లో ఖుస్‌ఖానాయను నొక నేలకొట్టుగలదు. రహస్యముగాను, బ్రత్యక్షముగా ననేకవిధములుగ జచ్చిన, చంపఁబడిన శవములన్నియు దానిలోఁ బారవేసి సున్నముపోయుట యాచారమైయున్నది. అప్రికారముచేయుటవలన దుర్వాసన జనించక చావు విషయమై రహస్యముగ నుండును. శవము లాగదిలోనుండు నంగతి యెవరికిని దెలియదు. అట్టి ఖుస్‌ఖానలో జులేఖాశవముపారవేయుటకు మసూ్రి యాజ్ఞకోరెను.

నూర్జహా నిట్లనెను. 'ఆప్రికారముకాదు. నాప్రియదాసియొక్క శవము హిందూమతాచారము ప్రికారము బ్రాహ్మణులు వలననే దహనము చేయించవలయును. తలవరులకు నాకుదప్ప యింకెవరికిని యీసంగతి తెలియదు. జులేఖా చచ్చినసంగతి యీబేగముమహాల్‌లోఁగాని, యాగ్రిలోఁగాని వేయేల నాసామ్రాజ్యములో నెవరికితెలిసినను నీప్రాణములు నీకుదక్కవని స్పష్టముగనమ్ముము. నేనేదోపనిమీఁద జులేఖాను ఢిల్లీ పంపినట్లు తెలియపరచెదను' అని చెప్పెను.

జులేఖాశవము హిందూశాస్త్రప్రికారము దహనముచేయుటయు నామె చనిపోయినసంగతి యెవరికిని తెలియకుండ కప్పివు

చ్చుటయు నసంభవమనియెంచి మసూరి యేమో చెప్పఁబోఁగా నూర్జహాను కోపముతో ధిక్కరించి, 'నీవు నేను చెప్పినప్రకారము చేయనియెడల నీప్రాణములు నీకుదక్కవని రూఢిగా నమ్ముము' అని తిరిగిచెప్పి యచ్చటనుండి వెడలిపోయెను.

మసూరి తనలోఁ దానిట్లు తలపోయసాగెను. 'శవమును గాల్చుటకు బయటకు పంపినయెడల జనులకు జులేఖా చావుసంగతి తెలియకమానదు. ఖున్ ఖానులో శవము వేసినయెడల చావుసంగతి గుప్తముగ నుంచవచ్చును. కాని యిందుకు రాణీగారు సమ్మతించి యుండలేదు. ఇట్టి యసాధ్యమైనపనిచేయుట యెట్లో నాకుఁ దెలియకున్నది. రాణీగారి యుత్తర్వుప్రకారము జరపనియెడల చావు సిద్ధము. ఆమెమాటకు తిరుగులేదు.'

ఈప్రకారమాలోచించుచు నేమియునుదోఁచక కొంచెము సేపు నిలిచియుండి జులేఖావంక చూచిన నామెదయ్యమై తనను బీకుకొని తిను నేమోయనుభయమువలన నాశవమువంకఁ జూడక రాత్రివేళ నేదోవిధముగ నేర్పాట్లుచేయవచ్చునని యూహించి యాగది కిటికీలన్నియుమూసి గదిబైట తాళము వేసి తాళపుచెవి తనజేబులో నుంచుకొని తనబసకు వెళ్లిపోయెను.

---

## ౩౦వ ప్రకరణము.

అర్ధరాత్రియైనది బేగముమహల్ యావత్తు నిశ్శబ్దముగనుండెను. రాజధానియొక్క సందడి తగ్గిపోయినది. అప్పుడు మసూరి యిద్దరు తలవరులనుబిలిచి, 'మీరు సిస్ మహల్ కువెళ్లి యందుండుశవము

ను బైటకు తీసుకొనివెళ్లి హిందూశాస్త్రప్రకారము దహనముచేసే యేర్పాటుచేయవలెను. ఈకళేబరమెవరిదైనది యేరికిఁ దెలియనీయ వద్దు. జాగ్రత్త. ఇందులోనెంతమాత్రము పొరపాటుజరిగినను మీ ప్రాణములుదక్కవు' అని కఠినముగ నాజ్ఞయిచ్చెను. మఱియుఁ దనయొద్దనున్న తాళపుచెవి వారికిచ్చి తిరిగి యీప్రకారము చెప్పె ను. 'శవమునెవరును గుర్తించుటకు వీలులేనట్టుగా తలనుండి కాళ్ల వఱకుబట్టకప్పి తెల్లవారువఱకు యమునానదియొద్దనకు మోసికొని పోయి హిందూమతప్రకారము దహనముచేసి రావలెను. మీరు బీదహిందువులవలె వేషమువేసికొనవలెను. శవము దహనముచేయు టకు వీలుకానియెడల దానిని యమునానదిలోఁ బడవేసిన ప్రవాహ మువెంట కొట్టుకొనిపోయి గంగానదిలోచేరును. శవము నెవరు నడ్డు పెట్టకుండ కోటబయటకు తీసికొనివెళ్లుటకు నేను తగునేర్పాటు చేసెదను.'

ఆమాటలువిని తలార్లు సిస్‌మహల్‌కువెళ్లి జులేఖాశవము మీఁద నొకబట్టకప్పి దానినొకకఱ్ఱకు గట్టిగాకట్టి మోసికొనివచ్చిరి. మసూరి రాజభవనము, కోటకాపలాకాయుచున్న సిపాయిలకేదో చెప్పి శవమును బయటకుఁ బంపివేసెను. తలార్లు శవమునుమోసికొ ని యమునయొద్దనకే నడచిరి. అంతయు నిశ్శబ్దముగనుండెను. కాని యిద్దఱుమనుష్యులు యీశవవాహకులకుఁ దెలియకుండ వారివెనుక వెంబడించి వచ్చుచుండిరి. 3, 4 మైళ్లీప్రకారము నడచినతరువాత శవముమోయుచున్న యొకఁడు రెండవవానితో నిట్లనెను. 'ఓరీ! ఈశవముచేయి నాముఖమునకుఁ దగులుచున్నదిరా! ఈహిందూశవ ము దెయ్యముకాలేదుగద! దింపరా. చూతము.' అప్పుడిద్దఱును శవమును క్రిందకుదింపి పరీక్షించిరి. శవముయొక్క కుడిచేయి కట్టు

లోనుండి బయటకువచ్చి క్రిందకు వ్రేలాడుచుండెను. చేయి కదలుచుండెను. వారాశ్చర్యపడి శవము పిశాచమైనదని భ్రమఁజెందిరి. కాని యందులోనొకఁడు ధైర్యమువహించి ‹ మనము విసురుగానడచుటవల్ల నాయూపునకు చెయ్యికదలుచున్నది ’ అనెను. తరువాత చెయ్యి కదలలేదు. కాని యాచేతియందు నూర్జహాను నామాక్షరములుగల వజ్రపుటుంగరము ప్రకాశించుచుండెను. నూర్జహానీయుంగరముసంగతి మరచెను. మసూర్ శవమువంక పరీక్షగాఁ జూచియుండలేదు. తలారులాయుంగరముచూచి భయపడిరి. ఆయుంగరముసంగ్రహించవలెనని యూహించిరి. కాని యాయుంగరము తమయొద్దనున్నఁ దమకు ముప్పుగలుగునని భయపడి దానిని ముట్టలేదు. ఆ చేయి తిరిగి కట్టులోఁబెట్టి గట్టిగాఁగట్టి శవమునెత్తుకొని నడువసాగిరి. ఈలోపుగా వెంబడించుచున్న నిద్దఱిలో నొకఁడొక పొదచాటున దాగియుండెను. రెండవవాఁడు గుఱ్ఱమెక్కి యెక్కడికో వెళ్లిపోయెను. తలారులు శవమును గొంతదూరము మోసికొనివచ్చుసరికి యొక స్మశానవాటిక కనపించెను. అందులో దహనమునకు నొక శవము వచ్చియుండెను. వాహకులు కట్టెలనిమిత్తమెక్కడికో వెళ్ళియుండిరి. తలార్లది సరియైనసమయమని యూహించి తాము తెచ్చినశవము నక్కడనుంచి యక్కడ నిదివరలోనుంచఁబడిన శవమును మోసికొనిపోయి యమునలోఁ బారవేసిరి. మొదటిశవముతాలూకు మనుష్యులువచ్చి వారు తెచ్చినశవమదేయని యూహించి దహనముచేయుదురని తలార్లునమ్మి వారితోవను వారువెళ్ళిరి. తరువాత కట్టెలకువెళ్లిన మనుష్యులువచ్చి కట్టెలు చితిగాఁబేర్చి శవమునుతీసి చితిమీదఁ బెట్టుటకై శవమునొద్దకువచ్చిరి. ఇంతలో తెలతెలవారుచున్నందున కొంచెము వెలుతురుగానుండెను. ఆవెలుతురులో వారక్కడనున్న శవమునుజూచి యది తాముతెచ్చినదికాదని సందేహిం

చి దానిపై కట్టినబట్టవిప్పిరి. ఆశవమునుజూచి భయముతో నెత్తురు గడ్డకట్టుకొనిపోవ, తమను విషసర్పము కఱచినట్లూహించుకొని పి క్కబలముచూపిరి.

---

## ౩౦ వ ప్రకరణము.

శవవాహకులను వెంబడించిన యొకవ్యక్తి బహుదీర్ఘకాయుఁడు. బలాఢ్యుఁడు. ఆజానుబాహుఁడు. సైన్యాధికారియొక్క దుస్తులను ధరించియుండి చూపరులకు భీతికొలుపుచుండెను. అతఁడు శవము విడిచిపెట్టఁబడినచోటికివచ్చి శవమునకున్నకట్లువిప్పి యాశవమును దనభుజముపై నిడికొని సమీపముననున్న యొకచెట్టునీడకుఁ దీసికొనివచ్చెను. ఆమనుష్యుఁడాశవము నొక చిన్నపిల్లవలె నెత్తుకొని తండ్రివలెఁ బ్రేమతో నాశవమువంకఁ జూచుచు నాతురతతో నిటునటు నెవరికొఱకో చూచుచుండెను. ఇంతలోఁ గొంతమంది మనుష్యులొకపల్లకీమోసికొని కనుచూపుమేరలో వచ్చుచుండిరి. ఆపల్లకీ ముందొకయువకుఁడు గుఱ్ఱమెక్కి వచ్చుచుండెను. వారినిజూచి మన సేనాని సంతోషముతో నొకధ్వనిచేసెను. ఆధ్వనిగ్రహించి వారితనివైపునకు వచ్చిరి. పదునాలుగురుమనుష్యులు పల్లకిని మోసికొని వచ్చి చెట్టుక్రిందదింపిరి. యువకుఁడు గుఱ్ఱముదిగెను. యువకుఁడును సేనానియుకలిసి జులేఖాశవమునెత్తి పల్లకియందుంచి పల్లకితలుపుమూసిరి. బోయీలు పల్లకినెత్తుకొని పరుగిడసాగిరి. యువకుఁడు తిరిగి యశ్వారోహణముచేసి పల్లకివెంటనే వెళ్లెను. సేనాని పల్లకి కనబడునంతవఱకుఁ జూచి, ఈరెండాషుసింహముల యుద్ధము చూ

చెదనుగాక ! ఇందులో నెవరుజయించెదరో ' అని తనలోఁ దానను కొనుచు నెక్కడికో వెళ్లిపోయెను. పగలు రెండుజాములవఱకు బోయీలు పల్లకిమోయుచుండిరి. గుఱ్ఱపుసవారీచేయు యువకునిజూచి జనులాపల్లకియందేదో యొక గొప్పకుటుంబపుస్త్రీ ప్రయాణముచేయుచున్నదని యనుకొనిరి. రెండుజాములగుసరికి పల్లకి యొక పాడు దేవాలయమునొద్ద నాగెను. ఆదేవాలయము లోనికి వెళ్లుటకు బయటకువచ్చుటకొకటేద్వారముగలదు. చుట్టు నెత్తుగలగోడలు గలవు. ద్వారము లోపల మూయఁబడియుండెను. యువకుఁడు తలుపుతట్టఁగా లోపలనుండి యొక పడుచుసన్యాసిని తలుపు తెఱచెను. సవారి దేవాలయములోనికిఁ బోనిచ్చిరి. ద్వారముతలుపు మూయఁబడెను. జులేఖాశవము లోన దింపఁబడినతరువాత తిరిగి తలుపు తెఱవఁబడినది. వాహకులు సవారీతో బయటకువెళ్లిరి. యువకుఁడగు యుద్ధవీరుఁడు బోయీలను సంతోషపరచి తానెక్కడికో వెళ్ళిపోయెను. యువసన్యాసిని యువకుఁడు కనుపించువఱకు ద్వారమువద్దనిలిచి తరువాత తలుపు లోన బిగించుకొనెను. ఆహా ! కాలమహిమ ! జులేఖా చనిపోయినతరువాత నామె శవమునకు విశ్రాంతిలేదుకదా ! ఒక కాలిబంతివలె నాశవమిటునటు కొట్టఁబడుచుండెను. ఆశ్వికుఁడు కొంతదూరము వెళ్లి తనకొఱకుఁ గనిపెట్టుకొనియున్న యొకమనుష్యునకు గుఱ్ఱము నొప్పగించి తాను నడచి యూరిలోనికి వెళ్లెను. ఊరిగేటు కడ నొకసిపాయి కనుపించెను. అతఁడు ' నీకొఱకు చాలకాలము నుండి వేచియుంటిని. వచ్చితివా ? ' అనెను.

' బెహారీచెరాను ! ఇక్కడికెట్లు వచ్చితివి ? నీకు గుఱ్ఱమెవరిచ్చిరి ' అని రసపుత్రవీరుఁడడిగెను.

' రాజకుమారా ! గుఱ్ఱమెక్కడనో యొకచోట దొరికినది. రాజకార్యమువచ్చినప్పుడాతంకముగలుగునా ? ' అని చెరాను బ

దులుచెప్పెను. ‘సరే నీవు దయామణి యెక్కడనున్నదో వెతకి యామెను దేవాలయమునొద్దకుఁ జేర్పుము’ అని రాజకుమారుఁడు చెప్పెను. ‘పిల్ల నాకొఱకు చాలసేపటినుండి వేచియుండును’ అని చెప్పి చెరాను దయామణిని వెదకుటకు వెళ్ళిపోయెను. రాజకుమారుఁడు తనతోవను తాను వెళ్లెను.

బెహారీచెరాను చిన్నవాఁడు కాఁడు. అతనివయస్సు 60 సంవత్సరములు దాటియుండును. ఐనను బాగుగ బలముగలిగి దృఢకాయుఁడు. అతని స్వగ్రామము వంగదేశములోనిది. అతఁడు గొల్లకులస్థుఁడు. అతఁడే రూపమైనను దాల్చసమర్థుఁడు. ఫకీరు, ముసలిస్త్రీవేషములను వేసికొని తరుచు జనులను నవ్వించుచుండును. అతఁడనేకవిధములుగ మాటాడశక్తిఁగలవాఁడు. ఆదినములలో ఢిల్లీ యాగ్రాపట్టణములయందు రసపుత్రసిపాయిలకు లెక్కలేదు. అక్బరుబాదుషాకాలమందే రసపుత్రులు చాలమంది పటాలములయందు దర్బారునందుకూడఁ బ్రవేశపెట్టఁబడిరి. జహాంగీరుకాలమందుకూడ మొగలాయీ దర్బారునందు పటాలములలో నధికారసంపదయుండియున్నారు. ఇదిగాక ప్రస్తుతకాలమందు యుద్ధముజరుగుననేవాడుకవలన ననేకరాజపుత్రుల పటాలములు రాజధానియందు బసచేసియుండెను. కాఁబట్టి యెవరైన రసపుత్రసిపాయివేషమును ధరించిన వాని విహారమున కెట్టి యాతంకమును గలుగకయుండెను. మహాబత్‌ఖాన్ తురకమతము తీసికొన్నను రసపుత్రుఁడుగనుక రసపుత్రులయందభిమానము కలిగియుండెను. మొగలాయీసేనలన్నిటికి నతఁడుసర్వసేనాని. అతఁడనేక రసపుత్రులకు తన సైన్యమునందు నౌకరీ యిచ్చుచుండెను. ఇట్టిసమయమందు బెహారీచెరాను రసపుత్రసైనికునిగా వేషము వేసికొనుటవల్ల నతనిని యెవరును గుర్తుపట్టుటగాని యాతంకపరచు

టకాని జరిగియుండలేదు. ఈచరానే యిదివరలో పత్తేపూరుసిక్రి గేటునొద్ద యొక యువసన్యాసికి వంటవాఁడుగానుండుట విన్నాము. ఆసన్యాసి యిప్పుడెక్కడనున్నాఁడు? జులేఖాశవము సరిగా విని యోగపరచుటకు బెహారీచెరా నెందుకంతయాత్రముపడియుండెను? ఈప్రశ్నలకెవరు సమాధానము చెప్పఁగలరు!

చరాను మొదట నాగ్రాచౌకుకు వెళ్ళి తమలపాకుల వర్తకురాలగు గాంగియా కొట్టుకడకువెళ్లెను. గాంగియా తమలపాకుల వర్తకమువలన చాలసొమ్ము గడించెను. పట్టణములోనున్న యన్ని దుకాణములకంటె నీమెదుకాణమునందు మంచి శుభ్రమగు తమలపాకులు, సుగంధపువక్కపొడి, మసాలాదినుసు లగరువత్తు లత్తరులు పన్నీరువగైరాలు దొరకును. పట్టణమందలి గొప్పగొప్ప సర్దారు లుమ్రావులు, నవాబులధికారులు, నీమెకొట్టునకువచ్చి సరకులను గొనుచుందురు. ఈమెకొట్టునందలి తమలపాకునుపయోగించుట యాదినములలోఁ జాలగొప్ప. ఆమె మధ్యవయస్సుగలదియై, శరీర సౌష్ఠవమువలనను, మాటలచమత్కారమువలన ననేకులను తమ దుకాణమున కాకర్షించుచుండెను. ఆమె తనకొట్టునకు తంజాము (సవారీ) మీఁద వచ్చుచుండుట యభ్యాసము. ఆమె వంగదేశపు స్త్రీయనియు, రాజా మాన్‌సింగుకాలమున నాగ్రావచ్చి యాయన చనిపోయినతరువాత తమలపాకులయంగడి పెట్టుకొనెననియు జనులు చెప్పుకొనుచుందురు. ఆమె తనయొక్క వృత్తియందధికురాలై యాగ్రాపట్టణమందేగాక చుట్టుపట్లనుండు దేశమంతటను దమలపాకులు వగైరా వర్తకమునందుఁ గడుప్రఖ్యాతి వహించెను.



# ౩౧వ ప్రకరణము.

గాంగియా సోఫామీఁద కూర్చుండియుండి దుకాణమునకు వచ్చినవారందఱిని వారివారిస్థితికిఁ దగినట్టు మర్యాదచేయుచుండెను. ఆమె యెదుటనున్న యిత్తడిపెట్టె బంగారునాణెములతో నిండుచుండెను. ఆసమయమందు బెహారిచెరాను లోనఁ బ్రవేశించెను. గాంగియా యతనినిచూచి నవుకరుతో హిందీలో సింహాజీకి యాసనము వేయుమనెను. బెహారీ తనకుఁ బనియున్నదనియుఁ గూర్చుండటకవకాశములేదనియుఁ జెప్పుచు తమలపాకులపడవ వచ్చినదాయని యడిగెను. ' సమయమునకు సరిగానేవచ్చినది. కాని యాకులు తాజావి కాకుండుటవలనఁ గొన్ని త్రోవలోఁ జెడిపోయినవి ' అని గాంగియా బదులుచెప్పెను.

' సర్కారుద్యోగస్థులు వానిని స్వాధీనపరచుకొనిరా? ' అని చరాను ప్రశ్నించెను.

' లేదు. దానివెంటఁబడి వచ్చిరిగాని యాసొత్తు గాంగియాదిగా తెలిసికొని వెనుకకు వెళ్లిపోయిరి ' అని గాంగియా చెప్పెను.

చరానటునిటుచూచి యెవరును తమను కనిపెట్టుటలేదని నిశ్చయించుకొని ' అయితే తిరిగి వానిని తత్క్షణమే పంపించవద్దా! వారు తిరిగివచ్చెదరేమో! ' అని యడిగెను.

' ఆపని యిదివఱకే జరిగినది ' అని గాంగియా నవ్వుచు బదులుచెప్పెను.

' ఎక్కడకుఁ బంపితివి ' అని చరానడిగెను.

'యమునలోఁ బారవేసితిని' అని గాంగియా బదులు చెప్పెను.

చరానాశ్చర్యముతో గాంగియావంకఁ జూడసాగెను. వీరిద్దఱికి సంభాషణ జరుగునపుడు పదిమంది మనుష్యులు దుకాణములో బేరముచేయుచుండిరి. వారందఱికి గాంగియా బదులుచెప్పుచుండెను. చరాను రసపుత్రుఁడనియు, వర్తకవ్యవహారము మాటాడుకొనుచున్నారనియు వారనుకొనిరి. బెహారీచెరాను తన మనస్సులోనున్న సంగతి గాంగియాకు రహస్యముగాఁ దెలియపర్చవలెనని కోరుచుండెను. కాని యందుకు వీలుగలుగలేదు. ఆసమయమందు వర్తకసరణి యనఁగా బేరగాండ్రయొక్క రద్దీ యెక్కువగానుండెను. వర్తకపుమాటలలో దయామణియొక్క సంగతి చెరాను కనుగొనెను. ఆమె యక్కడకువచ్చినట్టు, నెవరో యామెను వెంబడించినట్టును, గాంగియాయొక్క మర్యాదవలన వారామెను పట్టుకొనకుండ వెళ్ళిపోయినట్టును చరానూహించెను. ఇంకను సరియైనసమాచారము కనుగొనవలెనని యతఁడు తహతహపడుచుండెను. సాధారణముగా బేగముమహాలునందలి బందీలీ (దాసీలు) దుకాణమునకువచ్చి యిక్కడ యువకులతో రహస్యసంభాషణలు జరుపుకొనుచుండుట కలదు. గాంగియాయొక్కస్థితిని గుఱించి యనుమానముగలిగి సర్కారుద్యోగస్తులెవరైనను గాపలాలోనుండి రేమోయని చెరానుకు సందేహముగలిగెను. ఇది గ్రహించి గాంగియా 'ఉత్తరముప్రకారమంతయు జరిగినది. మీరనుమానపడనవసరములేదు' అనెను. కాని యింతటితో చరాను తృప్తిపడలేదు. ఇప్పుడు దయామణి యెక్కడనున్నది. యతనికి తెలియలేదు. దయామణి నగలతో మహాల్‌నుండి పారిపోయినసంగతి నూర్జహానుకుఁ దెలిసినయెడల నామె యెక్కడ దాగియున్నను వెతకి తెప్పించఁగలదనియు దొరకిన నామెతల తప్పక నరికి

వేయించుననియుఁ జరానుకుఁ దెలియును. జులేఖా తాను ఫకీరుతో మాటాడిన మాటలవలన నూర్జహానుకుఁ దనయందనుమానము తగ్గి లినదని స్థిరపరచుకొనెను. నూర్జహానుకు నెవరియందైన ననుమాన ముకలిగెనా యట్టివారిని బంధుమిత్రాదులతోఁగూడ వారిని నిర్మూలముచేయుననుమాట నిశ్చయము. మఱియుఁ దానుచేయు పనియొక్క చిహ్నలేమియు నెవరికిఁ గనుపించకుండఁ జేయఁగలదు. బెహారీచరాను బుద్ధికుశలతగలవాఁడు గనుక నీసంగతులన్నియు నూహించెను. మఱియు నతఁడీప్రకారము తనలోఁదాను దలపోయసాగెను.

‘జులేఖా తన యంత్యకాలము సమీపించినదని తెలిసికొని తనతాలూకు ధనమును జవాహిరీయును దననౌకరు దయామణికిచ్చి గాంగియాయొద్దకుఁ బంపినదని నూర్జహానుకుఁ దెలియునెడల నామె గాంగియానుమాత్రము బ్రతుకనిచ్చునా? జులేఖామరణ మీామెకుఁ దెలియదుకాఁబోలు! తెలిసియుండిన నీప్రకారము దుకాణమందుఁ గూర్చుండి సంతోషముగఁ గాలముగడుపునా? కాదు. కాదు. ఈమెకావార్త తెలియలేదు. ఎట్లు తెలియును! జులేఖా యాత్మహత్య నిన్నగదా జరిగినది! మఱియు నావార్త బహురహస్యముగ నుంచఁబడినది.’

ఈప్రకారము చరాను తలపోయుచు నాతురతతోఁ జూచుచుండెను. గాంగియా యతనిస్థితి కనిపెట్టి ‘మీారుపంపిన తమలపాకులు చాలమంచివి. తిరిగి యటువంటివి పంపవలెను’ అని చెరానుతోఁజెప్పి బేరగాండ్రతోఁ, ‘అయ్యా! ఈయన తమలపాకులసాహుకారు. ఇతనిదయవల్ల మనకు మంచితమలపాకులు దొరుకుచున్నవి’ అనెను. వారాశ్చర్యముతో ‘రసపుత్రసిపాయి తమలపాకుల వర్తకుఁడా?’ అని తమలోఁదాము నవ్వుకొనసాగిరి. ఈలోవుగాఁ జరా

ను గాంగియూతో 'మన తమలపాకుల వర్తకురాలు చనిపోయినదని చెప్పుటకుఁ జాల విచారించుచున్నాను' అనెను. గాంగియా యా మాటవిని పిడుగుపడినదానివలెఁ దెల్లఁబోయి మాటాడలేక చరా నుముఖమువంక దృష్టినిలిపి హీనస్వరముతో 'మీరు చెప్పినసంగతి నిజమేనా!' అని యడిగెను. 'నిజము' అని చరాను బదులుచెప్పెను. ఆమె ముఖమునందుఁగలిగిన మార్పక్కడనుండిన ప్రేక్షకులు కనిపెట్టి యామెవంక నాశ్చర్యముతోఁ జూచుచుండిరి. గాంగియా సామాన్యస్త్రీకాదు. ఆమె చాల మనోధైర్యముగలది. తత్క్షణమే ధైర్యమువహించి 'ఆహా! ఆతఁడు నన్ను పాడుచేసినాఁడు. అతనికి నేను చాల పెట్టుబడి పెట్టియున్నాను' అనెను.

అప్పుడక్కడనున్న యొక సర్దారుఁడిట్లనెను. 'నీకు డబ్బులెక్కయేమి? ఎంతడబ్బు సంపాదించుచున్నావుకావు. నీముఖవైఖరి చూడ నీతండ్రియో, కొడుకో, కూతురో చనిపోయినవార్త వింటివని మేమూహించుచున్నాము. మీరంతా డబ్బుదాసీలు. అందుకొఱకే యిట్లు విచారపడెదరు.' ఆమాటలువిని యక్కడనున్న జనమంతయు నవ్వసాగిరి. గాంగియా 'మీకు డబ్బుసంపాదనయొక్క కష్టము తెలియదు. గనుక నిట్లు హేళనచేయుచున్నారు. ఐనను మీయెదుట నాప్రకార మవినయముచూపినందుకు క్షమింపుఁడు. నాకెంత నష్టముగలిగినది యీసింగుసాహేబుగారితో లెక్కచూచుకొనవలసియున్నది' అనిచెప్పి విచారముతోఁ బ్రక్కగదిలోనికివెళ్లి చరానునుగూడ రమ్మని సైగచేసెను. వారిద్దరును గదిలోఁబ్రవేశించిరి. దుకాణమునందు మామూలుప్రకారము వ్యవహారము జరుగుచునేయుండెను. నవుకర్లు పనియావత్తు జరుపుచుండిరి. గదితలుపు వేసికొని గాంగియా చరాను నరగంటవఱకు మాటాడిరి. ఏమిమా

టాడినది యెవరికిఁ దెలియదు. తరువాత చరాను బయటకువచ్చి యాగ్రాబజారులో నదృశ్యమాయెను. కొంతసేపటికి గాంగియా కూడ గదిలోనుండి బయటకువచ్చి నౌకర్లతోఁ దనశరీరమున బాగుండనందున నింటికివెళ్లుచున్నాననియుఁ గొంచెము నెమ్మదిగానుండిన మధ్యాహ్నము వచ్చెదననియు యథాప్రకారము వ్యవహారము జరుపుచుండుమనియుఁ జెప్పి తనసొమ్ముపెట్టెతో బయటకువచ్చి యొక గుఱ్ఱపుబండియెక్కి యెక్కడకో వెళ్లిపోయెను. ఆగ్రాప్రజలకామెవిషయమై యంతవఱకే తెలియును. ఆమె మధ్యాహ్నము దుకాణమునకు రాలేదు. నౌకర్లారాత్రి యామెయింటికివెళ్ళగా నామెయింటియొద్ద కనుపించలేదు. వారి కనుమానముగలిగినది. గుఱ్ఱపుబండి వానివిషయమై దర్యాప్తుచేసిరి. కాని వానిజాడ యెక్కడను గనుపించలేదు. గాంగియా గాలిలోఁ గలసిపోయెనా ? ఏమైనది యెవరికినిఁ దెలియదు.

ప్రథమభాగము సంపూర్ణము.

———

రంగా అండ్ కో., ప్రింటర్సు, కాకినాడ—1934.